

# మన ఇతిహాసం













"సుమ్నార్థి"

డా॥ కోడూరి సుబ్బారావు



# మన ఇతిహాసం

(సంక్షిప్త పరిచయం)


కర్త :

"సుమ్నార్థి"

**డా॥ కోడూరి సుబ్బారావు**



ప్రకాశకులు :

**గాయత్రీ ఆశ్రమము (ట్రస్టు)**

12-10-586/6, ఆర్య సమాజము, మేడిబావి,

వారాసిగూడ, సికింద్రాబాద్ - 500 061.

గాయత్రీ గ్రంథమాల - 41

'మన ఇతిహాసం'

ప్రథమ ముద్రణ : 1000 ప్రతులు

ద్వితీయ ముద్రణ : 1000 ప్రతులు

సర్వస్వామ్యములు : సురక్షితము ©

విరోధినామ సం॥ శ్రావణ పౌర్ణిమ (ఆగష్టు-2009)

మూల్యము : రూ. **70=00**

(తపాలా ఖర్చులు అదనము)

ప్రతులకు :

గాయత్రీ ఆశ్రమ ట్రస్టు
12-10-586/6, ఆర్య సమాజము, మేడిబావి,
వారాసిగూడ, సికింద్రాబాద్ - 500 061.

శ్రీ మాశెట్టి శ్రీనివాస్ ఆర్య, షాప్ నెం.5, మాశెట్టి బిల్డింగ్,
3-3-736 to 740, కంచరిబజార్, సికింద్రాబాద్-3.
ఫోన్ : 040-6632 0300.

విద్యా బుక్ డిపో, ఆర్యసమాజము ఎదురుగా,
సుల్తాన్‌బజార్, హైదరాబాద్ - 500 095.

ఆర్యసమాజము, కూచిపూడి (తెనాలి తాలూకా) గుంటూరు జిల్లా - 522 313.

డా॥ కోదూరి సుబ్బారావు, వైదిక వానప్రస్థ సాధక ఆశ్రమం,
హనుమాపురము (B.O.), (Via) భువనగిరి - 508 116.
సెల్ నెం: 9290604641.

*Printed at :* **PRINTSHOP** 040-6632 0300.




# ప్రార్థన

ఋషి : కశ్యపః                                    దేవతా - పవమానః సోమః

ఓ పవమాన సోముడా !

యత్ర జ్యోతిరజస్రం యస్మిన్ లోకే స్వర్హితమ్ ।
తస్మిన్ మాం ధేహి పవమాన అమృతే లోకే అక్షితే ।
ఇన్ద్రాయేన్దో పరి స్రవ ॥ (ఋగ్వేదము. 9-113-7)

ఎచ్చట నాశరహితమైన జ్ఞానజ్యోతి ప్రకాశించుచుండునో, ఏ లోకమందు పూర్ణానందము ఉంచబడినదో ఓ పవమాన సోముడా ! నన్ను అక్కడకు చేర్చుము. అక్షయమగు అమృతమును (ఆనందమును) నాకు ప్రసాదింపుము. ఓ సౌమ్యుడా! ఈ జీవుని కరుణింపుము.

ప్రార్థించు
ఒక సుమ్మార్థి,
**కోడూరి సుబ్బారావు**

# ప్రకాశకీయం

ఏ దేశంలో మనం పుట్టి పెరిగి ఉన్నతి సాధించామో ఆ దేశ ఇతిహాస్ని సంస్కృతీ సభ్యతలను తెలుసుకోవడం ప్రతి మానవుని కనీస కర్తవ్యం. మా ట్రస్టు ద్వారా మన సంస్కృతీ సభ్యతలను తెలిపే గ్రంథాలు కొన్ని ప్రచురింపబడ్డాయి. మన ఆదర్శ పురుషులైన శ్రీరామ శ్రీకృష్ణుల యథార్థ చరిత్రలును ప్రచురింపబడ్డాయి. ఇవన్నీ బహుళ ప్రజాదరణను పొందాయి. వాటితోబాటు, మన ప్రాచీన ఇతిహాస్ని తెలిపే పుస్తకం కూడా ఒకటి ప్రచురిస్తే బాగుండునని సంకల్పం కలిగింది. ఇంతేగాక, తెలుగులో అట్టి గ్రంథాలు వెలువడినట్లు మా దృష్టికి రాలేదు. అందుచే ఈ లోటును పూర్తిచెయ్యటానికి ఉడుతా భక్తిగా మా గాయత్రీ గ్రంథమాల 41వ పుష్పంగా ఈ సంక్షిప్త ఇతిహాస గ్రంథం 'మన ఇతిహాసం' పేరుతో ప్రచురిస్తున్నాం. మన ఇతిహాసం అంటే భారతీయుల ఇతిహాసం. మానవుల ఇతిహాసం అనికూడా చెప్పవచ్చు.

పరమేశ్వరుని అనుగ్రహంవల్ల డా॥ కోడూరి సుబ్బారావు గారి ఆరోగ్యం కొంత మేలయ్యింది. వారు చాలా శ్రమించి ఈ పుస్తకం వ్రాసి మా ట్రస్టుకు ఇవ్వటం జరిగింది. వారికి మా హృదయపూర్వక ధన్యవాదములు.

భారతీయ ఇతిహాసం చాలా విశాలమయ్యింది. దానిని సంక్షిప్తపరచి వ్రాయటం చాలా కష్టమైన పని. అందుచే కేవలం చారిత్రిక విషయాలలోని ముఖ్యమైన విషయాలను మాత్రమే వ్రాయటం జరిగింది. అందులోనూ 'ఏది వ్రాయలి ? ఏది వదలిపెట్టాలి ?అనేదికూడా క్లిష్టమైనదే. విదేశీయుల పాలన, స్వతంత్ర్య సంగ్రామ చరిత్ర మరొక పుస్తకంగా వ్రాస్తేనే బాగుంటుందని వదలి పెట్టటం జరిగింది.

శ్రీమాన్ మంద జగన్నాథరెడ్డి గారు చాలా ఉదార స్వభావులు. వారు ఇదివరలో రెండు పుస్తకాలకు ఆర్థిక సాయమందించారు. అట్లే, ఈ 'మన ఇతిహాసం' రెండవ ముద్రణకు ఆర్థికసాయ మందించుచున్నారు. వారికి మా హృదయపూర్వక ధన్యవాదములు. వారు అనువదించిన పుస్తకాలు కొన్ని ఉన్నవి. ప్రూఫ్‌లు దిద్దిపెట్టేవారు దొరికితే వాటిని కూడా సవరించి ప్రచురించే ప్రయత్నం చేస్తాము. పరమేశ్వరుడు వారికి దీర్ఘ ఆయురారోగ్య ఐశ్వర్యాదులను ప్రసాదించును గాక !

కంప్యూటర్‌లో కంపోజింగ్ చేసిన శ్రీ చకిలం వినోద్ కుమార్ గారికి, పుస్తకమును అందంగా తీర్చిదిద్దిన ప్రింట్‌షాప్ యజమానులకు, కార్యకర్తలకు మా ధన్యవాదములు.

మీ సేవలో
గాయత్రీ ఆశ్రమ ట్రస్టు

# "మన ఇతిహాసం"లో



**చదువండి - స్వాభిమానం కలిగి ఉండండి**

# నివేదన

ఇతిహాసం అంటే చరిత్ర అని అర్థం. నిజంగా జరిగిన చరిత్రనే ఇతిహాసం అంటారు. 'ఇతిహాసో నామ ఇతివృత్తమ్-జరిగిన కాలంలోని జరిగిన విషయాలను చెప్పుటయే ఇతిహాసం-అని నిర్వచనం. ఆంగ్లంలో హిస్టరీ అంటారు. ఒక ఆధ్యాత్మిక సందేశం తెలుపుటకు అల్లిన కథలను పురాణ కథలు (మైథోలజీ) అంటారు. మన భారతదేశం చాలాకాలం విదేశీయుల పాలనలో, విమతస్థుల పాలనలో ఉండటం వల్ల మన ప్రాచీన చరిత్ర చాలా వరకు నశించిపోయింది. ఇంతేగాక, విదేశీయులు మన చరిత్రను వికృతపరచటానికి చాలా ప్రయత్నం చేసారు. కొందరిని ప్రలోభపెట్టి, మరి కొందరిని భయపెట్టి మన భారతీయులతో కూడా వక్రచరిత్రను వ్రాయించారు. అదే పాఠశాలలలో విద్యార్థులకు బోధింపచేసారు. అట్టి వికృత చరిత్ర చదివితే మనపైన మనకే హీనభావం కలుగుతుంది. ఆంగ్లేయుల లక్ష్యం కూడా అదే. వీరాధివీరులను జనింపజేసిన భారతీయ సంస్కృతీ సభ్యతలను నశింపజేసినపుడు మాత్రమే భారతదేశాన్ని పూర్తిగా వశం చేసుకోగలమని వారు భావించారు. దానితోబాటు ప్రాచీన చరిత్రను వికృతపరిస్తే ముందుతరాలు కూడా నిర్వీర్యమై మన అదుపులో ఉంటాయని తలచారు. అదే జరిగింది. మనకు భౌగోళికంగా స్వాతంత్ర్యం వచ్చిందే కాని భావదాస్యం పోలేదు. ఆంగ్లమానపుత్రుల మైపోయాము. క్రమంగా మనలో ఆధ్యాత్మికత తగ్గిపోయి భౌతికత పెరిగిపోతోంది. ఇట్టి తరుణంలో విశుద్ధమైన మన ప్రాచీన చరిత్రను పరిచయం చేయ్యాలనే సదుద్దేశ్యంతో ఈ గ్రంథ రచనకు పూనుకోవటం జరిగింది.

నేను ఆధునిక కళాశాల పట్టభద్రుడనుకాని, ఆర్షగురుకుల స్నాతకుడనుకాని కాను. ఒక సామాన్య పాఠకుడను. మన ప్రాచీన చరిత్రను తెలుసుకోవాలనే జిజ్ఞాసతో ఇదివరలో ఆర్యవిద్వాంసుల గ్రంథాలను పరిశీలించాను. నేను కామారెడ్డి ఆర్షగురుకులంలో ఉండగా ప్రఖ్యాత ఆర్యవిద్వాంసులు పం. భగవద్దత్త గారి పరిశోధనా గ్రంథం "భారత్ వర్ష్‌కా బృహద్ ఇతిహాస్" అక్కడక్కడ చూడటం జరిగింది. అందు పండిట్‌జీ ఎన్నెన్నో ప్రమాణాలతో మన ప్రాచీన ఇతిహాసం వ్రాసారు. ఈ విషయంలో పండిట్‌జీ చేసిన పరిశ్రమ ప్రశంసనీయం. తదుపరి వారి రచనలు 'వేద విద్యా నిదర్శన్', The Story of Creation as seen by our Seers" అనే గ్రంథాలు చూచాను. అవి చాలా లోతైన విజ్ఞాన గ్రంథాలు. జాగత్రగా చదివి అర్థం చేసుకోవలసినవి. నేను అంత పరిశ్రమ చేయలేకపోయాను. వీరేకాక శ్రీ పురుషోత్తమ నాగేశ్ ఓక్, శ్రీ ఆచార్య రాందేవ్, పం. సత్యకేతు విద్యాలంకార్ మొదలగు మహానుభావులు భారతీయ ఇతిహాసాన్ని గురించి పెద్దపెద్ద గ్రంథాలు వ్రాసినట్లుగా వినియుంటిని. కాని, అవి చూడలేకపోతిని. అవి అన్నీ పరిశోధనా గ్రంథాలనీ, రచయితలు ఎంతో శ్రమించి వ్రాసారనీ, అందు భారతదేశ ఔన్నత్యం ఎంతగానో ప్రశంసింపబడిందనీ విన్నాను.

ఈ మధ్య ప్రఖ్యాత రచయితలు డా॥ గురుదత్త యం.యస్.సి. గారి రచన 'ఇతిహాస్ మే భారతీయ పరంపరాయే' అనే గ్రంథం చదివాను. అది పై గ్రంథాల సంక్షిప్త సారాంశం. అందు పం. భగవద్దత్త గారి భావాలే ఎక్కువగా ఉన్నాయి. కనుక, ఆ గ్రంథంలో ఇతిహాసాన్ని గురించి చెప్పబడిన ముఖ్య విషయాలు వ్రాసి తెలుగు పాఠకులకు అందజేయాలనే సంకల్పం కలిగింది. దాని సాకారరూపమే ఈ గ్రంథం.

ఈ గ్రంథం వల్ల మన ప్రాచీన ఇతిహాసంపై ఒక అవగాహన ఏర్పడుతుంది. ఒక గౌరవభావం కలుగుతుంది. ఇంకా ఎక్కువ వివరంగా తెలుసుకోవాలనే కుతూహలం కలుగుతుంది. ప్రయత్నిస్తే పై గ్రంథాలు చదివి మరెన్నో విషయాలు తెలుసుకోగలుగుతారు.

పరమపిత పరమేశ్వరుని అనుగ్రహం వల్ల నా ఆరోగ్యం కొంత మేలయ్యింది. కొద్దిసేపు వ్రాయగలుగుతున్నాను. కొద్దిసేపు మాట్లాడగలుగుతున్నాను.

ప్రస్తుతం నేను భువనగిరిసమీపంలో హనుమాపుర గ్రామ పరిధిలో నూతనంగా నిర్మింపబడిన 'వైదిక వానప్రస్థ సాధక ఆశ్రమం'లో ఉంటున్నాను. ఇక్కడ వసతి, సౌకర్యాలు, ఆదరాభిమానాలు నా బలహీన శరీరానికి అనుకూలంగా ఉన్నాయి. జల వాయువులు కూడా ఆరోగ్యానికి అనుకూలించాయి. సత్సంగంలో, సద్గ్రంథ పఠనంలో, సచ్చిదానందేశ్వరుని ధ్యానంలో కాలం ఆనందంగా గడచిపోతున్నది. కనుక ఓపిక తెచ్చుకొని ఈ గ్రంథం వ్రాయగలిగాను. వ్రాయటంలో చాలా అలసట అయ్యింది. ప్రూఫ్‌లు చూడటంలో యింకా ఎక్కువ అలసట అయ్యింది. ఎంత జాగ్రత్తగా చూచినా కొన్ని అచ్చు తప్పులు మిగిలిపోతున్నాయి. సహృదయంతో మన్నిస్తారని ఆశిస్తున్నాను.

ఈ గ్రంథం ఇతిహాసం యొక్క అతి సంక్షిప్త పరిచయం మాత్రమే.. రామాయణ భారత కథలలో కేవలం ఇతిహాసం వరకు మాత్రమే వ్రాయటం జరిగింది. ఆదిశంకరులవారి తదుపరి చరిత్ర మరియు భారత స్వాతంత్ర్య సంగ్రామ చరిత్ర ఎందరో విద్వాంసులు వ్రాసి ప్రచురించారు. కనుక గ్రంథవిస్తరణ భీతిచే యిందులో వ్రాయలేదు. ఇంతేగాక, నేటి దేశకాల పరిస్థితులను చూస్తే ఎవరికీ తీరికలేదు. అన్నీ సంక్షిప్తంగాను, వేగంగాను తెలుసుకోగోరుతున్నారు. అందుచే వీలయినంత సంక్షిప్తంగావ్రాయటం జరిగింది. జన సామాన్యానికి అర్థమయ్యే విధంగా మీడియా భాషలోనే (దిన పత్రికల భాషలోనే) వ్రాయ యత్నించాను. విజ్ఞులు ఇందేవైనా దోషము లున్న సహృదయతతో తెలుపగోరుచున్నాను. పునరాలోచించి పునర్ముద్రణలో సవరించుకోగలవాడను. ఈ గ్రంథ ప్రచురణకు సహకరించిన వారందరికి నా హృదయపూర్వక ధన్యవాదములు.

విన్నవించు

**కోడూరి సుబ్బారావు**

వైదిక వానప్రస్థ సాధక ఆశ్రమం,
భువనగిరి.

## స్వాధ్యాయ తపస్వి

## శ్రీ మంద జగన్నాథరెడ్డి గారి పరిచయము

కామారెడ్డి డిప్యూటీ కలెక్టర్ కార్యాలయం నుండి డిప్యూటీ తహసిల్‌దారుగా పదవీ విరమణ చేసిన శ్రీమాన్ మంద జగన్నాథరెడ్డిగారు దొరల వంశానికి చెందినవారు. వారి పూర్వులు ముత్తాత శ్రీ వెంకటరెడ్డి గారి కాలం వరకు కామారెడ్డి పట్టణానికి సమీపంలోని వడ్లూరు గ్రామంలోగల కోటను కేంద్రంగా చేసుకొని చుట్టుప్రక్కల సంస్థానాలను పాలిస్తూ ఉండేవారు. దురదృష్టవశాత్తు దేశం మహ్మదీయులపాలు కావటం, వీరి తాతగారు శ్రీ సయ్యదు రెడ్డిగారు హైదరాబాదు నవాబు ఆగ్రహానికి గురికావడం, కోట నేలమట్టమై సామాన్య రైతు కుటుంబంగా మారిపోవడం జరిగిపోయాయి. వీరి తాత శ్రీ సయ్యదు రెడ్డిగారికి యిద్దరు కుమారులు. పెద్దకుమారుడు శ్రీ అంబారెడ్డి గారి వంశం అతని కుమారుడు శ్రీ నారాయణ రెడ్డి గారికి సంతానం కలగకపోవటంతో నిలిచి పోయింది. రెండవ కుమారుడు శ్రీ లాక్ష్మారెడ్డి గారికి యిద్దరు భార్యలు. మొదటి భార్య శ్రీమతి యశోదా గారికి కలిగిన సంతాన వంశచక్రం బాగానే జరుగుచున్నది. రెండవ భార్య అయిన శ్రీమతి సత్యమ్మ గారికి శ్రీ జగన్నాథరెడ్డిగారు ఒక్కరే సంతానం కలిగారు. ఇంతేగాక, వీరు బాల్యంలో ఉండగానే తండ్రి శ్రీ లక్ష్మారెడ్డి గారు క్షయ వ్యాధిగ్రస్తులై దివంగతులయ్యారు. దానితో వీరి బాల్యం, విద్యాభ్యాసం అంతా తల్లిగారి పుట్టింటనే మేనమామ గారి ఆదరణతో గడచింది. వారుకూడా పేదవారే కావటంవల్ల పాలు పెరుగులు లేని మక్కగటక తిని పెరగవలసి వచ్చింది. తల్లిగారిది దేశాయి వంశము. వీరుకూడా రాజవంశీయులే. తాతగారి పేరు శ్రీరామచంద్రరావు దేశాయి.

శ్రీ జగన్నాథరెడ్డిగారు 8 సంవత్సరాల ప్రాయంలో ఉన్నపుడు మేనమామ శ్రీ నేలకొండ వెంకటరామరావు గారు తిప్పాయిపల్లె నుండి మల్లారం గ్రామం రావటం, అక్కడ వీరిని వీధి పాఠశాలలో చేర్పించటం జరిగింది. వీరు వీధి బడిలో ప్రాథమిక విద్యను, నీతి శ్లోకాలను, పద్యాలను నేర్చుకున్నారు. అనంతరం వీరి మేనమామగారు వీరిని వేములవాడలోని ప్రాథమిక పాఠశాలలో 4వ తరగతిలో చేర్పించారు. అక్కడవారు 4, 5, 6 తరగతులు చదువుకొన్నారు. వేములవాడలో 7వ తరగతి లేనందున తల్లిగారు వీరిని వడ్లూరు గ్రామానికి తీసుకువచ్చి కామారెడ్డిలోని మాధ్యమిక పాఠశాలలో చేర్పించారు. అక్కడ వీరు 7వ తరగతిలో ఉత్తీర్ణులైనారు. అప్పుడు కామారెడ్డిలో హైస్కూలు లేకుండుట వల్ల వీరిని కరీంనగర్‌లో హైస్కూల్‌లో చేర్పించి

8,9,10 తరగతులు చదివించటం జరిగింది. ఇదంతా మేనమామ గారి సహకారంతోనే జరిగింది. విద్యాభ్యాసమంతా ఉర్దూ మీడియంలో జరిగింది.

10వ తరగతి విద్యార్హతతో వీరు ఎట్లో కామారెడ్డి తహసీలుదారు కార్యాలయంలో ఉమీదువారు పని సంపాదించి కొంత డబ్బు జమచేసుకోగలిగారు. ఆ డబ్బుతో వీరు హైదరాబాద్‌లోని సిటీ కాలేజీలో చేరి ఇంటర్‌మీడియట్ చదువుకున్నారు. అనంతరం మరల కామారెడ్డికి తిరిగివచ్చి ఉద్యోగ ప్రయత్నం చెయ్యగా చివరికి నిజామాబాద్ కలెక్టర్ కార్యాలయంలో మూడవ తరగతి గుమస్తా ఉద్యోగం దొరికింది. అప్పటికి వీరి వయస్సు 25 సంవత్సరాలు. అప్పుడే వీరికి సిద్దిపేట తాలూకాలోని మరుపడిగ గ్రామ వాసులు శ్రీ నారాయణరెడ్డి గారి తృతీయ పుత్రిక శ్రీమతి సుజాత గారితో వివాహం జరిగింది. శ్రీ నారాయణరెడ్డి గారిది కూడా దొరల వంశమే. వీరు సుమారు వంద ఎకరముల భూమిగల భూస్వామి. మాలీ పటేలు. రుసుము (భరణం) కూడా ఉండేది.

శ్రీ జగన్నాథరెడ్డి గారు డిపార్టుమెంట్ పరీక్షలు వ్రాసి క్రమంగా ఉద్యోగంలో ఉన్నతిని పొందారు. అప్పర్ డివిజన్ క్లర్క్‌గా, డిప్యూటీ తహసీల్‌దారుగా ఉన్నతిని పొందారు. ఒక సంవత్సరం రెవెన్యూ ఇన్స్‌పెక్టర్‌గా కూడా పనిచేశారు. శ్రీ యన్.టి. రామారావు గారు ముఖ్యమంత్రిగా ఉండే సమయంలో 50 సంవత్సరాలు నిండిన వారినందరిని ఉద్యోగ విరమణ చేయుమని ప్రోత్సహించారు. అప్పుడు (30-8-1980న) వీరు ఉద్యోగ విరమణ చేశారు. లేకుంటే ఆర్.డి.వో. అయి ఉండేవారు. పిత్రార్జితముగా వీరికి కేవలం 4 ఎకరాల మెట్టభూమి, ఒక ఎకరం తరిభూమి మాత్రమే లభించింది. వీరు పొదుపును పాటిస్తూ వారి పురుషార్థంతో క్రమంగా మొత్తం 50 ఎకరాలకు భూస్వామి అయ్యారు.

ఉద్యోగ విరమణ చేసిన తరుపరి వీరి దృష్టి వ్యవసాయం వైపు మరలింది. 10మంది జీతగాండ్రను పెట్టుకుని వ్యవసాయము, పశుపోషణ చేస్తూ కుమారులిద్దరిని పెద్ద చదువులు చదివించి జీవితంలో ఉన్నత స్థితిలో నిలిపారు. పెద్దకుమారుడు శ్రీ చంద్రశేఖర మహేంద్ర భూపాల్ గారికి బంటారం గ్రామ వాసిని శ్రీమతి వనజ గారితో వివాహం జరిపించారు. ఈ దంపతులకు ఒక అమ్మాయి. పేరు ప్రియాంక. ఈ కుటుంబం ఉత్తర అమెరికాలోని ఆరగాన్ రాష్ట్రంలోని యూజీన్ నగరమున నివసించుచున్నది. రెండవ కుమారుని పేరు శ్రీ అశోక్ రణవీర సుధర్మపాల్. వీరి ధర్మపత్ని శ్రీమతి శైలజ. వీరికి 'రోహన్' పేరుగల

కుమారుడు, 'నేహ' పేరుగల కుమార్తె కలిగారు. ఈ కుటుంబం కూడా ఉత్తర అమెరికాలోనే టెక్సాస్ రాష్ట్రములోని ఇర్వింగ్ పట్టణంలో ఉంటున్నది. కుమారులిద్దరి బలవంతంపై శ్రీ జగన్నాథరెడ్డిగారు, వారి శ్రీమతి సుజాతగారు అమెరికాలోనే కుమారుల వద్ద ఉంటున్నారు. విశేషమేమంటే - వీరు అక్కడ ఉండికూడా స్వాధ్యాయ యోగాభ్యాసాలు చేస్తూ ఒక వానప్రస్థిగా తాపసిక జీవితం గడుపుతున్నారు. వీరి కుటుంబ చిత్రము (ఫోటో) అట్ట లోపలవైపు ఉన్నది.

వీరి కుమారులు, కోడండ్రు అంతా సంస్కారవంతులు. తల్లిదండ్రులను కంటికి రెప్పగా చూచుకుంటున్నారు. మనుమడు, మనుమరాండ్రు విధేయులై చక్కగా చదువుకుంటున్నారు. వీరికి కుటుంబ సంబంధమైన యిబ్బంది ఏమీలేదు. "**పుత్రైః' నప్తృభిః మోదమానౌ స్వేగృహే'** పుత్ర పుత్రికలతో, మనుమలు మనుమరాండ్రతో స్వగృహమున ఆనందముగా నుండు"దని వేదం చెప్పినట్లు వీరి జీవితం ఆనందంగా గడచిపోతున్నది.

## ఆధ్యాత్మిక జీవితం

శ్రీ జగన్నాథరెడ్డిగారు చిన్ననాటి నుండి దైవభక్తులు. ధర్మపరాయణులు నిరాడంబరులు పరోపకార శీలురు. దాన ప్రవృత్తి కలవారు. వీరు పోచంపాడు ప్రాజెక్ట్‌లో ఉద్యోగం చేస్తున్నప్పుడే వద్దూరు గురుకుల ఆచార్యులు శ్రీ వేదవ్రత మీమాంసకుల వారితో పరిచయం కలగటం, వారు వీరికి 'సత్యార్థప్రకాశ' గ్రంథం అందజేయటం జరిగింది. అది చదివిన తదుపరి వారి జీవితంలో చాలా మార్పుకలిగింది. వివేక బుద్ధి జాగృతమయ్యింది. ఇంకా యింకా వైదిక ధర్మాన్ని గురించి తెలుసుకోవాలనే జిజ్ఞాస తీవ్రమయ్యింది. దానికి తోడు వీరికి తెలుగు, హిందీ, ఉర్దూ, ఆంగ్ల భాషలలో మంచి ప్రవేశం ఉండటం వల్ల తెలుగు, హిందీ భాషలలో నున్న విశాల వైదిక సాహిత్యాన్ని చాలానే స్వాధ్యాయం చేశారు. యోగ శివిరాలలో పాల్గొని శ్రీ స్వామీ సత్యపతి గారి శిష్యులై యోగసాధన చేస్తున్నారు. ఆచార్యజీ, స్వామీజీ గార్లతో కలిసి వివిధ ఆర్య మహాసమ్మేళనాలకు వెళ్లారు. వివిధ ఆర్యసమాజాలను, గురుకులాలను దర్శించారు.

**వీరు అధ్యయనం చేసిన ప్రముఖ గ్రంథాలు :** ఆచార్య ఉదయవీర్ శాస్త్రి గారి వ్యాఖ్యానంతో కూడిన వైశేషిక సాంఖ్య యోగ న్యాయ పూర్వమీమాంసా ఉత్తర మీమాంసా దర్శనాలు, ఆచార్య సురేంద్రకుమార్ గారి వ్యాఖ్యానంతో కూడిన

మనుస్మృతి, యోగదర్శనానికి శ్రీ స్వామీ సత్యపతి, శ్రీ రాజ్‌వీర్ శాస్త్రిగార్ల వ్యాఖ్యాన గ్రంథాలు, గీతాప్రెస్ వారి రామాయణ మహాభారతాలు. ప్రముఖ చరిత్ర పరిశోధకులు పం. భగవదత్తగారి రచన 'భారత్ వర్షకా బృహత్ ఇతిహాస్ రెండు భాగాలు, బృహదారణ్యకము మొదలగునవి. తెలుగులో ఉన్న వైదిక సాహిత్యం దాదాపు పూర్తిగా అధ్యయనం చేశారు.

చదివినది వంటబట్టాలని కొన్ని గ్రంథాలను అనువాదంకూడా చేశారు. **అనువదించిన గ్రంథాలు** : మనుస్మృతి, సాంఖ్యదర్శనము, భారత్ వర్ష్‌కా బృహత్ ఇతిహాసము (మొదటి భాగము) పూర్తిగా తెలుగులో అనువదించారు. ప్రస్తుతం రెండవ భాగంలో 25వ అధ్యాయం అనువదిస్తున్నారు. మరియు స్వామీ సత్యపతిగారి వ్యాఖ్యానంతో కూడిన యోగదర్శనం చదువుతూ అనువాదం చేస్తూన్నారు. వీరు ప్రతీ విషయాన్ని సూక్ష్మదృష్టితో (క్రిటికల్‌గా) అధ్యయనం చేసే ప్రవృత్తికలవారు.

నిత్యం ఉదయ సాయం సమయాలలో సంధ్యా యోగాభ్యాసాలు చేస్తున్నారు. అందుచేతనే నేను వీరిని 'స్వాధ్యాయ తపస్వి' అంటున్నాను.

శ్రీ జగన్నాథరెడ్డిగారు నా వ్యక్తిగత అవసరాలకు, వైదిక సాహిత్య ప్రచురణకు అప్పుడప్పుడు దక్షిణ రూపంలో ధనం పంపుతున్నారు. వారికి నా హృదయపూర్వక ధన్యవాదములు.

సర్వవ్యాపక సర్వేశ్వరుడు వీరికి, వీరి కుటుంబము వారందరికి దీర్ఘ ఆయురారోగ్య ఐశ్వర్యాదుల నిచ్చి కాపాదును గాక ! కుమారులు తండ్రికి అనువ్రతులై పరోపకార పరాయణులు, దానశీలురు అగుదురు గాక ! వంశ కీర్తని యినుమడింపజేయుదురు గాక !

శుభం భూయాత్

**కోడూరి సుబ్బారావు**

**(గ్రంథకర్త)**

# గాయత్రీ ఆశ్రమ ట్రస్టు ప్రచురణలు

వేదాలలో సూర్యకిరణ చికిత్స(40=00), వేదాలలో జలచికిత్స (20=00), వైదిక క్రాంతి పథం(15=00), అగ్నిహోత్ర వైజ్ఞానిక స్వరూపము(15=00), దౌహృదిని (ఋషుల దృష్టిలో గర్భిణిస్త్రి) (20=00), అగ్నిహోత్ర రాసాయనిక విశ్లేషణ (15=00), గర్భాధాన విజ్ఞానము (30=00), మావన ధర్మము (10=00), అశ్వినీ దేవతలు(20=00), సంధ్యావందనము-వైజ్ఞానిక సమాలోచనము(20=00), అగ్నిహోత్ర ఆధ్యాత్మిక స్వరూపము (30=00), గంగాధర శివుడు (5=00), గోమాత (7=00), గాయత్రీ విజ్ఞానం (50=00), జననీ-జన్మభూమి(ముద్రణలో), స్వాతంత్ర్య సముపార్జనలో మహర్షి దయానందుడు (4=00), దైనిక అగ్నిహోత్ర విధి (4=00), మన ఇతిహాసం,(70=00), మన వేదశాస్త్రాల పరిచయం (50=00), చతుర్దశ భువనములు (10=00), పురుషోత్తముడు శ్రీరాముడు (24=00), ఐతరేయోపనిషత్తులోని సృష్టికథ (10=00), యుగపురుషుడు శ్రీకృష్ణుడు (8=00), వైదిక వివాహ వైశిష్ట్యము (8=00), ధర్మవీర్ పం. లేఖరాం(3=00), మహర్షి మనువుపై విరోధమెందుకు (3=00), వేదాలలో అప్సరస గంధర్వులు (2=50), యజ్ఞోపవీత వైశిష్ట్యము(2=00), లక్ష్మీసూక్తము (2=00), శాంతిప్రార్థన (2=00), దిగ్రేట్ గాయత్రీ(2=00), వైదిక అర్థనీతి (2=00), చాణక్యనీతి (40=00), అక్కాచెల్లెండ్ల ధార్మిక చర్చ(20=00), బ్రహ్మచర్య విజ్ఞానము (15=00), శ్రీ దయానంద హృదయము (12=00), స్వరాజ్యసంగ్రామములో ఆర్యసమాజము(8=00), సత్యధర్మవిచారణ(6=00)




# మన ఇతిహాసం

మన ఇతిహాసం తెలుసుకునే ముందు సృష్టి ఇతిహాసం కొద్దిగా తెలుసుకుందాం. మనం ఉండే ఈ భూమి మనకు కనబడే సూర్యుని కుటుంబంలోనిది. ఈ భూమి సూర్యుని గురుత్వాకర్షణ శక్తికి కట్టుబడి దాని చుట్టూ తిరిగే ఒక గ్రహం. ఇటువంటి గ్రహాలే మరొక ఎనిమిది సూర్యుని చుట్టూ తిరుగుతున్నాయి. వాటిలో అయిదు గ్రహాలను మాత్రమే మనం సామాన్య కంటితో చూడగలుగుతాం. మిగిలిన మూడిటిని ఖగోళ టెలిస్కోపు (Astronomical Telescope) తో మాత్రమే చూడగలుగుతాం. బుధ, శుక్ర, అంగారక, గురు, శనిగ్రహాలు మన కంటికి కనబడతాయి. యురేనస్, నెప్ట్యూన్, ప్లూటో గ్రహాలు చూడాలంటే ఖగోళ టెలిస్కోప్ అవసరం. మన భూమికి ఒక ఉపగ్రహం ఉంది. దానినే మనం చంద్రుడు అంటున్నాం. మన భూమికి ఉపగ్రహం ఉన్నట్లే మిగతా గ్రహాలకుకూడా ఉపగ్రహాలున్నాయి. ఇవేగాక భూమికి గురుగ్రహానికి మధ్య ఎన్నెన్నో ఉల్కలు ఒక వలయంగా సూర్యునిచుట్టూ తిరుగుతూ ఉంటాయని విజ్ఞాన వేత్తలు చెబుతున్నారు. ఇవన్నీ కలిసి మన సూర్యకుటుంబం ఏర్పడింది. ఇవేగాక, అప్పుడప్పుడు తోకచుక్కలు వస్తూ ఉంటాయి.

ఈ గ్రహాల పరిమాణాలు, అవి సూర్యుని నుండి ఎంతెంత దూరంలో ఉంటాయో మొదలగు విషయాలు ఈ క్రిందిపట్టిక ద్వారా తెలుసుకోవచ్చు.

| గ్రహం పేరు సూర్యుని నుండి వరుసగా | వ్యాసం కి.మీ. | సూర్యునిచుట్టూ తిరగటానికి పట్టే కాలం (సంవత్సరాలలో) | చంద్రులు ఎన్ని ఉపగ్రహాలు | సాంద్రత డెన్సిటీ (g/cm³) | సూర్యుని నుండి దూరంభూమితో పోలిస్తే |
|---|---|---|---|---|---|
| బుధుడు (మెర్క్యూరి) | 4870 | 0.24 | .. | 5.4 | 0.387 |
| శుక్రుడు (వీనస్) | 12100 | 0.615 | .. | 5.3 | 0.723 |
| భూమి (ఎర్త్) | 12760 | 1.0 | 1 | 5.52 | 1.0 |
| అంగారకుడు(మార్స్) | 6670 | 1.88 | 2 | 3.9 | 1.52 |
| గురుడు (జూపిటర్) | 143760 | 11.86 | 12 | 1.3 | 5.19 |
| శని (సాటరన్) | 120420 | 29.50 | 18 | 0.7 | 9.51 |
| యూరేనస్ | 51120 | 84.01 | 15 | 1.3 | 19.13 |
| నెప్ట్యూన్ | 49530 | 165.1 | 8 | 1.6 | 29.98 |
| ప్లూటో | 2280 | 247.95 | 1 | 2.0 | 39.33 |

ఇంత పెద్ద పెద్ద పరిమాణాలు గల గ్రహాలను, ఉపగ్రహాలను తన గురుత్వాకర్షణ శక్తితో తన చుట్టూ త్రిప్పుకొంటున్న సూర్యుడు ఎంత పెద్దవాడో తెలుసా ?

సూర్యుడు భూమికంటె 13 లక్షల రెట్లు పెద్దవాడు. అంటే సూర్యుడు ఆక్రమించిన స్థలంలో 13 లక్షల భూగోళాలు పడతాయి. ద్రవ్యరాశిలోసూర్యుడు భూమికంటె 3 లక్షల 32వేల రెట్లు ఎక్కువ ఉంటాడు. అంత పెద్దగోళం అయివుండి కూడా మనకు ఆకాశంలో ఒక బంతివలె కనబడతాడు. దానికి కారణం-చాలా దూరంలో ఉండబట్టే. భూమికి సూర్యునికి మధ్య సుమారు 9 కోట్ల 28 లక్షల మైళ్ళ దూరం ఉంటుంది. భూమి ఇంతదూరంలో ఉన్నా సూర్యుడు తన గురుత్వాకర్షణ శక్తితో పట్టుకుని తన చుట్టూ త్రిప్పుకుంటున్నాడు. మన భూమికన్న పెద్ద గ్రహాలైన అంగారక, గురు, శని, యూరేనస్, నెప్ట్యూన్, ప్లూటోలను కూడా ఆకర్షించి తన చుట్టూ త్రిప్పుకుంటున్నాడు. సూర్యుని నుండి వాటి దూరాలుకూడా

భూమికన్న ఎక్కువనే.

ఇవి అన్నీ కలిసిన ఈ సూర్యకుటుంబంలో ప్రాణులు జీవించటానికి అనుకూలమైన వాతావరణం, సీతోష్ణ పరిస్థితులు ఒక్క మన భూగ్రహంపైనే ఉన్నాయి. శుక్ర, అంగారక గ్రహాలపై ఏవైనా కొన్ని అల్ప ప్రాణులు ఉండే అవకాశం ఉండవచ్చునని కొందరి అభిప్రాయం.

ఆకాశంలో మనకు కనబడే నక్షత్రాలన్నీ మన సూర్యుని వంటి గోళాలే. వాటిచుట్టూకూడా గ్రహ ఉపగ్రహాదులు తిరుగుతూ ఉంటాయి. కనుక వాటి గ్రహాలలోకూడా భూమివంటి వాతావరణం కలిగిన గ్రహాలు ఉండవచ్చు. వాటిపై ప్రాణులు ఉండవచ్చు.

మనం మన కంటితో ఆకాశంలో కొన్ని నక్షత్రాలనే అంటే సుమారు 2,500 నక్షత్రాలనే చూడగలుగుతాం. మన భూమికి వెనుక వైపుకూడా సుమారు అన్ని ఉంటాయి. కనుక 5,000 నక్షత్రాలను మనం సామాన్య కంటితో చూడగలం. కాని, పెద్ద పెద్ద దూరదర్శినులతో చూస్తే చాలా చాలా కనబడతాయట. శాస్త్రవేత్తల అంచనా ప్రకారం విశ్వంలో $10^{22}$ అంటే 10 తరువాత 22 సున్నలు పెడితే ఎంత సంఖ్య అవుతుందో అన్ని నక్షత్రాలు ఉన్నాయని ఊహిస్తున్నారు. మన సూర్యుడు ఉండే గెలాక్సీకి (నక్షత్రగుంపుకు) మిల్కీ వే గెలాక్సీ (పాలపుంత) అని పేరు పెట్టారు.

కాంతి సెకనుకు సుమారు లక్షా ఎనభై ఆరువేల (1,86,000) మైళ్ళ వేగంతో ప్రయాణిస్తుంది. ఆ ప్రకారం మన చంద్రుని నుండి వెన్నల భూమిపైకి రావడానికి 1.3 సెకన్లు పడుతుంది. సూర్యుని నుండి ప్రకాశం రావడానికి 8.3 నిముషాలు(483 సెకన్లు) పడుతుంది. ఆ పై నక్షత్రాల నుండి ప్రకాశంరావడానికి రోజులు, వారాలు, నెలలు

సంవత్సరాలు కూడా పడుతుందట. అత్యంత దూరంలో ఉన్న గెలాక్సీలో ఉన్న చివరి నక్షత్రం (సూర్యుని) నుండి ప్రకాశం రావడానికి సుమారు 13, 000 మిలియన్ల కాంతి సంవత్సరాలు పడుతుందట. ఎంత ఆశ్చర్యం!! విశ్వపరిధిని ఊహించలేకపోతున్నాం కదా !

సూర్యుని ఆకర్షణ శక్తివల్ల మన భూమి పడిపోకుండా ఆకాశంలో తిరుగుతూ ఉంది. మరి, ఆ సూర్యుని, కోట్లాది నక్షత్రాలను ఎవరు ఆకర్షించి పడిపోకుండా ఆకాశంలో త్రిప్పుతున్నారు. నేటి వైజ్ఞానికులకు ఇంకా ఈ ప్రశ్నకు సమాధానం దొరకలేదు. కాని, ఆస్తికులమైన మనకు తెలుసు ఆ బృహత్ పదార్థం సర్వవ్యాపకుడైన పరమేశ్వరు డని. అందుచే ఆ దేవదేవుని -

**యేన ద్యౌ రుగ్రా పృథివీ చ దృఢా**
**యేన స్వః స్తభితం యేన నాకః ।**
**యో అంతరిక్షే రజసో విమానః**
**కస్మై దేవాయ హవిషా విధేమ ॥ (యజుర్వేదం. 32-6)**

"ఎవనిచే ప్రకాశ తాపముల నిచ్చు ఉగ్ర స్వభావంగల సూర్యాది లోకములు మరియు భూమి ధరింపబడియున్నవో, ఎవనిచే స్వః (ఆనందము) ధరింపబడినదో, ఎవడు మనను ఈ సమస్త లోక లోకాంతరాల బంధనాల నుండి విడిపించి తృతీయ ధామమైన నాకమునకు చేర్చునో, ఎవడు ఆకాశమున సమస్త లోక లోకాంతరములను నిర్మించి త్రిప్పు చున్నాడో అట్టి సుఖదాయక పరమేశ్వరునకు నే చేయు సత్కర్మల ఫలము నంతటిని హవిస్సుగా నర్పించి నమస్కరించుచున్నాను." అని మనం ప్రతిదినం ప్రార్థిస్తాం.

విశ్వసృష్టిని గురించి విభిన్న సిద్ధాంతాలు నేటి వైజ్ఞానికులు చెబుతున్నారు. వాటిలో ఏది సరియైనదో ఇప్పటికీ వారు తేల్చుకోలేక

పోతున్నారు. పెద్ద పెద్ద టెలిస్కోపులు, యంత్రాలు నిర్మించి పరిశోధనలు చేస్తున్నారు. ప్రతి ఏటా కోట్లాది డాలర్లు ఖర్చుపెడుతున్నారు. అంతకన్న మన వేదాల ఆధారంగా, సూర్యసిద్ధాంతాది ప్రాచీన జ్యోతిష్య గ్రంథాల ఆధారంగా పరిశోధనలు సాగిస్తే ఈ చిక్కు స్వల్పకాలంలోనే విడిపోతుంది.

విశ్వసృష్టిని గురించి మన వేదం ఏమి చెబుతున్నదో తెలుసుకుందామా !

# విశ్వసృష్టి

మనం చూచే ఈ విశాల విశ్వం, ఇందలి వివిధ పదార్థాలు, వివిధ ప్రాణులు అన్నీ పరమేశ్వరునిచే సృజింపబడ్డాయి. ఇవి సృజింపబడకముందు గాఢాంధకారమయమైన ప్రళయస్థితి ఉండేది. అప్పుడు ఈ ప్రాపంచిక పదార్థాలన్నీ సూక్ష్మాతిసూక్ష్మ పరమాణువులుగా - సత్వ రజ స్తమస్సులుగా ఉండేవి. అవియును అనంత పరమేశ్వరునిలో తుచ్ఛంగా ఏదో ఒక మూల ఉండీ లేనట్లుగా ఉండేవి. ఆ స్థితిని వేదం ఈ విధంగా వర్ణిస్తుంది.

**తమ ఆసీత్తమసా గూఢమగ్రే ఽ ప్రకేతం సలిలం**
**సర్వమా ఇదమ్ । తుచ్ఛ్యేనా భ్వపిహితం యదాసీత్తపస**
**స్తన్మహినా జాయతైకమ్ ॥ (ఋగ్వేదం. 10-129-3)**

సృష్టికి పూర్వం ఈ జగత్తంతా గాఢాంధకారంచే కప్పివేయబడి తెలియుటకు అయోగ్యమై ఉండేది. అనంత పరమేశ్వరునిలో ఏదో ఒక మూల తుచ్ఛంగా పడిఉండేది. అట్టి కారణరూప ప్రకృతితోనే పరమేశ్వరుడు ఈ కార్యరూప సృష్టిని గావించాడు.

ఈ మంత్రంలోని 'సలిలమ్' పదానికి 'నీరు' అని అర్థంకాదు.

ప్రకరణాన్ని బట్టి యిచ్చట సలిలమ్ అంటే కార్యరూప జగత్తునంతటిని తనలో లీనం చేసుకున్న కారణప్రకృతి (మూల ప్రకృతి) అని అర్థం. అట్టి మూల ప్రకృతిని "తత్ మహినా' తత్ నామక ఒక మహత్తర శక్తి (పరమేశ్వరుడు) మనకు కనబడే కార్యరూప సృష్టిగా జన్మింపచేసాడు (నిర్మించాడు).

అట్టి ప్రళయ స్థితిలో జీవులమైన మనమంతా శరీర రహితులమై మూర్ఛితావస్థలో పడి ఉంటాం. అట్టి మనపై పరమేశ్వరునికి జాలి కలుగుతుంది. మనకు మేలు చేయాలనే సంకల్పం కలుగుతుంది. మన మేలును కోరి పరమేశ్వరుడు తన ప్రకాశమయ తపస్సుతో ఈ సృష్టిని గావించటం జరిగింది. పరమేశ్వరునిలో కలిగిన ఆ సంకల్పమునే ఈక్షణ అంటారు. దానినే వేదం కామః అంటుంది.

కామస్తదగ్రే సమవర్తతాధి మనసో రేతః
ప్రథమం యదాసీత్ ।
సతో బన్ధుమసతి నిరవిన్దన్ హృది
ప్రతిష్యా కవయో మనీషా ॥ (ఋగ్వేదం. 10-129-4)

ఆ కామమే (ఈక్షణయే) సృష్టిరచనలో అన్నిటికన్న మిన్నగా ఉంటుంది. అది మనస్సుయొక్క ప్రథమ బీజం. ఈ బీజం సామ్యావస్థలో పడివున్న ప్రకృతిలో క్షోభను కలిగిస్తుంది. సామ్యావస్థను భంగపరచి సత్త్వరజస్తమస్సులను వివిధ నిష్పత్తులలో కలిపి బంధించి స్థూల పరమాణువులుగా చేస్తుంది. ఆ విధంగా ఏర్పడిన పరమాణువులను అర్ణవ సముద్ర మని వేదం వర్ణిస్తుంది.

ఋతం చ సత్యం చాభీద్ధా త్తపసో ऽ ధ్య జాయత ।
తతో రాత్ర్యజాయత, తతః సముద్రో ऽ ర్ణవః॥ (ఋ. 10-120-1)

పరమేశ్వరుని అభీద్ధా తపస్సుతో శాశ్వత నియమాల కనుగుణంగా ప్రకృతిలో కలిగిన మార్పులవల్ల ఈ సృష్టి ఉత్పన్నమయ్యింది. ఆ పరిణామ క్రమంలో ముందుగా ప్రళయరూప రాత్రి పుట్టింది. ఆ అంధకారంలోనే అర్ణవ సముద్ర మనే స్థూల పరమాణు సముద్రం ఉత్పన్నమయ్యింది.

ఆ అర్ణవసముద్రంలోని పరమాణువులన్నీ దగ్గరగా చేరి ఒక బ్రహ్మాండమైన పెద్ద అణువుగా తయారయ్యాయి. దీనినే 'సంవత్సరం' అని పేర్కొంటుంది వేదం.

**సముద్రా దర్ణవా దధి సంవత్సరో అజాయత ।**
**అహోరాత్రాణి విదధ ద్విశ్వస్య మిషతో వశీ ॥ (ఋ. 10-190-2)**

ఆ అర్ణవసముద్రం నుండి సంవత్సరం ఉత్పన్నమయ్యింది. ఆ సంవత్సర నామక మహదండం దగ్గరగా కుదించుకుపోతూ ఉండగా ఆ వత్తిడికి దానిలో బ్రహ్మాండమైన ప్రేలుడు (బిగ్ బాంగ్) ఏర్పడి అది ముక్కలు ముక్కలుగా విడిపోయింది. ఆ ముక్కలు దూరంగా విసిరివేయబడ్డాయి. అవి తిరుగుతూ తిరుగుతూ గుండ్రంగా గోళాలుగా మారిపోయాయి. పెద్దవాటిచుట్టూ చిన్నవి తిరుగుతూ గురుత్వాకర్షణ నియమానికి కట్టుబడి ఈ అనంత విశ్వంలో కనబడే ఏ ఆధారం లేకుండా నిలిచి ఉన్నాయి. చిన్న ముక్కలు క్రమంగా చల్లబడి గ్రహఉపగ్రహాలగాను, పెద్దముక్కలు సూర్యులుగాను (నక్షత్రాలుగాను) మనకు కనబడుతున్నాయి. ఇదంతా చేస్తున్నది 'వశీ' నామక అదృశ్యశక్తి అని వేదం చెబుతున్నది. ఇంతేగాక -

**సూర్యా చంద్ర మసౌ ధాతా యథా పూర్వ మకల్పయత్ ।**
**దివంచ పృథివీం చాంతరిక్ష మథో స్వః ॥**

(ఋగ్వేదం. 10-190-3)

పూర్వకల్పంలో అంటే పూర్వం జరిగిన సృష్టిలోవలెనే ఈ సృష్టిలోకూడా సూర్యచంద్రులు, పృథివీ అంతరిక్ష ద్యులోకాలు సృజింప బడ్డాయని వేదం వివరిస్తున్నది. ఈ వేదోపదేశాన్ని బట్టి సృష్టి ప్రళయాలు ప్రవాహరూపంలో అనాదు లని రాత్రింబవళ్ళు మాదిరిగా ఒకదాని తరువాత మరొకటి వస్తూనే ఉంటాయని అర్థమవుతోంది.

తదుపరి కాలాంతరంలో భూమివంటి గ్రహంపై వాతావరణ పొర ఏర్పడింది. దానినుండి మేఘాలు ఏర్పడి భూమిపై అనేక సంవత్సరాలు వర్షాలు కురిసి సముద్రాలు ఏర్పడ్డాయి. తదుపరి ప్రాణిసృష్టి జరిగింది.

వేదంలో బీజరూపంలో వర్ణింపబడిన సృష్టి విజ్ఞానాన్ని భారతీయ మహర్షులు సమాధిస్థులై తెలుసుకున్నారు. వారికి అవగతమైనది వారి వారి శైలిలో బ్రాహ్మణ ఆరణ్యక గ్రంథాలలోను, మనుస్మృత్యాది స్మృతులలోను, దర్శన ఉపనిషదాదులలోను వర్ణించారు. ఆయుర్వేదాది వైద్యగ్రంథాలలోను, రామాయణ భారతాది ఇతిహాస గ్రంథాలలోను కూడా సృష్టిరచనా వర్ణన లున్నాయి. చివరకు పురాణాలలోకూడా కావ్యశైలి కథలుగా సృష్టిరచనా విశేషాలున్నాయి. అయితే వాటిలో ఎన్ని ఋషి ప్రణీతములో ఎన్ని కల్పిత కథలో తెలిసికొనుట కష్టం. అయినా వేదజ్ఞానపు వెలుగులో తర్కంతో సత్యాన్ని గ్రహించవచ్చు. వేదానుకూల మయినంత వరకు గ్రహించవచ్చు. ఎందుచేతనంటే వేదం పరమేశ్వర ప్రోక్తం. సృష్ట్యుత్పత్తిని గురించి సృష్టికర్తకు తెలిసినంత మన కెలా తెలుస్తుంది? కనుక విశ్వసృష్టిని గురించి తెలుసుకోవాలంటే వేదాన్ని ఆశ్రయించక తప్పదు.

ఈ సందర్భంలో వేదాన్ని గురించి కొన్ని ముఖ్య విషయాలు తెలుసుకోవటం అవసరం. భారతీయ పరంపర ప్రకారం వేదం

పరమేశ్వరీయ జ్ఞానం. ప్రథమ మానవ సృష్టి సమయంలో వేదం ద్వారానే పరమేశ్వరుడు మానవులకు జ్ఞానం యిచ్చాడు. లేకున్న మానవులలో జ్ఞానవికాసం కలిగిఉండేదికాదు. ఎందుచేతనంటే మానవుని జ్ఞానం నైమిత్తికం. ప్రాథమిక జ్ఞానం యితరులవలన మాత్రమే కలుగుతుంది. ఆ జ్ఞాన దాతలలో మొదటిది తల్లి. రెండవవారు తండ్రి లేదా బంధువులు. మూడవవారు ఆచార్యులు, ఉపాధ్యాయులు, మహాత్ములు మొదలైనవారు. **మాతృమాన్ పితృమాన్ ఆచార్యవాన్ పురుషో వేద** అని శతపథ బ్రాహ్మణం చెబుతుంది. ఇప్పుడు కూడా మనకు ఈ ముగ్గురి వలననే జ్ఞానం కలుగుతున్నట్లు స్పష్టంగా తెలుస్తున్నది. అయితే, ఆది మానవులకు జ్ఞానం ఎవరిచ్చారు? అని ప్రశ్నించుకొని ఆలోచిస్తే-సృష్టికర్త తప్ప మరెవరు కాదని అర్థమౌతుంది.

ఇంతేగాక, ప్రపంచ మేధావులంతా "Rigveda is the oldest book in the world Library - ఋగ్వేదమే ప్రపంచ గ్రంథాలయంలో ప్రాచీనతమ గ్రంథం" అని అంగీకరిస్తున్నారు. అట్టి ఋగ్వేదంలోనే ఋక్ యజుసామాథర్వణములు నాలుగు ఆ పరమేశ్వరుని నుండి ఒకేసారి ఉత్పన్నమయ్యాయని చెప్పబడింది.

**తస్మాద్యజ్ఞాత్ సర్వహుత ఋచః సామాని జజ్ఞిరే ।**
**ఛందాంసి జజ్ఞిరే తస్మాద్ యజుస్తస్మాదజాయత ॥**
**(ఋగ్వేదం. 10-90-9)**

సర్వహుత యజ్ఞస్వరూపుడైన ఆ పరమేశ్వరుని నుండే ఋగ్వేదం సామవేదం ఉత్పన్నమయ్యాయి: అంటే, ఉపదేశింపబడ్డాయి. ఛందస్సులు అనబడే అథర్వవేదమును అతని ద్వారానే బోధింపబడింది. యజుర్వేదం కూడా ఆ యజ్ఞరూప పరమేశ్వరుని వలననే ఉత్పన్నమయ్యింది.

ఇచట సర్వహుత యజ్ఞస్వరూపు డనగా జీవుల కల్యాణం కొరకు

చేయబడు సృష్టిరూప యజ్ఞములో తన సామర్థ్యమునంతటిని ఆహుతిగా నర్పించు పరమేశ్వరు డని అర్థం.

తదుపరి ఋషులచే రచింపబడిన బ్రాహ్మణ ఆరణ్యక దర్శన ఉపనిషదాదు లన్నిటిలోను వేదములు పరమేశ్వర ప్రోక్తములుగానే చెప్పబడ్డాయి. ఋషులంతా **"తద్వచనాత్ ఆమ్నాయస్య ప్రామాణ్యమ్"** పరమేశ్వరవచనము లగుటచే ఆమ్నాయములే - వేదములే పరమ ప్రమాణములనియు, వాటికి అనుకూలంగా ఉన్నంతవరకే మా రచనలను అంగీకరించుడనియు తమ తమ శాస్త్రాలలో వ్రాసుకున్నారు. ఇంతేగాక, వేదములు సర్వవిద్యోప బృంహితములనియు, ప్రదీపమువలె సర్వపదార్థజ్ఞాన ప్రకాశకములనియు వేనోళ్ళ కీర్తించారు. కాన, సృష్టిరహస్యాలను తెలుసుకోగోరేవారు వేదాలను ఆశ్రయించి పరిశోధనలు జరపటమే ఉత్తమం. వేదాలతో బాటు వేదార్థాన్ని సమాధి స్థితిలో సాక్షాత్కారం చేసుకున్న ఋషులు వ్రాసిన శాస్త్రాలుకూడా మనకు సహకరిస్తాయి. బీజరూపంలో ఉన్న వేదార్థాన్ని వివరించి చెబుతాయి.

నేడు సృష్టిరహస్యాలను కనిపెట్టడానికి సంపన్న దేశాలు కోట్లాది డాలర్లు ఖర్చుపెట్టి యంత్రాలు నిర్మిస్తున్నాయి. ఆధునిక వైజ్ఞానికులు నిరంతరంగా పరిశోధనలు కొనసాగిస్తున్నారు. అయినా సరియైన సిద్ధాంతం కనిపెట్టలేకున్నారు. వీరు వేదశాస్త్రాలు తెలిసిన పండితుల సహకారంతో, వారి సూచనల ననుసరించి పరిశోధనలు చేస్తే సత్యసిద్ధాంతాలను కనిపెట్టగలుగుతారు. దానితో తక్కువ ఖర్చుతో విజ్ఞానం మరింత వికసించగలదు. ఉదాహరణకు-నేటి వైజ్ఞానికులు సృష్టిరహస్యాలను కనిపెట్టడానికి దక్షిణ ధృవం వద్ద మంచులో 1400 మీటర్ల లోతులో 'అమండా' అనే ఒక భారీ టెలిస్కోపు పరికరాన్ని నిర్మించారు. ఒక

కిలోమీటరు ఎత్తు, 200 మీటర్ల వెడల్పు ఉన్న గొట్టంలో 700 సెన్సార్స్‌లతో నిర్మితమైన ఈ టెలిస్కోప్ పేరు 'అమండా'. దీనితో విశ్వాంతరాళం నుండి వస్తున్న న్యూట్రినోలను పసిగట్టి పట్టుకుని విశ్లేషించాలనీ, సృష్టిరహస్యాలను కనిపెట్టాలని వీరి ప్రయత్నం. అందుకు దాని శక్తికూడా సరిపోక 5,000 సెన్సార్స్ ఉండే మరొక యంత్రం నిర్మిస్తున్నారు. ఈనిర్మాణం పూర్తికావడానికి మరొక 5 ఏండ్లు పడుతుందట. ఖర్చు వేల కోట్ల డాలర్లు. ఇటువంటిదే 'పియరీ ఆగర్ అబ్జర్వేటరీ'. కాస్మిక్ కిరణాలు ఎక్కడ నుండి వస్తున్నాయో తెలుసుకోవడానికి ఈ ప్రయత్నం. వీటి ఫలితం ఏమిటో వేచిచూడాలి. కాని, మన ప్రాచీన మహర్షులు పరమేశ్వరుడిచ్చిన బుద్ధి అనే అద్భుత యంత్రంతోనే అద్భుతాలను ఆవిష్కరించారు. ప్రపంచ మూలకణాలను తెలుసుకోగలిగారు. సృష్టిరహస్యాలను తెలుసుకొన్నారు. వారు కనిపెట్టినవి సత్యసిద్ధాంతాలు. ఎన్ని యుగాలు గడచినా వాటిని సరిదిద్దుకోనక్కరలేదు. కపిల మహర్షి వ్రాసిన సాంఖ్యదర్శనం (1-61) యిందుకు నిదర్శనం.

**సత్వరజస్తమసాం సామ్యావస్థా ప్రకృతిః**

సత్వము, రజస్సు, తమస్సు అనబడే మూడు రకాల సూక్ష్మతమ కణాలే సృష్టికి మూలం. అవే ప్రపంచ పదార్థాలన్నిటికి మూలకణాలు. ఇవి సామ్యావస్థలో ఉంటే వాటి ఉనికిని అసలు మనం గుర్తించనేలేము. సృష్టినిర్మాణం చెయ్యాలనుకొన్నపుడు పరమేశ్వరుడు కొన్ని నియమాల ప్రకారం వాటిని హెచ్చుతగ్గులుగా కలుపుతూ కలుపుతూ మనకు కనబడే ఈ సృష్టిని నిర్మిస్తాడు. ఆ నిర్మాణ క్రమం ఈ విధంగా ఉంటుంది.

ప్రకృతేర్మహాన్ ఆ మూల ప్రకృతినుండి ముందుగా మహత్తత్వం పుడుతుంది. దీనితోనే పరమేశ్వరుడు మానవులలోని బుద్ధిని తయారుచేస్తాడు.

**మహతో ౭ హంకారః** - ఆ మహతత్త్వం నుండి అహంకారం అనే మరికొంత స్థూలపదార్థాన్ని నిర్మిస్తాడు. (ఇచ్చట అహంకారం అంటే మానవులలోని నేనే గొప్ప అనుకునే అహంకార భావం కాదు. ఇది సూక్ష్మ పరమాణులతో నిర్మింపబడిన ఒక పదార్థం.)

**అహంకారాత్ పంచ తన్మాత్రాణి, ఉభయమింద్రియం** - అహంకారం నుండి పంచ తన్మాత్ర లనే అయిదురకాల సూక్ష్మపదార్థాలు నిర్మింపబడతాయి. వాటిని శబ్ద స్పర్శ రూప రస గంధ తన్మాత్ర లంటారు. ఆ అహంకారంతోనే మన శరీరంలో పంచ జ్ఞానేంద్రియాలు, పంచ కర్మేంద్రియాలు మరియు వీటిని సంయుక్తం చేసే మనస్సు నిర్మించబడతాయి. అహంకారంతో పుట్టినవి అన్నీ కలిసి 16 అవుతాయి. ఇవి ఏవీ కంటికి కనబడేవికావు. మనకు కనబడే యింద్రియాలు బాహ్యపరికరాలు మాత్రమే. వాటిలో మనకు కనబడని ఈ సూక్ష్మేంద్రియా లుంటాయి.

**తన్మాత్రేభ్యః స్థూల భూతాని** - అహంకారం నుండి ఒక భాగంగా పుట్టిన పంచ తన్మాత్రలనుండి మనకు కనబడుతున్న స్థూలభూతాలు పుట్టాయి. అందుచేతనే పంచభూతాలలో పంచగుణాలు (శబ్ద స్పర్శ రూప రస గంధాలు) ప్రధానంగా కనబడుతున్నాయి.

ఇవన్నీ మూల ప్రకృతి నుండి క్రమంగా ఏర్పడిన జడ పదార్థాలు. వీటిలో జ్ఞానంలేదు. కాని, ప్రాణులలో సుఖదుఃఖాలను అనుభవించే జ్ఞానం కనబడుతున్నది. ఈ జ్ఞానం ప్రకృతి పదార్థాల కలయిక వల్ల క్రొత్తగా పుట్టిందికాదు. జడం నుండి జ్ఞానం పుట్టడం అసంభవం. కనుక ప్రకృతికన్న వేరుగా జ్ఞానం కలిగిన పదార్థం మరొకటి ఉందని అంగీకరించవలసి వస్తుంది. దానినే కపిల మహర్షి -

**'పురుషః' ఇతి పంచవింశతిర్గణః'** అని అంటారు. పైన చెప్పిన

24 తత్వాలేకాక జ్ఞానం కలిగిన పదార్థం ఒకటి ఉంది. అదే పురుషుడు (జీవుడు). ఇవి అన్నీ కలిసి మొత్తం 25 తత్వాలుగా ఆయన లెక్కించారు.

ఈ సత్య సిద్ధాంతం ఎన్ని యుగాలు గడచినా, ఎంత విజ్ఞానం పెరిగినా యిలాగే ఉంటుంది. మహర్షి కపిలుని ఈ సాంఖ్యసిద్ధాంతానికి మూలం వేదం.

ఋగ్వేద దశమ మండలంలోని 27వ సూక్తంలో సృష్టినిర్మాణం అద్భుతంగా వర్ణింపబడింది. కమ్మరి యినుమును అగ్నిలో కాల్చి రకరకాల పరికరాలు చేయునట్లుగా పరమేశ్వరుడు మూల ప్రకృతి నుండి ప్రపంచ పదార్థాలు నిర్మాణం చేసాడని వర్ణింపబడింది. అణువులలో పరమాణువులు నృత్యం చేస్తూ పరిభ్రమిస్తూ ఉంటాయనీ, అట్టి అణువులతో ఈ సృష్టి నిర్మింపబడిందనీ చెప్పబడింది. మరెన్నో సృష్టిరహస్యాలు ఆ సూక్తంలో ఉన్నాయి. ఉదాహరణకు –

**అష్టౌ పుత్రాసో అదితేర్యే జాతస్తన్వ స్పరి ।**
**దేవాం ఉప ప్రైత్సప్తభిః పరా మార్తాణ్డమాస్యత్ ॥**

**(ఋ. 10-72-8)**

అదితికి అనగా మూలప్రకృతికి ఎనమండుగురు పుత్రులు. వారిలో ఏడుగురు భూమిపైనే ఉన్నారు. ఒకడు మార్తాండుడై ఆకాశంలో ఉన్నాడు.

అంటే, మూల ప్రకృతినుండి పంచభూతాలు మనస్సు బుద్ధి అహంకారం అనే 8 మంది పుత్రులు పుట్టారు. వారిలో అగ్నితత్వం సూర్యుడు ఆకాశంలోకి ఎగిరాడు. ఇది అలంకారిక వర్ణన. భగవద్గీత (7-34) లో కూడా ప్రకృతి 8 విధాలుగా విభక్తమయ్యిందని చెప్పబడింది.

**భూమిరాపో ఽ నలో వాయుః ఖం మనో బుద్ధిరేవ చ ।**
**అహంకార ఇతీయం మే భిన్నా ప్రకృతిరష్టధా ॥**

వేదాలలో యిట్టి సూక్తాలు, మంత్రాలు చాలానే ఉన్నాయి. వీటి ఆధారంతో పరిశోధనలు చేస్తే విజ్ఞానం ఎంతగానో వికసిస్తుంది.

## ప్రాణిసృష్టి

ఈ భూమిపై ప్రాణిసృష్టి వనస్పతులతో (వృక్షజాతులతో) ప్రారంభమయ్యింది. అంతకు పూర్వమే భూమిలో కొన్ని మార్పులు జరిగాయని శతపథ బ్రాహ్మణం చెబుతుంది."స శ్రాన్తస్తేపానః ఫేన మసృజత । .........స శ్రాన్తస్తేపానో మృదం శుష్కా-పయూష సికతం శర్కరమ్ అశ్మానమ్ అయో హిరణ్యమ్ - ఓషధి -వనస్పతి - అస్రుజత । తేనేమాం పృథివీం ప్రాచ్ఛాదయత్ ॥ తా వా ఏతా నవ సృష్టయః ॥

**(శతపథం 6-1-11-13, 14)**

పృథివి సృజింపబడిన కొద్ది కాలం తదుపరి ముందుగా 1. ఫేనము, అనంతరం-2. మృత్తు (మట్టి) తదనంతరం క్రమంగా 3. శుష్కాపమ్, 4. ఊష, 6. సికతా, 6. శర్కరా 7. అశ్మా, 8. పయః మరియు 9. హిరణ్యం. హిరణ్యం నుండి ఓషధి - వనస్పతులు సృజింపబడ్డాయి.

ఆధునిక విజ్ఞానంకూడా పృథివి సృజింపబడినపుడు కొన్ని మార్పులు జరిగాయని చెబుతుంది. భూమిలో ఏర్పడిన కొన్ని రసాయనిక మార్పులవల్ల అత్యధిక ఉష్ణం ఏర్పడింది. దానితో భూమంతా కరిగి ద్రవంగా మారింది. అప్పుడు బరువైన యినుము, నికిల్ మొదలైన లోహాలు క్రిందకు అంటే కేంద్రం దగ్గరకు చేరి కోర్ గా (పండు మధ్యలోని గింజలవలె) ఏర్పడ్డాయి. తేలిక లోహాలు ఔటర్ కోర్గాను (గింజల చుట్టూ ఉండే భాగం గాను) మరికొన్ని పొరలుగాను ఏర్పడ్డాయి. ఈ ప్రక్రియలో ఆ ఘణపదార్థాలలోని వాయువులు, నీటియావిరి విసర్జింప బడి భూమిపైకి విసిరివేయబడ్డాయి. ఆ వాయువులే వాతావరణ పొరగా

ఏర్పడ్డాయి. ఇక భూమి పైభాగాన పలుచటి పదార్థాలు క్రమంగా గట్టిపడి క్రస్ట్ (పక్కుగా) (పండుపై తొక్కవలె) ఏర్పడ్డాయి. దీనిని ఒక క్రస్ట్‌గా (పక్కుగా) పేర్కొనబడినా యిది 10 నుండి 60 కిలోమీటర్ల దలసరి ఉంటుంది. లోతైనా సముద్రాలవద్ద 10 కిలో మీటర్లు, ఎత్తైన పీఠభూములందు 35 నుండి 60 కిలో మీటర్ల దళసరిగా ఉంటుంది. అయినా దీనిని పక్కుగా (పొరగా) ఎందుకు పేర్కొన్నారంటే భూమియొక్క వ్యాసార్థం (6,400 కిలోమీటర్ల) ముందు అది ఒక సన్నని గీతవలె వుంటుంది కనుక. ఈ పై పొరకు (క్రస్ట్‌కు) ఔటర్ కోర్‌కు మధ్య పాక్షికంగా కరిగిన భూ పదార్థం ఉంటుంది. దీనికి Mantle (చిమ్నీ) అని పేరు పెట్టారు. ఈ విధంగా భూమి ప్రారంభదశలో వేడికి కరిగి పొరలు పొరలుగా ఏర్పడిందని ఆధునిక విజ్ఞానం చెబుతుంది.

చల్లబడిన పై పొరపైననే ప్రాణిసృష్టి ప్రారంభమయ్యింది. దీనికి వాతావరణపొర, సముద్రాలు సహకరించాయి. భూమినుండి పైకి 8 కిలో మీటర్లు, సముద్రాలలో లోనికి 8 కిలోమీటర్లు గల భాగాన్ని బయోస్ఫియర్ (జీవరాశి నివసించగల) భాగంగా పేర్కొంటారు. జీవరాశి మనుగడకు నీరు ముఖ్యావసరం. కనుక ముందుగా భూమిపై నీరు ఏర్పడింది.

పై పేరాలో చెప్పుకొన్నట్లుగా ప్రారంభదశలో భూమి అత్యధిక ఉష్ణానికి గురియైనపుడు అందలి వాయువులు, నీటియావిరి బయటకు త్రోసివేయబడ్డాయి. అవే వాతావరణ పొరగా ఏర్పడ్డాయి. ఆ నీటియావిరి క్రమంగా మేఘాలుగా ఏర్పడింది. అది పరిస్థితులు అనుకూలించినపుడు వర్షంగా కురిసి సముద్రాలు ఏర్పడ్డాయి. ఆ విధంగా సముద్రాలు ఏర్పడటానికి వేల, లక్షల సంవత్సరాలు పట్టిందని చెబుతారు. మన ప్రాచీన శాస్త్రాలలో కూడా యిట్టి వర్ణనలు కనబడతాయి.

ముందుగా పృథివిఅంతా జలమయం అయ్యింది. తదుపరి నీరంతా పల్లానికి చేరుకోగా కొద్దిభాగం పృథివి బయటకు వచ్చింది. అట్టి కొద్ది భాగంపై ఓషధి వనస్పతులు ఉత్పన్నమయ్యాయని తైత్తరీయ సంహిత చెబుతుంది.

**"అథ వై తర్హి అల్పా పృథి వ్యాసీద్ అజాతా ఓషధయః"**

**తై.సం. 2-1-2**

సృష్టాదిలో ఓషధిబీజములు ద్యులోకాన్నుండి వచ్చినట్లుగా మన శాస్త్రాలలో కనబడుతుంది.

**సోమ ఓషధీభిరుదక్రామత్ తాం ।**

**అథర్వ. 19-19-5**

అంటే సోమము నుండి ఓషధులు ఉత్పన్నమయ్యాయి. మరి, ఆ సోముడంటే ఎవరో జైమనీయ బ్రాహ్మణం వివరిస్తుంది.

**సోమం వై రాజానాం యత్ సుపర్ణ ఆహరత్ సమభినత్ తస్య వా విపుణో అపంతంస్తా ఏవమా ఔషధయోఽభవన్ । సర్వా ఉ హవై సౌమ్యా ఓషధయః ॥**

**జైమనీయ బ్రాహ్మణం. 1-355**

సోమరాజును ఒక సుపర్ణము తీసుకువచ్చి భేదించింది. దాని నుండి విడివడి పడిన కొన్ని చినుకులే - పలుకులే లేదా విత్తనాలే ఓషధులైనవి. కనుక సమస్త ఓషధులు సోమములే - అనగా సోమమునుండి ఉత్పన్నమైనవే.

దీని భావ మేమనగా - సోమము అంతరిక్షంలో ఉన్న ఒక దివ్యశక్తి. దానిని సుపర్ణుడు అనగా పరమేశ్వరుడు భూమికి సమీపంగా తీసుకువచ్చి భేదించాడు. దానినుండి విడివడి భూమిపైబడిన ఆ కొద్ది తుంపరల నుండే ఓషధులు ఉత్పన్నమయ్యాయి.

శాస్త్రాలలో చెప్పబడిన ఈ సోమము బహుశః కొందరు వైజ్ఞానికులు చెప్పే నైట్రోజన్‌మేఘం కావచ్చు. వారేమంటారంటే - "సృష్ట్యాదిలో భూమిపై నైట్రోజన్ లేకుండేది. ఏదో మహత్తర ప్రకృతి శక్తివల్ల అంతరిక్షం నుండి ఒక పెద్ద నైట్రోజన్ గల గ్రహం (లేదా మేఘం) భూమికి సమీపంగా రావటం జరిగింది. దానినుండి కొంత నైట్రోజన్ విడివడి భూ వాతావరణంలో ప్రవేశించింది. దానివల్లనే వృక్షజాతు లుత్పన్నమయ్యాయి" అని చెబుతారు. ఈ విషయమే శాస్త్రాలలో ఆలంకారికంగా వర్ణింపబడి ఉండవచ్చు. మరి విత్తనాలు ఎలా వచ్చాయి? అనేది ప్రశ్నగానే ఉంటుంది. ఏమైనా ఆది సృష్టి-అమైథున సృష్టి. ఏ ప్రకృతి నియమాల వల్ల కలిగిందో చెప్పడం కష్టమే. అందుచేతనే హేతుబద్ధంకాని అవైజ్ఞానికమైన డార్విన్ వికాసవాదం ప్రాచుర్యం పొందింది. ఏమైనా, ఒక జాతి మరొక జాతిగా పరివర్తన చెందడం సృష్టి విరుద్ధం. అసంభవం.

డార్విన్ వికాసవాదంపై నేటి వైజ్ఞానికులలో కూడా అనేక సందేహాలు తలెత్తుతున్నాయి. నేడు ఏకకణ జీవివంటి అమీబాను, పూర్ణవికసిత మానవుని ఒకేసారి చూస్తున్నాం. అట్లే క్రమ వికాసం చెందినవని చెప్పు ప్రాణిజాతులన్నిటిని మనమిప్పుడు చూస్తున్నాం. కొన్ని సంవత్సరాల క్రిందట ఒక కొండగుహలో త్రవ్విన త్రవ్వకాలలో స్వరపేటికగల మానవుని ఎముకలు, స్వరపేటికలేని మానవాకారం గల వానర ఎముకలు దొరికాయి. అవి రెండూ ఒకే కాలానికి చెందినవన్నట్లుగా ఋజువయ్యింది. దీనినిబట్టి ఆ రెండు జాతులు ఒకే కాలంలో ఉండేవనీ, వారు ఆ గుహలో కలిసి జీవించారనీ అర్థం అవుతోంది. ఇట్టివే మరెన్నో ప్రశ్నలు, సందేహాలు డార్విన్ వికాసవాదంపై ఉన్నాయి.

సృష్టికర్తయైన పరమేశ్వరుడు సర్వవ్యాపకుడు. సర్వ శక్తిమంతుడు. ఎవరి సహాయం లేకుండా తానొక్కడే ఈ విశాల విశ్వాన్ని సృజించి ధరిస్తున్నాడు. అట్టి పరమేశ్వరుడే ప్రాణిసృష్టికి అనువైన భూగ్రహాన్ని సృజించాడు. అట్టి భూమిపై ముందుగా వృక్షజాతులను, తదుపరి జల వాయుచరాలను సృజించాడు. చివరగా సర్వోత్తమ ప్రాణిగా మానవుని సృజించాడు. ఈ ప్రాణిజాతులన్నిటిని డార్విన్ చెప్పినట్లుగా కాక వేరువేరుగానే సృజించాడు. ఆ ప్రాణులనుకూడా ఒక్కొక్క జంటగా కాక అనేక స్త్రీ పురుష ప్రాణులను సృజించాడు. సృష్ట్యాదిలో సృజింపబడిన ఈ ప్రాణులన్నీ అమైథునంగానే (స్త్రీపురుష సంయోగం లేకుండానే) సృజింపబడ్డాయి. ఇది పరమేశ్వరుని అత్యద్భుత ప్రక్రియ.

ఈ ప్రాణిజాతులలో మానవునకు తప్ప మిగిలిన ప్రాణులన్నిటికి అవి జీవించగలుగుటకు కావలసిన సామాన్యజ్ఞానాన్ని పరమేశ్వరుడు జన్మతోనే యిచ్చాడు. అట్లని పరమేశ్వరుడు మానవులకు అన్యాయం చేయలేదు. మరి ఏ ఇతర ప్రాణికి లేని సర్వోత్తమమైన అద్భుతాద్భుత బుద్ధిని మానవుల కిచ్చాడు. బుద్ధి అంటే జ్ఞానాన్ని గ్రహించే సాధనం. దీనిని అంతరింద్రియం అంటారు. ఇది కన్ను ముక్కు చెవి వలె బయటకు కనబడే ఇంద్రియం కాదు. ఇది శరీరంలోపల ఉండి మిగిలిన యింద్రియాల ద్వారా తీసుకురాబడిన జ్ఞానాన్ని గ్రహించి వివేచిస్తుంది. పూర్వ సంస్కారాలను బట్టి (అనుభవాలను బట్టి) స్పందిస్తుంది.

విశ్వసృష్టిని, ప్రాణిసృష్టిని వివరంగా తెలుసుకోగోరేవారు వేదాలలో గల పురుష సూక్తాలను, దర్శన ఉపనిషదాదులలోగల సృష్టిరచనా ప్రకరణాలను చదువగోరుచున్నాము. సృష్టిలో 84 లక్షల ప్రాణిజాతులున్నట్లు పురాణాలలో చెప్పబడింది. మానవులుచేసే చిత్రవిచిత్ర కర్మలకు తగిన

ఫలాలను ఇవ్వడానికే పరమేశ్వరుడు ఇన్నిరకాల ప్రాణిజాతులను సృజించవలసి వచ్చింది. **కర్మ వైచిత్ర్యాత్ సృష్టి వైచిత్ర్యమ్** - (సాంఖ్యదర్శనం 6-41) అని కపిల మహర్షి అంటారు.

మానవజన్మ ఒక్కటే కర్మయోని. అతను చేసిన కర్మలే పుణ్యకర్మలు గాని, పాపకర్మలుగాని, మిశ్రిత కర్మలుగాని అవుతాయి. వాటికే కర్మఫలాలు ఉంటాయి. దీనికి కారణం మానవునిలో ధర్మాధర్మాలను కర్తవ్యాకర్తవ్యాలను, పాపపుణ్యాలను తెలుసుకునే బుద్ధి ఉంది. మిగతా ప్రాణులలో అట్టి వివేకం లేదు. అందుచే మిగిలిన 83,999 ప్రాణి జాతులు కేవలం భోగయోనులే. ప్రళయానంతరం జరిగే ప్రాణిసృష్టిలో వివిధ ప్రాణిజాతులు ఉత్పన్నం కావడానికి కారణం ఆ ప్రళయానికన్న ముందు ఉండే సృష్టిలోని జీవుల కర్మలే. కావుననే జడ ప్రాణి సృష్టులు రెండూ ప్రవాహరూపంలో అనాదు లంటారు. అంటే వాటికి మొదలులేదు. అంతంకూడా ఉండదు. కాకపోతే ఏ మానవునిలో వివేకజ్ఞానం వికసించి ప్రాపంచిక సుఖాలపై విరక్తి కలిగి దుష్కర్మలనుండి దూరమై యోగసాధన చేస్తాడో అతనికి ఆత్మ పరమాత్మల సాక్షాత్కారం కలుగుతుంది. జననమరణ సంసార చక్రబంధనం విడిపోతుంది. ప్రకృతి బంధనాలన్నిటి నుండి విముక్తుడౌతాడు. దీనినే ముక్తి అంటారు.

ఆ ముక్తికాలానికి కూడా అవధి (పరిమితి) ఉంది. ఆ అవధి పరాంతకాలం. అంటే నూరు బ్రహ్మ సంవత్సరాలు. ఇప్పటి లెక్కల ప్రకారం 3,11,040 కోట్ల సంవత్సరాలు. అంతకాలం ముక్తజీవుడు పరమేశ్వరుని ఆనందాన్ని అనుభవిస్తాడు. ఆ అవధి ముగిసిన అనంతరం - **'పరాంతకాలే పరిముచ్యంతి సర్వే'** తిరిగి ప్రకృతి బంధనంలోకి వచ్చి సామాన్య మానవునిగా జన్మిస్తాడు.

## ప్రథమ మానవసృష్టి

ముందు ప్రకరణంలో తెలిసికొన్నట్లుగా సంవత్సరాల తరబడి కురిసిన వర్షాల కారణంగా భూమంతా జలమయ మయ్యింది. తదుపరి ఆ నీరంతా పల్లమునకు ప్రవహించుట చేతను, కొంత నీరు సూర్యతాపానికి ఆవిరిగా మారిపోవుటచేతను భూమిలోని ఎత్తైన భాగం నీటి నుండి బయటకు వచ్చింది. అవే ఎత్తైన హిమాలయపర్వతాలు. ఆ తదుపరి పర్వత సానువులలోని పీఠభూములు, లోయలు బయటకు వచ్చాయి. ఆ విధంగా నీటినుండి బయటకు వచ్చిన భూభాగంపై ప్రాణిసృష్టి జరిగింది. ఆది మానవులు కూడా ఆ పీఠభూమిపైననే సృజింపబడ్డారు. ఆ పీఠభూమికి త్రివిష్టపము అనే పేరు ఉన్నట్లుగా మన ప్రాచీన శాస్త్రాలలో కనబడుతుంది. దానిని మనం యిప్పుడు టిబెట్ అంటున్నాం. ఆ పీఠభూమిపై అన్నిరకాల ప్రాణులు సృజింపబడ్డాయి. మానవులకు కావలసిన ఫలవృక్షాదులు, ఓషధులు అంటే ఆహారానికి పనికివచ్చే కాయధాన్యాలు, పప్పుధాన్యాలు నూనె గింజలు మొదలగునవన్నీ సృజింపబడిన తదుపరి మానవ సృష్టి జరిగింది. పెంపుడు జంతువులైన ఆవులు, అశ్వములు, కుక్కలు మొదలైనవికూడా ముందే సృజింపబడ్డాయి. అవి యివి అననేల అన్నిరకాల జీవరాశులు సృజింపడిన తదుపరి చివరి ప్రాణిగా మానవుడు సృజింపబడ్డాడు.

**"ఆ ఆది మానవసృష్టి అమైథునసృష్టి. అనేకమంది స్త్రీ పురుషులు ..కేసారి యువావస్థలో జన్మించారు."** అని మహర్షి దయానందుల వారి ..భిప్రాయం. ఇది వారి కపోల కల్పిత అభిప్రాయం కాదు. మన ..చీన వైదిక వాఙ్మయాన్నంతా తరచి, మథించి తెలుసుకున్న ప్రాకృతిక ..యమం-సత్యం. ఆ ఆదిమానవ సృష్టిని అర్థంచేసుకోవడం కష్టం. దానిని

వివరించటం మరింత కష్టం. ఇప్పుడు ఏ ఏ రసాయనాల (ఎలిమెంట్స్) ద్వారా పురుషులలో వీర్యం, స్త్రీలలో అండాలు తయారవుతున్నాయో అట్లే ఆదిసృష్టిలో అండ వీర్యాలను పరమేశ్వరుడు భూమిలోనే సృజించి యుండవచ్చును. ఎట్లో ఆ రెంటిని కలిపి భూమి పొరలలోనే గర్భకోశము వంటి అండమును నిర్మించి ఉండవచ్చును. యువావస్థ వచ్చువరకు ఆ అండములలోనే పెంచిపెద్దచేసి ఉండవచ్చును. యువావస్థ వచ్చిన తదుపరి గ్రుడ్డులోనుండి కోడి పిల్లలు బయటకు వచ్చునట్లు ఆ ఆదిమానవులు బయటకు వచ్చివుండవచ్చును. ఎందుచేతనంటే వారు బాల్యావస్థలోనే బయటకు వస్తే వారిని పాలించి పోషించి పెద్దచేసేవారు ఉండరు. వృద్ధులుగా సృజింపబడితే సంతానాన్ని కని, పెంచి పెద్దచేసే సామర్థ్యం వారి కుండదు. కనుక యువావస్థలోనే ఆదిమానవసృష్టి జరిగింది. ఇంతేగాక, ఆదిలో ఒకే స్త్రీ పురుష జంటను సృజిస్తే వారి సంతానమే (అన్నా చెల్లెండ్రు) పరస్పరం వివాహం చేసుకొని సంతానాన్ని నిర్మించవలసిన పరిస్థితి ఏర్పడి ఉండేది. ఆ విధంగా ఏర్పడిన సంతానం క్రమంగా నిర్వీర్యమై అయోగ్యులై పోయేవారు. క్రమంగా మానజాతియే నశించియుండేది. కనుక తర్కంతో ఆలోచిస్తే పైన చెప్పిన ఋషివాక్యాలే సత్యములని ఒప్పుకోక తప్పదు.

ఆ ఆదిమానవులు మూడురకాలుగా ఉంటారని వేదం చెబుతుంది.

**తేన దేవా అయజన్త సాధ్యా ఋషయశ్చయే ॥**

**(యజుర్వేదం. 31 - 6)**

వా రెవరనగా దేవతలు, సాధ్యులు, ఋషులు. దేవతలంటే విద్యా వినయ సంపన్నులు, పరోపకారాది దివ్యగుణ సంపన్నులు. సాధ్యు లంటే సృష్టికార్యానికి సాధకులుగా ఉండే సామాన్య మానవులు. వీరు

దేవత్వాన్ని, ఋషిత్వాన్ని పొందడానికి సాధన చేస్తూఉంటారు. ఇక ఋషులంటే విద్యలోను యోగసాధనలోను అత్యున్నత స్థితిని పొందినవారు. అట్టి పవిత్ర హృదయులైన ఋషులకే పరమేశ్వరుడు వేదజ్ఞానాన్ని అందజేస్తాడు.

ఆ ఆది సృష్టిలోని ఋషులు ముందుగా కండ్లుతెరచి ఈ సృష్టిని వీక్షించి మేము ఎవరము? ఈ సృష్టి ఏమిటి ? ఈ సృష్టిలో మా కర్తవ్య మేమి? టని ఆలోచిస్తూ సమాధి స్థితిలోనికి వెళ్ళారు. వారిలో విద్యాగ్రహణ సామర్థ్యం గల నలుగురు ఋషులకు పరమేశ్వరుడు వేదజ్ఞానాన్ని ఉపదేశిస్తాడు. ఆ ఉపదేశం నేటి గురు శిష్య ఉపదేశం వలె బాహ్యంగా కాక ఆంతర్యంలో జరుగుతుంది. సర్వాంతర్యామియైన పరమేశ్వరుడు పవిత్రాంతః కరణాలు గల నలుగురు ఋషుల హృదయాలలో వేదజ్ఞానాన్ని ప్రకాశపరుస్తాడు.

అగ్నేర్ ఋగ్వేదో వాయోర్యజుర్వేదః సూర్యాత్సామవేదః

**(శత. బ్రా. 11-4-2-3)**

అగ్ని నామక ఋషికి ఋగ్వేదం, వాయుఋషికి యజుర్వేదం. సూర్య (ఆదిత్య) ఋషికి సామవేదం ఉపదేశింపబడ్డాయి. మరొకచోట అంగిరఋషికి అథర్వవేదం ఉపదేశింపబడినట్లుగా చెప్పబడింది.

ఆ నలుగురు ఋషులు వారు పొందిన వేదజ్ఞానాన్ని దేవతలకు, సామాన్యమానవులకు ఉపదేశిస్తూ వారిని విద్యావంతులుగా, సంస్కార వంతులుగా కర్తవ్యపరాయణులుగా చేసారు. వారిలో బ్రహ్మ అనుపేరు గల ఒక గొప్ప వ్యక్తి పై నలుగురు వేదఋషులద్వారా నాలుగువేదాలను అభ్యసించి బుద్ధియందు ధారణచేసి చతుర్వేదిగా ప్రసిద్ధుడయ్యాడు. ఇతనినే పురాణాలలో ఆలంకారికంగా 'చతుర్ముఖ బ్రహ్మ' అని వర్ణించారు. నాలుగు

ముఖాలంటే నాలుగు వేదాలని అర్థంచేసుకోవాలి. ఆ తదుపరి గురుశిష్య పరంపరగా వేదాలు ఉపదేశింపబడుతూ ఆనాటి నుండి ఈనాటి వరకు నిలిచి ఉన్నాయి. ఇవి ఒకరినుండి మరొకరు వింటూ వస్తున్నవి కనుక వీటిని శ్రుతులన్నారు.

## వేదోత్పత్తి ఎప్పుడు జరిగింది ?

ప్రథమ మానవసృష్టి సమయంలోనే వేదాలు ఉపదేశించబడ్డాయి. అప్పటినుండి ఋషులు కాలాన్ని గణిస్తూ వచ్చారు. ఆ గణన యిప్పటి వరకు అంటే క్రీ.శ. 2005 ఉగాదివరకు 196 కోట్ల 8 లక్షల 53వేల 105 సంవత్సరాలు పూర్తయ్యాయి. (196, 08,53,105) ఇప్పుడు 106వ సంవత్సరం గణింపబడుతూ ఉంది. ఈ గణనే మన భారతీయ పరంపర ననుసరించి మన్వంతరాలుగా, చతుర్యుగాలుగా, యుగాలుగా సంకల్పంలో చెప్పుకుంటూ ఉంటాం. ఇప్పుడు సప్తమ మన్వంతరంలోని 28వ కలియుగం జరుగుతోంది. భారతీయ పరంపర ననుసరించి కాలగణన ఈ విధంగా ఉంటుంది.

| | | | |
|---|---|---|---|
| 1 | నిమేషం | (రెప్పపాటుకాలం) | = 0.18 సెకన్లు |
| 18 | నిమేషాలు | ఒక కాష్ఠా | = 3.2 సెకన్లు |
| 30 | కాష్ఠాలు | ఒక కలా | = 96 సెకన్లు |
| 30 | కలాలు | ఒక ముహూర్తం | = 48 నిముషాలు |
| 30 | ముహూర్తాలు | ఒక దిన+రాత్రులు | = 24 గంటలు |
| 30 | దినరాత్రులు | ఒక మాసం | = 2 పక్షములు |
| 12 | మాసాలు | ఒక వర్షం | = (సంవత్సరం) |
| 360 | వర్షాలు | ఒక దేవ వర్షం | |
| 12,000 | దేవవర్షాలు | ఒక దేవయుగం | = ఒక చతుర్యుగం |

1,000 దేవయుగాలు ఒక బ్రహ్మదినం = (సృష్టికాలం)
1,000 దేవయుగాలు ఒక బ్రహ్మరాత్రి = (ప్రళయకాలం)

వీటిని మానవ సంవత్సరాలలోకి మారిస్తే

సృష్టికాలం 4320000000 (432 కోట్ల సంవత్సరాలు)
ప్రళయకాలం 4320000000 (432 కోట్ల సంవత్సరాలు)

ఈ సృష్టికాలాన్ని 1000 దేవయుగాలుగా (లేదా వెయ్యి చతుర్యుగాలుగా విభజించి వ్యవహరించుట కలదు. అట్లే సృష్టికాలాన్ని 14 మన్వంతరములుగా విభజించి వ్యవహరించుటయు కలదు. ఆ లెక్కల ప్రకారం ఒక మన్వంతరంలో 1000/14 (71.428) దేవయుగా లుంటాయి. వీటిని యిప్పుడు మన వ్యవహారంలో ఉన్న మానవ సంవత్సరాలలోకి మారిస్తే 30,85,71,428 సంవత్సరాలవుతాయి.

**యుగానాం సప్తతిః సైకా మన్వంతర మిహోచ్యతే ।**
**కృతాబ్ద సంఖ్యా తస్యాన్తే సన్ధిః ప్రోక్తో జలప్లవః ॥ (18)**
**స సన్ధయస్తే మానవః కల్పే జ్ఞేయా శ్చతుర్దశః ।**
**కృత ప్రమాణః కల్పాదౌ సన్ధి పఞ్చదశః స్మృతః (19)**
**ఇత్థం యుగ సహస్రేణ భూత సంహార కారకః ।**
**కల్పో బ్రహ్మ మహః ప్రోక్తం శర్వరీ తస్య తావతీ ॥ (20)**
**(సూర్యసిద్ధాంతం. అధ్యాయం - 1)**

అని సూర్య సిద్ధాంతం చెబుతుంది.

సృష్టికాలాన్ని 14 మన్వంతరాలుగా విభజించి వ్యవహరించటానికి ఒక కారణం ఉందని చెబుతారు. ఒక్కొక్క మన్వంతరానంతరం సృష్టిరచనలో కొన్ని విశేష మార్పులు జరుగుతాయనీ, మన్వంతరానికి మన్వంతరానికి మధ్య సంధికాలాలు ఉంటాయని కొందరంటారు. కొందరు వాటిని

తీసివేసి గణిస్తారు. సౌలభ్యంకొరకు వారి గణన ఈ విధంగా ఉంటుంది.

| | | |
|---|---|---|
| సత్‌యుగ కాలపరిమాణం | 17,28,000 | మానవ సంవత్సరాలు |
| త్రేతాయుగ కాలపరిమాణం | 12,96,000 | |
| ద్వాపరయుగ కాలపరిమాణం | 8,64,000 | |
| కలియుగ కాలపరిమాణం | 4,32,000 | |
| ఒక చతుర్యుగ కాలపరిమాణం | 43,20,000 | |
| ఒక మన్వంతరంలో 71 చతుర్యుగాలుంటాయి. | x 71 | |
| మన్వంతర కాలపరిమాణం | 30,67,20,000 | |
| ఇప్పటివరకు 6మన్వంతరాలు గడిచాయి | x6 | |
| 6 మన్వంతరాల కాలం | 184,03,20,000 | |
| 27 చతుర్యుగాలు గడచాయి 43,20,000 x 27 | 11,66,40,000 | |
| 28వ చతుర్యుగంలో గడచినవి | | |
| సత్ యుగం | 17,28,000 | |
| త్రేతాయుగం | 12,96,000 | |
| ద్వాపర యుగం | 8,64,000 | |
| కలియుగంలో ఇప్పటివరకు గడచినవి | 5105 | |
| మొత్తం | 196,08,53,105 | |

ప్రథమ మానవసృష్టినుండి మరియు వేదోత్పత్తి నుండి యిప్పటి వరకు 196 కోట్ల (లేదా ఒక వృందము 96 కోట్లు) 8 లక్షల 53 వేల 105 సంవత్సరాలు గడచాయి. ఇది సంధిరహిత సృష్టికాలం అని

గుర్తించాలి. సృష్టికాలం 432 కోట్ల సంవత్సరాలు కనుక యింకా (432,00,00,000-196,08,53,105) 235,91,46,895 సంవత్సరాలు సృష్టి ఉంటుంది. అయితే మధ్యలో అంటే మన్వంతరాల మధ్యలోను, చతుర్యుగాల మధ్యలోను పాక్షిక ప్రళయాలు వస్తూ ఉంటాయి. అప్పుడు ఎంతవరకు ప్రళయం జరిగిందో అక్కడ నుండి మరల సృష్టి జరిగి పూర్ణం అవుతూ ఉంటుంది.

ఒక మన్వంతరానికి మరొక మన్వంతరానికి మధ్య సత్యయుగంతో సమానమైన కాలం అంటే 17, 28,000 సంవత్సరాల కాలం సంధికాలం ఉంటుంది. ఈ సంధికాలంలో జలప్లవనం ఏర్పడుతుంది. మన్వంతరాలలో మొదటిదైన స్వాయంభువ మన్వంతర ప్రారంభానికి ముందుకూడా 17,28,000 సంవత్సరాల సంధికాలం ఉంటుంది. కనుక సంధిరహిత సృష్టికాలానికి 17,28,000X7 = 1,20,96,000 (7 సంధికాలాల మొత్తం) కలిపితే 197,29,49,105 సంవత్సరాలవుతుంది. ఇది సంధిసహిత సృష్టికాలం.

14 మన్వంతరాల పేర్లు ఈ విధంగా ఉంటాయి.

1. స్వాయంభువ, 2. స్వారోచి, 3. ఔత్తమి, 4. తామస, 5. రైవత 6. చాక్షుష, 7. వైవస్వత, 8. సావర్ణి, 9. దక్షసావర్ణి, 10. బృహత్సావర్ణి, 11.ధర్మసావర్ణి, 12. రుద్రపుత్ర, 13. శౌచ్య, 14. భౌతవ్యక.

ఈ భారతీయ కాలగణను చూసి ఆధునిక విద్వాంసులు నివ్వెరపోతారు. ఈ లెక్కలన్నీ ఏ ఆధారంతో గణించారంటారు ? ఎలా నమ్మాలంటారు. దీనికి సమాధాన మేమంటే - ముఖ్యంగా ఈ గణనకు ఈశ్వరీయ జ్ఞానమైన వేదాలు ఆధారం. అథర్వవేదంలో -

**కియతా స్కమ్భః వివేశ భూతం**

**కియద్ భవిష్యదన్వాశయే ౨ స్య ।**

**ఏకం యదంగమకృణోత్ సహస్రధా**
**కియతా స్కమ్భః ప్ర వివేశ తత్ర ॥ (అథర్వ. 10-7-9)**

"సర్వాధారుడైన స్కమ్భ పరమేశ్వరుడు ఎంతవరకు భూతకాలాన్ని ఆక్రమించాడు? ఎంతవరకు భవిషత్కాలాన్ని ఆక్రమించాడు ? (అనే ప్రశ్నలకు సమాధానంగా) ఒక అంగభూతంగా ఉన్న ఈ సృష్టిని వెయ్యి చతుర్యుగాలు కలదిగా సృజించాడు. అట్టి సృష్టిలో అంతటా తాను ప్రవేశించాడు" అని చెప్పబడింది. కనుక ఈ సృష్టి వెయ్యి చతుర్యుగాల కాలపరిమాణం కలదని తెలుస్తున్నది. మరొక చోట -

**'శతం తే ౨ యుతం హాయనాన్ ద్వే యుగే**
**త్రీణి చత్వారి కృణ్మః। (అథర్వవేదం. 8-2-21)**

వంద అయుత వర్షములకు ముందు 2, 3, 4 అంకెలు వేయుటచే ఒక కల్పకాలం వస్తుంది.

అయుతం అంటే, 10,000 (పదివేలు) 100 అయుతము లంటే 10,00,000 (పది లక్షలు) దీనిలో ఒకటితో కలిపి ఏడు అంకెలున్నాయి. ఏడు సున్నలు వ్రాసి వాటికి ముందు వరుసగా 2, 3, 4 అంకెలు వ్రాస్తే 4320000000 (432) కోట్లు అవుతాయి. ఇది ఒక కల్పం యొక్క కాలపరిమాణం అని అర్థం చేసుకోవాలి.

యజుర్వేదంలో నాలుగు యుగాల పేర్లు కనబడతాయి.....

**కృతా యాదినవదర్శం త్రేతాయై కల్పినం**
**ద్వాపరాయాధికల్పనమ్ ఆస్కన్దాయ సభాస్థాణుమ్ ।**
**(యజుర్వేదం. 30-18)**

అహోరాత్రులలో (దిన రాత్రులలో) 30 ముహూర్తాలుంటాయి.

**త్రింశద్ ధామ విరాజతి వాక్ ....ప్రతి వస్తోః**
**(ఋ. 10-189-3)**

ఇచట ధామము అంటే ముహూర్తము (ఉవ్వట, మహీధరుల అభిప్రాయంకూడా ఇదే)

**అహోరాత్రైర్విమితం త్రింశదఙ్గమ్**

**(అథర్వవేదం. 13-3-8)**

**ద్వాదశారం నహి తజ్జరాయ వర్వర్తి చక్రం**
**పరి ద్యామృతస్య ।**
**ఆ పుత్రా అగ్నే మిథునాసో అత్ర**
**సప్తశతాని వింశతిశ్చ తస్థుః ॥ (ఋగ్వేదం. 1-164-11)**

సూర్యుని చక్రంలో 12 అరలు (నెలలు) ఉంటాయి. అవి నిరంతరం తిరుగుతూ ఉంటాయి. అవి ఎప్పుడూ అలసిపోవు. జీర్ణము (ముసలివి) కావు. చనిపోవు. దానికి 720 కవలలైన అహోరాత్రు లనే పుత్రు లుంటారు. (360 దినములు + 360 రాత్రులు).

ఇట్లే అథర్వవేదం 19 కాండ, 7,8 సూక్తాలలో, 27 నక్షత్రాల పేర్లు ఉన్నాయి. అధిక మాసం గురించి -

**వేదమాసో ధృతవ్రతో ద్వాదశ ప్రజావతః ।**
**వేదాయ ఉపజాయతే ॥ (ఋగ్వేద. 1-25-8)**

సౌర చాంద్రమాసములను సరిచేయుటకు (కలుపుటకు) అధిక మాసమును చేర్చాలి.

ఈ విధంగా కాలగణన గురించి వేదాలలో అక్కడక్కడ వర్ణనలు కనబడతాయి. సృష్టాదిలో కాలగణను తెలిసికోగోరిన కొందరు ఋషులు యిట్టి మంత్రాల అర్థాన్ని గురించి మననం చేస్తూ - ఆలోచిస్తూ సమాధి స్థితిలోకి వెళ్ళారు. అట్టి వారికి పరమేశ్వరుడు జ్యోతిష్యవిద్యను బోధించాడు. వారు ఆ విద్యతో ఖగోళాన్ని నిశితంగా పరిశోధించి అద్భుత

మైన జ్యోతిష్యశాస్త్రాన్ని ఆవిష్కరించారు. కాలగణనను ప్రారంభించి ముందు తరాలకు అందజేసారు. ఆ జ్ఞానంతోనే నేటికిని నక్షత్రాల, రాశుల పరివర్తనలను ; సూర్య చంద్ర గ్రహణాలను; గ్రహాల నడకను తెలిసికొన గలుగుచున్నారు.

ప్రాచీనకాలంలో సూర్యసిద్ధాంతం అనే పేరుతో బృహద్ జ్యోతిష్య గ్రంథం ఉండేదట. ఇది సత్యయుగ చివరి భాగంలో రచించబడినట్లు చెబుతారు. ఇప్పుడు ఇది అలభ్యం. దాని ఆధారంతోనే నేడు ప్రచలితమైన సూర్యసిద్ధాంతం వ్రాయబడిందని జ్యోతిష్యవిద్వాంసులు చెబుతారు. ప్రాచీన సూర్యసిద్ధాంతాన్ని 'సూర్యుడు' అను పేరుగల మహర్షి 'మయాసురుడు' అనే పేరుగల ఒక తపస్వికి ఉపదేశించాడు. అందులో గ్రహాల భ్రమణ వృత్తాంతం మొదలైనవి శంకా సమాధాన రూపంలో ఉపదేశించబడ్డాయి. లోకంలో వినుచున్నట్లుగా ఈ మయాసురుడు విదేశీయుడు కాదు. మన దేశీయుడే. ప్రాచీన సూర్యసిద్ధాంతం సుమారు 21, 65,000 సంవత్సరాల పూర్వం వ్రాయబడింది. ఇప్పుడు మనకు లభించే సంక్షిప్త సూర్యసిద్ధాంతం 1200 సంవత్సరాల ప్రాచీనమైనది. అట్టి సూర్యసిద్ధాంతంలో

**యుగే సూర్యజ్ఞ శుక్రాణాం ఖచతుష్కర్ దార్ణవః ।**
**కుజార్కి గురు శీఘ్రాణాం భగణాః పూర్వయావినామ్ ॥**

**(సూర్యసిద్ధాంతం. 1-1)**

"అనగా ఒక చతుర్యుగంలో సూర్య బుధ శుక్ర మంగళ, శని బృహస్పతులు (విశ్వకేంద్రం చుట్టూ) 4,32,000 పర్యాయాలు భగణం చేస్తారు. పరిభ్రమిస్తారు. అని వ్రాయబడింది.

కశ్యప సంహిత ననుసరించి సూర్య, పితామహాది; వ్యాస, వసిష్ఠాది 18 మంది జ్యోతిష్యప్రవర్తకులైన ఋషులుండేవారు. పులస్త్య ఋషి

కూడా ఉండేవారని పరాశరఋషి వ్రాసారు. వీటిలో కొన్ని గ్రంథాలు మాత్రమే యిప్పుడు లభిస్తున్నాయి. వీరేకాక ఆర్యభట్టుడు, వరాహమిహిరుడు, భాస్కరాచార్యుడు, బ్రహ్మగుప్తుడు, లల్, ముంజాల్, శ్రీపతి, శతానంద, కమలాకరుడు మొదలైన ఎందరో జ్యోతిష్య విద్వాంసులు ఉండేవారు. వారి గ్రంథాలు కొన్ని యిప్పుడు లభిస్తున్నాయి. ఇవి అన్నీ పరిశోధనా గ్రంథాలే. ఆనాడు ఏఏ దూరదర్శినీ యంత్రాలతో, నక్షత్రశాలలతో ఆ పరిశోధనలు చేసారో తెలియదు. అయినప్పటికి ఆ లెక్కలన్నీ నేటి ఆధునిక ఖగోళ విజ్ఞానానికి చాలా దగ్గరగా ఉన్నాయి.

భారతీయ ఇతిహాసం ఎంత ప్రాచీనమైనదో తెలుపుటకే ఈ లెక్కలన్నీ వ్రాయబడ్డాయి. ఈవిషయం మరింత స్పష్టం కావడానికి ప్రపంచ దేశాల కాలగణను పరిశీలిద్దాం.

| | | |
|---|---|---|
| 1. | నేడు ప్రచలితమైయున్న క్రీస్తు శకం | 2,005 |
| 2. | మూసాయొక్క ధర్మప్రచారం ఆరంభసంవత్సరం | 3,571 |
| 3. | కలిశకం (కలియుగారంభం) | 5,106 |
| 4. | ఇబరానియన్ సంవత్సరం | 6,007 |
| 5. | మిశ్రదేశీయుల రాజ్యస్థాపన సం. | 28,657 |
| 6. | ఫినీషియాలో నివసించిన సం. | 30,036 |
| 7. | ఈరాన్ ప్రథమ రాజు సం. | 1,89,983 |
| 8. | కాల్డియన్. సం. | 4,70,036 |
| 9. | కాల్డియన్ ప్రకారం పృథివి ఉత్పత్తి జరిగి | 2,15,00,036 |
| 10. | ఖతాయి సం. | 8,88,40,376 |
| 11. | చైనా దేశపు ప్రథమ రాజు | 9,60,02,504 |
| 12. | భారతీయ వైవస్వత మన్వంతరం | 12,05,33,105 |

| | |
|---|---|
| 13. భారతీయ సంధిరహిత సృష్టి సం. | 196,08,53,105 |
| 14. భారతీయ సంధిసహిత సృష్టి సం. | 197,29,49,105 |

ఈ పై పట్టికను పరిశీలిస్తే భారతీయుల కాలగణయే అతి ప్రాచీనమైనదని తెలుస్తున్నది. వారి కాలగణనకు ఆధారం విశ్వంలోని నక్షత్రరాశుల, గ్రహాల, పరిభ్రమణం. ఒక చతుర్యుగంలో, మన్వంతరంలో, కల్పంలో ఈ భ్రమణాలు ఎన్నెన్నిసార్లు జరుగుతాయో మన జ్యోతిష్య గ్రంథాలలో వ్రాసి ఉన్నాయి.

ఇక ఆధునికుల సృష్టికాల గణన గురించి పరిశీలిద్దాం. పూర్వం సూర్యతాప ఆధారంగా, భూతాప ఆధారంగా, సముద్రజలాలో ఉప్పదనం యొక్క ఆధారంగా భూమియొక్క వయస్సును కనుగొన యత్నించేవారు. ఇప్పుడు ఈ లెక్కలన్నిటికన్న రేడియో యాక్టివిటీ ఆధారంగా చేసే కాలగణనే సరియైన దంటున్నారు. ఈ భూమిపైన అత్యంత ప్రాచీనమైన ఒకరాతిని పరిశీలించగా అది 3700 మిలియన్ (370 కోట్ల) సంవత్సరాల ప్రాతదని తెలిసింది. మరికొన్ని పరిశోధనలలో సూర్యుడు మరియు నక్షత్రాల వయస్సు 4500 మిలియన్ (450 కోట్ల) సంవత్సరాలుండవచ్చు నంటున్నారు.

పై లెక్కలనుబట్టి భూమిపై శిలలు ఏర్పడి 370 కోట్ల సంవత్సరాలయ్యింది. ఆ తదుపరి వృక్షజాతులు, జల వాయు భూ చరాలు ఏర్పడటానికి సుమారు 123 కోట్ల సంవత్సరాలు పట్టి ఉండవచ్చును. అనంతరం చివరి ప్రాణిజాతిగా మానవసృష్టి జరిగి ఉండవచ్చును. అప్పటినుండి కాలాన్ని గణించగా సంధికాలాలను కూడా కలపుకుంటే 197, 29, 49, 105 సంవత్సరాలు అయివుండవచ్చు.

అయితే ఇంత ప్రాచీనమైన చరిత్ర అంతా ఏమైపోయింది? అంటే

మన్వంతరాల మధ్య జరిగే పాక్షిక ప్రళయాలలో నశించిపోయి ఉంటుంది. ఇంతేగాక, చతుర్యుగాల మధ్యలోకూడా జలప్రళయాలు సంభవించినట్లుగా మన శాస్త్రాలలో కనబడుతుంది. ముఖ్యంగా ఈ చతుర్యుగ ప్రారంభానికి ముందు చాలాపెద్ద జలప్రళయం సంభవించినట్లు మన ఇతిహాస గ్రంథాలైన రామాయణ మహాభారతాలలోను, బ్రాహ్మణ గ్రంథాలలోను, కొన్ని పురాణాలలోను కనబడుతుంది. మిగిలిన ప్రపంచ జాతుల ఇతిహాసాలలో కూడా జలప్రళయ వర్ణనలు కనబడతాయి. అందుచేతనే ఈ 28వ చతుర్యుగానికి పూర్వం జరిగిన చరిత్ర (ఇతిహాసం) మనకు లభించటంలేదు.

యుగాంతర ప్రళయం గురించి మహాభారత వనపర్వం 288వ అధ్యాయం 65 నుండి 82 శ్లోకాలలో ఒక ప్రసంగం వస్తుంది. ఆ ప్రసంగ భావం ఈ విధంగా ఉంది.

యుగాంతర ప్రళయం ఏర్పడినపుడు అనేక సంవత్సరాలు వర్షాలు పడక దుర్బల ప్రాణులన్నీ మరణిస్తాయి. సూర్యతాపం క్రమంగా పెరిగిపోయి భూమిపై ఉన్న జలం అంతా హరించిపోతుంది. అంత, భూమంతా ఎండిపోయి భస్మతుల్యమైపోతుంది. బీటలు బారుతుంది. అప్పుడు సంవర్తనామక వేడిగాడ్పులు వీస్తాయి. అనంతరం క్రమంగా సూర్యతాపంతగ్గి వేడి తగ్గుతుంది. అప్పుడు మేఘాలుఏర్పడి అగాధజలరాశి వర్షించి భూమంతా జలమయం అయిపోతుంది. పర్వతాలుకూడా మునిగిపోతాయి. అనంతరం మేఘాలు క్రమంగా తొలగిపోగా సూర్యతాపంవల్ల క్రమంగా జలం హరిస్తూ పర్వతాలు పీఠభూములు బయటపడతాయి. ఆ విధంగా ముందుగా బయటపడిన భూభాగం జలం నుండి కమలం ఆవిర్భవించినట్లుగా ఉంటుంది. ఆ భూభాగంపై

మరల పరమేశ్వరుడు ప్రాణిసృష్టి చేస్తాడు. అందుచే అంతకుముందరి ఇతిహాసం మనకు లభించదు.

ఈ యుగాంతర ప్రళయాలు ప్రతీ దేవయుగాంతంలో అంటే చతుర్యుగాంతంలో 43 లక్షల సంవత్సరాల కొకసారి జరుగుతాయి. (ఈ కాలాన్ని కొన్ని చోట్ల సహస్రయుగాలని కూడా పేర్కొనటం జరిగింది) ఈ పాక్షిక ప్రళయాలు ఎంతమేరకు జరిగాయో మరల అక్కడ నుండి సృష్టి లేదా ప్రాణిసృష్టి పరమేశ్వరుడు చేస్తాడు. అందుచే ఈ చతుర్యుగానికి ముందు జరిగిన ఇతిహాసం మనకు తెలియుటలేదు.

అయినప్పటికి ప్రతి పునఃసృష్టిలోను సమాధిస్థులైన ఋషుల హృదయాలలో పరమేశ్వరుడు వేదాలను ప్రకాశపరుస్తాడు. దానితో బాటు సృష్టియొక్క కాలగణను, జ్యోతిష్యాన్ని ప్రకాశపరుస్తాడు. అందువల్ల సృష్టికాలగణన మనకు తెలుస్తున్నది.

## ప్రథమ మానవ సృష్టి

పూర్వ ప్రకరణాలలో తెలిసికొన్నట్లుగా ఈ భూమిపై ప్రాణి మనుగడకు అవసరమైన వాతావరణం, నీరు ఏర్పడ్డాయి. తదుపరి వృక్షజాతులు, జల భూ వాయు చరములు ఉద్భవించాయి. డార్విన్ వికాసవాదంవలె కాక ఏ జాతికాజాతి వేరువేరుగా ఉద్భవించాయి. మొదటి జాతియైన వృక్షజాతికూడా అనేక రకాల బీజాలతో ప్రారంభమయ్యింది. పూర్వ ప్రకరణంలో సోమునిద్వారా భూమిపైకి బీజాలు తేబడినట్లుగా చెప్పుకున్నాం. దానితోబాటు మరొక శక్తికూడా బీజాలు రావడానికి కారణమంటుంది మైత్రేయి సంహిత.

ఋక్షా హ వా ఇయమగ్ర ఆసీత్ ।
తేస్యాం దేవా రోహిణ్యాం వీరుధో ౨ రోహయాన్ ।

(మైత్రేయి సంహితా. 1-6-9-2)

సృష్టి ప్రారంభంలో ఈ భూమి బోడిగా (వృక్షాలు లేనిదిగా) ఉండేది. అట్టి భూమిపై రోహిణి వీరుధాలను (వృక్షజాతులను) నాటింది.

అంటే సోముని ద్వారా తీసుకురాబడిన బీజాలను మరొక ప్రాకృతిక శక్తి (రోహిణి) ఈ భూమిపై నాటింది. (ఈ రెండు ప్రాకృతిక శక్తులు ఏవో పరిశోధించవలసి ఉంది) తదనంతరం -

**తత స్తేజోమయం దివ్యం పద్మం సృష్టిం స్వయంభువా ।**
**తస్మాత్ పద్మాత్ సమభవద్ బ్రహ్మా వేదమయో నిధిః ॥**

**(మహాభారతం శాంతిపర్వం 181-15)**

అనంతరం దివ్యమైన ఒక పద్మం సృజింపబడింది. ఆ దివ్య పద్మంనుండి తేజోమయ బ్రహ్మ ఉత్పన్నమయ్యాడు. అతడు జ్ఞానమయుడు.

ఇక్కడ బ్రహ్మ అంటే పురాణవర్ణిత చతుర్ముఖ బ్రహ్మకాదు. ఈ భూమిపై ప్రాణిసృష్టి చేయడానికి పరమేశ్వరునిచే సృజింపబడిన ఒక దివ్య ప్రాకృతిక శక్తి అని అర్థం చేసుకోవాలి. ఈ విషయం తదుపరి శ్లోకాలలో స్పష్టం చేయబడింది. ఇక్కడ పద్మం అంటే జలంనుండి ముందుగా బయటకు వచ్చిన భూభాగం. ఈ విషయం వాల్మీకి రామాయణంలో మరికొంత వివరింపబడింది.

**తతః సమభవద్ బ్రహ్మా స్వయంభూర్దైవతైః సహ ।**
**స వరాహస్తతో భూత్వా ప్రోజ్జహార వసుంధరామ్ ।**
**అసృజచ్చ జగత్ సర్వం సహ పుత్రైః కృతాత్మభిః ।**

**(వా.రా. అయోధ్యా. 110-3,4)**

ప్రాణిసృష్టికన్న ముందు ఈ భూమంతా జలమయమై యుండేది. ఆ జలం నుండి పృథివి నిర్మింపబడింది. అప్పుడు దేవతలతోబాటు బ్రహ్మ ఉత్పన్నమయ్యాడు. అనంతరం వరాహం జలంనుండి పృథివిని

బయటకు తీసింది. అప్పుడు బ్రహ్మ తన కృతాత్మపుత్రులతో ఈ సృష్టిని చేసాడు.

వాల్మీకి రామాయణంలోని ఈ రెండు శ్లోకాలలో ప్రారంభం నుండి మానవసృష్టి వరకుగల సృష్టిక్రమం సంక్షిప్తంగా చెప్పబడింది.

లోకంలో వరాహావతారానికి సంబంధించిన ఒక పౌరాణిక కథ ప్రచారంలో ఉంది. హిరణ్యకశిపు డను పేరుగల ఒక రాక్షసుడు భూమిని చాపచుట్టగా చుట్టి సముద్రంలో (జలంలో) పడవేసెనట. అప్పుడు నారాయణుడు వరహావతారమెత్తి మునిగిపోతున్న భూమిని పైకెత్తి తన కోరలపై నిలిపెనట. దీని వెనుక ఏదైనా చిన్న ఆధ్యాత్మికార్థం ఉందేమో కాని ఈ కథ ప్రజలను భ్రమలో పడవేసింది. వరాహమంటే సూకరం (పంది) అని లోకు లనుకుంటారు. కాని యిది సత్యంకాదు. యాస్కమహర్షి తన నిరుక్త శాస్త్రంలో వరాహ పదాన్ని నిర్వచిస్తూ.

**వరాహో మేఘో భవతి । వరాహారః ।**
**వరమాహార మాహార్షిరితి చ బ్రాహ్మణమ్ ।**

**(నిరుక్తము. 5-4)**

వరాహ మంటే మేఘం అని అర్థం. జలాన్ని ఆహారంగా తీసు కుంటుంది కనుక మేఘానికి వరాహ మని పేరొచ్చింది.

విపరీతమైన వర్షాలవల్ల భూమి పూర్తిగా జలమగ్నమై పోతుంది. అప్పుడు మరల సూర్యుడు తన తాపంతో నీటిని ఆవిరిగా మారుస్తాడు. ఆ నీటి యావిరిని మేఘాలు ఆహారంగా స్వీకరిస్తాయి. ఈ విధంగా భూమి జలం నుండి బయటకు వచ్చినట్లు గ్రహించాలి.

పై విధంగా జలంనుండి ముందుగా బయటకు వచ్చిన భూభాగం హిమాలయ పర్వతం మరియు దాని పరిసర త్రివిష్టప పీఠభూమి. దానినే

మనం యిప్పుడు టిబెట్ అంటున్నాం. అది అప్పుడు జలంలో కమలం వలె ఉండేది. ఆ పద్మంలో పరమేశ్వరుని బ్రాహ్మీశక్తి (సృజనశక్తి) ఆవిర్భవించింది. అప్పుడు బృహదాకారంగల అండం లేదా అనేక చిన్న చిన్న అండాలు ఉద్భవించాయి. ఇవి అన్నీ పాంచభౌతికాలు. అంటే పంచభూతాలతో నిర్మింపబడ్డాయి. దీనినే (లేదా వీటినే) శాస్త్రాలలో విరాట్ పురుషుడని వర్ణింపబడింది.

ఈ అండాలు పక్వమైన తరువాత అనేక స్త్రీ పురుష శరీరాలు యువావస్థలో బయటకు వచ్చాయి. (గ్రుడ్డు నుండి కోడిపిల్లలు వచ్చినట్లు). వారి వారి పూర్వజన్మ కర్మఫలాల ననుసరించి వారికి ఆ యా శరీరాలు నిర్మించబడ్డాయి. వారినుండి మైథున సృష్టి వికసించింది.

సృష్ట్యాదిలో ఆవిర్భవించిన బ్రహ్మీశక్తి (సృజనశక్తి) ముందుగా తమ, మోహ, మహామోహ, తామిస్ర, అంధతామిస్ర ప్రాణిజాతుల నుత్పన్నం చేసింది. అంటే నిమ్నయోనులైన పశుపక్షి క్రిమికీటకాదుల నుత్పన్నం చేసింది. ఇచట తమము అంటే అవిద్య. మోహం అంటే అర్థచేతన. రాగాన్ని మహామోహమని, ద్వేషాన్ని తామిస్రమని, అత్యంత ఆసక్తిని అంధతామిస్రమని అంటారు. పూర్వజన్మలో అటువంటి ప్రవృత్తిగల జీవులకు ఆ యా నిమ్న యోనులు లభిస్తాయి.

పురాణాల కథనం ప్రకారం బ్రహ్మ మానవేతర ప్రాణుల సృష్టివల్ల సంతృప్తి చెందక మరల పూర్ణప్రయత్నంతో నలుగురు మానవులను సృజించాడు. వారే సనక, సనంద, సనాతన, సనత్కుమారులు. ఈ నలుగురు నివృత్తి పరాయణులు. ఊర్ధ్వరేతస్కులు. మునిపుంగవులు. ఈ నలుగురు సృష్టి సాధకులు కావడానికి నిరాకరించారు. బ్రహ్మచర్యాన్ని పాటిస్తూ యోగసాధనా తత్పరులయ్యారు. అప్పుడు బ్రహ్మ మరొక పది

మంది మానవుల నుత్పన్నం చేసాడు. వారిపేర్లు - మరీచి, అత్రి, అంగిరా, పులస్త్య, పులహ, ఋతు, భృగు, వసిష్ఠ, దక్ష మరియు నారదులు. ఈ విషయం మహాభారతంలోకూడా ఉంది. వీరిలో 6 మంది ఋషులు బ్రహ్మ యొక్క మానసపుత్రు లనియు, వీరు నివృత్తిమార్గాన్ని అనుసరించా రనియు వ్రాసి ఉంది.

**బ్రహ్మణో మానసాః పుత్రా విదితాం షణ్మహర్షయః ।**
**మరీచి రత్ర్యంగిరసో పులస్త్యః పులహః క్రతుః ॥**

**(మహాభారతం ఆదిపర్వం. 65-10)**

బ్రహ్మయొక్క ఆ పదిమంది పుత్రులలో మరీచి, అత్రి, అంగిర, పులస్త్య, పులహ, క్రతు అను ఆరుగురు మహర్షులయ్యారు.

మిగిలిన భృగు, వసిష్ఠ, దక్ష, నారదులు నలుగురు విద్వాంసు లయ్యేరేకాని ఋషులు కాలేకపోయారు. ఋషులంటే చదువుకున్న వేదాన్ని మననం చేస్తూ సమాధిలోనికి వెళ్ళి పరమేశ్వరుని ద్వారా సరియైన అర్థాన్ని గ్రహించి ఆ జ్ఞానాన్ని సామాన్య మానవులకు వివరించి చెప్పేవారు.

బ్రహ్మ అమైథున సృష్టిద్వారా పురుషులనే కాక కొందరు కన్యలనుకూడా ఉత్పన్నం చేసాడు. అందులో ఒకరు శతరూపా. ఆ శతరూపా స్త్రీకి ఆకూతి, దేవహూతి, ప్రసూతి అనే ముగ్గురు కన్యలు జన్మించారు. అందు ప్రసూతి వివాహం దక్షప్రజాపతితో జరిగింది. ఆ దంపతులకు అదితి మొదలైన పేర్లుగల పదముగ్గురు కన్యలు జన్మించారు. విచిత్రమేమంటే ఈ అందరి కన్యల వివాహము మరీచి పుత్రుడైన కశ్యపునితో జరిగింది. వీరివల్ల చాలా సంతానం కలిగినట్లుగా మహాభారతంలోను, పురాణాలలోను కనబడుతుంది.

ఈ పైన పేర్కొన్న పేర్లన్నీ వేదాలలో కనబడతాయి. అట్లని

వేదాలలో చరిత్ర ఉందనటానికి వీలు లేదు. ఎందుకంటే, వేదాలు సృష్టికి ఆరంభంలోనే ఉపదేశించబడ్డాయి. కనుక అందు చరిత్ర లేదు. అక్కడ ఆ పదాలకు యౌగికార్థం ఉంటుంది. ఆ యా ప్రకరణాలని బట్టి ఆ యా పేర్లు కొన్ని ప్రాకృతిక శక్తులకు వర్తిస్తాయి. ఆ నాటి తొలిమానవులు వేదాలలో ఉన్న పేర్లనే తమ సంతానానికి పెట్టుకున్నారు. ఇంతేగాక ప్రపంచంలోని పదార్థాల పేర్లన్నీ వేదాలలోని నామములేనని మను మహర్షి అంటారు.

**సర్వేషాం తు స నామాని కర్మాణి చ పృథక్ పృథక్ ।**
**వేదశబ్దేభ్య ఏవాదౌ పృథక్ సంస్థాశ్చ నిర్మమే ॥**

**(విశుద్ధ మనుస్మృతి. 1-13)**

దక్షప్రజాపతి కుమార్తె అయిన అదితికి కశ్యపునివల్ల పన్నెండు మంది పుత్రులు పుట్టారు. అదితికి పుట్టుటవల్ల వీరిని ఆదిత్యులన్నారు. వారి అసలు పేర్లు-ధాతా, మిత్ర, అర్యమా, ఇంద్ర, వరుణ, అంశ, భగ వివస్వాన్, పూషా, సవితా, త్వష్టా, విష్ణు. విచిత్రమేమంటే ఈ పేర్లన్నీ సూర్యునికి వర్తిస్తాయి. అట్లని ఆకాశంలోని సూర్యుడు అదితి కశ్యపుల కుమారుడనటానికి వీలులేదు. సూర్యుడు లేనిది ప్రాణిసృష్టి ఎలా జరుగుతుంది? కనుక దక్షప్రజాపతియొక్క కుమార్తె అయిన అదితి తన కుమారులకు వేదాలలోని సూర్యుని నామములతో నామకరణం చేసియుండవచ్చును.

దక్షుని రెండవ కుమార్తె పేరు దితి. ఆ దితికి కశ్యపుని వలన ఒకే పుత్రుడు కలిగాడని మహాభారత ఆదిపర్వం (65-17)లో ఉంది. అతని పేరు హిరణ్యకశిపుడు. కాని, కొన్ని పురాణాలలో దితికి యిద్దరు పుత్రులని, రెండవ పుత్రుని పేరు హిరణ్యాక్షుడని వ్రాసిఉంది.

దితి యొక్క ఈ యిద్దరు పుత్రులు క్రూరులు, దురాచారులు అయ్యారు. దితికి పుట్టటం వల్ల వారిద్దరిని దైత్యు లన్నారు. కాలాంతరంలో దైత్య పదం క్రూరులకు, దురాచారులకు రూఢిగా వాడటం జరిగింది.

ఈ పై ఇతిహాసం ముఖ్యంగా రామాయణ, మహాభారతాల ఆధారంగా వ్రాయబడింది. పురాణాలనుండి కొన్ని గ్రహించబడ్డాయి. ఈ గ్రంథాలలో యితిహాసంతోబాటు ధార్మిక విషయాలు ఉపదేశించ బడ్డాయి. మహాభారత కర్తయైన మహర్షి వేదవ్యాసులవారు ఆదిపర్వంలోనే తన అభిప్రాయం తెలియపరచారు.

**అస్మిన్ అర్థశ్చ ధర్మశ్చ నిఖిలేనోపదిశ్యతే ।**
**ఇతిహాసే మహాపుణ్యే బుద్ధిశ్చ పరినైష్ఠకీ ॥**

**(మహా భా. ఆది. 62-17)**

ఈ మహాభారత గ్రంథంలో ధర్మం గురించి, అర్థం గురించి పూర్ణంగా ఉపదేశింపబడింది. ఇది ముఖ్యంగా ఇతిహాస గ్రంథం. ఇతిహాసంతో బాటు మోక్షసాధనకు అవసరమైన బుద్ధి (జ్ఞానం) కూడా ఉపదేశించబడింది. విద్వాంసులు వీటిని వేరువేరుగా తెలిసికొనగలరు.

అయితే, కాలాంతరంలో మహాభారతంలో అనేక మార్పులు, చేర్పులు చేయబడ్డాయి. వ్యాసమహర్షి నాలుగు వేదాలతో బాటు 24,000 శ్లోకాలుగల మహాభారతాన్ని సుమంతు, జైమిని పైలి శుక వైశంపాయను లను ఐదురుగు శిష్యులకు బోధించారు. వారయిదుగురు వేరువేరుగా ఐదు భారత సంహితలు వ్రాసారట. కాని, నాలుగు సంహితలు కాలగర్భంలో లుప్తంకాగా కేవలం వైశంపాయనులవారి రచనే మిగిలింది. వైశంపాయనులవారి శిష్యులైన సౌతి ఒక కథకుడు. అందుచే ఆయన వ్యాసభారతంలో అనేక ఉపాఖ్యానాలను, శిష్యుల సందేహాలకు సమాధానాలను జోడించి లక్ష శ్లోకాలు గలదిగా చేశాడు. ఆ లక్ష శ్లోకాలలో కూడా అనేక మార్పులు, చేర్పులు జరిగాయి. కొందరు సాంప్రదాయకులు వారికి అనుకూలించనివాటిని తొలగించి, వారిని బలపరచేటట్లుగా వ్రాసి చేర్చారు. తెలుగున అనువదించిన నన్నయ్య కాలంనాటికి

అది 1,00,500 శ్లోకాలు కాగా, ప్రస్తుత కలకత్తా ముద్రణలో 85,000, దక్షిణాదినగల కుంభకోణ ముద్రితములో 96,000 శ్లోకాలు ఉన్నాయి. ఇటీవల గీతాప్రెస్ (గోరఖ్‌పూర్) వారు ఉత్తర భారతీయపాఠం - 86,000 శ్లోకాలు, దక్షిణాత్యపాఠం 6,584, ఉవాచలు 7,032 అన్నీ కలిపి 1,00,216 శ్లోకాలుగా ప్రచురించారు. కనుక, మహాభారతం లోని ఇతిహాస భాగాలనుకూడా వివేచించి అర్థం చేసుకోవలసి ఉంది.

## కశ్యప వంశావళి

పూర్వ ప్రకరణంలో తెలిసికొన్నట్లుగా ప్రథమ మానవులు అయోనిజులు. బ్రహ్మపుత్రులు మొత్తం పదిమంది. వారిలో ఆరుగురు ఋషులు. వీరిలో దక్షుడు ఒకరు. వీరేగాక మరికొందరు స్త్రీ పురుషులు అయోనిజులుగా జన్మించారు. దక్షప్రజాపతి యొక్క వివాహం ప్రసూతితో జరిగింది. వీరిద్దరు చాలా మంది కన్యలకు జన్మనిచ్చారు. ఈ కన్యలు దాదాపు యాభైమందివరకు లెక్కించబడ్డారు. అట్టి కన్యల నుండి పదముగ్గురు కన్యలను మరీచి పుత్రుడైన కశ్యపుడు వివాహం చేసుకున్నాడు.

పై విధంగా మహాభారతంలో ఉంది. ఇందు ఎంతవరకు సత్యమో, ఎంత కల్పితమో తెలియదు. కశ్యపుడు ఆ 13 మంది భార్యలలో నలుగురు నుండి సంతానం బడసినట్లుగా చెప్పబడింది.

ఇది కాదనలేము. ఆనాడు మానవుల సంఖ్య చాలా తక్కువ. అందునా పురుషుల సంఖ్య తక్కువ, స్త్రీల సంఖ్య ఎక్కువ అయి ఉండవచ్చును. అట్టి పరిస్థితులలో పురుషులు ఎక్కువమంది స్త్రీలను వివాహమాడి ఎక్కువమంది సంతానాన్ని ఉత్పన్నం చేసి ఉండవచ్చు. ఆనాటి మానవులకు అట్టి సామర్థ్యం ఉండి ఉండవచ్చు.

వేదం కూడా అవసరాన్ని బట్టి స్త్రీ పదిమందివరకు సంతానాన్ని ఉత్పన్నం చెయ్యవచ్చునని చెబుతుంది.

ఇమాం త్వ మింద్ర మీఢ్వః సుపుత్రాం సుభగాం కృణు ।
దశాస్యాం పుత్రనా ధేహి పతిమేకాదశం కృధి ॥

(ఋగ్వేదం. 10-85-45)

మహాభారతం ప్రకారం ఆ కశ్యపవంశావళి ఈ విధంగాఉంది.

1. కశ్యపునికి అదితివలన 12 మంది పుత్రులుపుట్టారు. వారు వరుసగా

1. ధాతా, 2. మిత్ర 3. అర్యమా, 4. ఇన్ద్ర 5. వరుణ, 6. అంశ, 7. భగ, 8. వివస్వాన్ 9. పూషా 10. సవితా 11. త్వష్టా, 12. విష్ణు.

2. కశ్యపునకు దితివలన

1. హిరణ్యకశిపుడు, 2. హిరణ్యాక్షుడు (పురాణాలలో)

## కశ్యప + దితిల సంతానం

హిరణ్యకశిపుడు




## కశ్యప + దనుల సంతానం

వీరు మొత్తం 34 మంది. వీరిలో ముఖ్యులు - విప్రచిత్. సూర్య, చంద్రులు.

ఇచట గమనించవలసింది - ఒక స్త్రీకి 34 మంది సంతానం

కలుగుతారా? అనేది ఒక ప్రశ్న. లేక ఇవి ప్రాకృతిక శక్తులా ? ఆలోచించవలసిన విషయం. ఈ పుత్రులలో సూర్య చంద్రులు ఆకాశంలో కనబడే దేవతలు కాదు. వేదాలలోని పేర్లను లేదా ప్రాకృతిక దేవతల పేర్లను కశ్యప దనులు తమ సంతానానికి పెట్టుకుని వుండవచ్చును.




నలుగురు పుత్రులు. వీరిలో త్వష్టాధర, అత్రి ముఖ్యులు.

ఈ విధంగా కశ్యపునకు మిగిలిన భార్యలవల్ల చాలా సంతానమే కలిగింది. స్థలాభావంవల్ల చరిత్రలో ముఖ్యంగా కనబడుచున్న వారి పేర్లు మాత్రమే వ్రాయటం జరిగింది.

ఈ చతుర్యుగంలో మొదటిదైన సత్యయుగం చివరినాటికి వీరి వంశవృక్షం భూమండలమంతా వ్యాపించింది.

సత్యయుగం గడిచి త్రేతాయుగం ప్రవేశించిన కొద్ది కాలానికే ప్రకృతి ఉపద్రవం ఒకటి జరిగింది. సునామి తుఫాను ఉప్పెనలవంటివి ఏవో వచ్చి సముద్రం అల్లకల్లోలం కావటం వల్ల చిన్న జల ప్రళయం వచ్చింది. అప్పుడు ఎత్తైన పర్వతాలు, పీఠభూములు తప్ప మిగిలిన భూభాగమంతా నీటిలో మునిగిపోయింది. అపార ప్రాణనష్టం జరిగింది. అప్పుడు మహర్షి మనువు, కొందరు ఋషులు, కొందరు మానవులు, కొన్ని ప్రాణిజాతులు మాత్రమే మిగిలాయి. అనంతరం ఆ మిగిలిన ఋషులు వారికి జ్ఞాపకమున్న విషయాలను బ్రాహ్మణ ఆరణ్యక పురాణాలలో వ్రాసిపెట్టారు. అందుచే సత్యయుగానికి చెందిన ఎక్కువ

వివరాలు తెలియవు.

తెలిసిన కొన్ని వివరాల ప్రకారం - సత్యయుగ ప్రారంభంలో ఋషులు, మునులు, ధర్మాత్ములు ఎక్కువగా ఉండటం వల్ల సామాన్య ప్రజలు కూడా వారి ననుసరించేవారు. రాజ్యవ్యవస్థ, ధర్మశాస్త్రాల ఆవశ్యకత కూడా ఉండేదికాదు. మనుష్యులు ఏ యుగానికి చెందినవారైనా వివిధ మనస్తత్వాలు కలిగి ఉంటారు. ఇందుకు వారి పూర్వజన్మ సంస్కారాలు కారణం. అందుచే కాలాంతరంలో స్వార్థం, సోమరితనం, ఇంద్రియలోలత, రాగద్వేషాలు పెరిగాయి. ఆర్థిక అసమానత్వం, అధికార దాహం కూడా పెరిగాయి. జనాభా పెరిగింది. భూమికోసం, ఆహారంకోసం పోరాటాలు ప్రారంభమయ్యాయి. బుద్ధిమంతులు పరిశ్రమించి సుఖసాధనాలను సమకూర్చుకుంటే - సోమరులు వాటిని చూసి సహించలేక దోచుకోవడం ప్రారంభించారు. అప్పుడు ఋషులు, ధర్మాత్ములు, మేధావులు, రాగమోహరహితులైన దివ్యగుణములుగల దేవతలు నాటి సమస్యలకు పరిష్కారం కనుగొనాలని ఒక పెద్ద సభను ఏర్పాటు చేసారు. ఆ బృహత్ సభకు బ్రహ్మను అధ్యక్షునిగా చేసారు. అధ్యక్షునకు ఆ నాటి సమస్యలను వివరించి చెప్పారు.

బ్రహ్మ సావధానంగా అందరి అభిప్రాయాలను విని, దీర్ఘంగా ఆలోచించి ఈ విధంగా సమాధాన పరచాడు.

తానువాచ సురాన్ సర్వాన్ స్వయమ్భూర్భగవాంస్తతః ।
శ్రేయో ఽ హం చిన్తయిష్యామి వ్యాతు వోభీః సురర్షభాః ॥
తతో ఽ ధ్యాయ సహస్రాణాం శతం చక్రే స్వబుద్ధిజమ్ ।
యత్ర ధర్మస్తథైవార్థః కామశ్చైవాభివర్ణితః ॥
త్రివర్గ ఇతి విఖ్యాతో గణ ఏష స్వయం భువా ।

చతుర్థో మోక్ష ఇత్యేవ పృథగర్థః పృథగ్గుణః ॥

(మహాభారతం శాంతి. 52-28, 29, 30)

ఆ సమ్మేళనములో దేవతల అభిప్రాయాలన్నిటిని విన్న బ్రహ్మ "ఓ సురలారా! (దేవతలారా!) మీరు భయాన్ని వీడండి. నేను మీకు మేలుజరుగు మంచి మార్గాన్ని గురించి ఆలోచిస్తాను" అని చెప్పి పంపించెను. అనంతరం బ్రహ్మ ఒక లక్ష శ్లోకాలు గల ఒక నీతి శాస్త్రాన్ని రచించాడు. ఆ శాస్త్రంలో ధర్మ అర్థ కామాలను గురించి విస్తృత వర్ణన ఉంది. ఆ నీతి శాస్త్రం పేరు త్రివర్గము. నాల్గవ వర్గంగా మోక్షాన్ని గురించి వివరించి వ్రాసి వేరుగా ఉంచాడు. వాటి గుణాలు కూడా వేరే.

త్రివర్గ గ్రంథంలో సకల నీతులు, రాజ్యవ్యవస్థకూడా వివరింపబడ్డాయి. దేవతలు ఈ నీతి శాస్త్రాన్ననుసరించి రాజ్య వ్యవస్థచేసి నడపగల సమర్థుడైన రాజుకోసం వెతకసాగారు. ఆ కాలంలో విరజా అనే పేరుగల గొప్ప ధర్మాత్ముడుండేవాడు. దేవతలు ఆతని వద్దకు వెళ్ళి రాజపదవిని స్వీకరించమని ప్రార్థించారు. అందుకు విరజుడు అంగీకరించలేదు. పిమ్మట విరజుని పుత్రుడైన కీర్తిమాన్ అనే వ్యక్తిని అర్థించారు. అతనుకూడా రాజు కావడానికి అంగీకరించలేదు. కీర్తిమాన్ యొక్క కుమారుడైన కర్దముని కోరగా అతడును నిరాకరించాడు. చివరకు కర్దముని కుమారుడైన అనంగుడు రాజపదవిని స్వీకరించడానికి అంగీకరించాడు. అనంగుని గురించి మహాభారతం ఈ విధంగా చెబుతుంది.

ప్రజాపతేః కర్దమస్య త్వనంగో నామ వై సుతః ।
ప్రజా రక్షయితా సాధుర్దణ్డనీతి విశారదః ॥

(మ. భా. శాంతి 59-91)

కర్దమ ప్రజాపతికి అనంగు డనే పేరుగల కుమారు డుండెను. అతడు ప్రజలను రక్షించ సమర్థుడు. మరియు దండనీతి విశారదుడు. ఇంతేగాక గొప్ప ధర్మాత్ముడు.

అట్టి అనంగుడు ఈ 28వ కలియుగంలోని మొదటిరాజు అని చెప్పవచ్చును. అతని అనంతరం అతని పుత్రుడు అతిబలుడు రాజయ్యాడు. అతడు పరాక్రమవంతుడేకాని యింద్రియలోలుడు. ఈతని ధర్మపత్ని సునీతా. వీరిద్దరికి వేనుడు పుట్టాడు. ఈ వేనుడు దుష్టుడు. రాగద్వేషాలతో ప్రజలను పీడించేవాడు. అందుచే ఋషులు వేనున్ని తొలగించి అతని కుమారుడు పృథుని రాజుని చేసారు. అతడు ధర్మాత్ముడు. దుష్టశిక్షణ శిష్టరక్షణ చేస్తూ ప్రజలందరిని సమభావంతో చూసేవాడు. విద్వాంసులను, ధర్మాత్ములను ఆదరించేవాడు.

మహారాజు పృథు సమాజ ఉన్నతికి చాలా కృషి చేసాడు. వర్ణాశ్రమ ధర్మాలను స్థాపించి అనుష్ఠింపచేసాడు. అతని పాలనను గురించి వాయుపురాణం ఈ విధంగా కీర్తిస్తుంది.

**చాక్షుషస్యాన్తరేతీతి ప్రాప్తే వైవస్వతే పునః ।**
**వైన్యానేయం మహీ యథాతే కీర్తితం మయా ॥**

**(వాయుపురాణం. 63-19)**

చాక్షుష మన్వంతరానంతరం అంటే వైవస్వత మన్వంతరంలో వేనుని పుత్రుడైన పృథు చక్రవర్తి భూమినుండి దుగ్ధధారలను పిండి కీర్తిమంతు డయ్యాడు.

అంటే, పృథుచక్రవర్తి వ్యవసాయాన్ని అభివృద్ధిపరచి గోవునుండి పాలు పిండునట్లుగా భూమినుండి అనేకరకాల పంటలను పుష్కలంగా పండించి ప్రజలకు మేలుచేసాడు. 28వ సత్యయుగంలో గొప్ప కీర్తిని పొందాడు. పృథు తదుపరి అతని వంశావళి చాలాకాలం రాజ్యాన్ని

పాలించింది.

సత్యయుగంలోని మానవులు దీర్ఘజీవులుగా ఉండేవారు. అనేక మంది సంతానాన్ని ఉత్పన్నం చేసేవారు. ఆ విధంగా మానవజాతి విస్తరించింది. అప్పుడు దేవాసుర సంగ్రామాలు జరుగుతూ ఉండేవి. దేవత లంటే ధర్మమార్గాన్ని అనుసరించి విద్యా విజ్ఞానాలను, కళా కౌశలాలను పొంది సుఖించేవారు అని అర్థం. వీరు పంచ మహాయజ్ఞాలను, విశేషయజ్ఞాలను చేస్తూ ప్రజలకు మేలుచేస్తూ ఉండేవారు. అసురులంటే ప్రాణపోషకులు. ఇంద్రియలోలురై మద్యమాంసాలను సేవిస్తూ స్వార్థం కోసమే జీవించేవారు. ఇట్టి దేవాసురులు అప్పుడూ ఉన్నారు. ఇప్పుడూ ఉన్నారు. అప్పుడు దేవాసురసంగ్రామాలు యుద్ధాలుగా జరిగేవి. ఇప్పుడు దేవాసురసంగ్రామాలు న్యాయాలయాలలో (కోర్టులలో) జరుగుతున్నాయి. అప్పుడు దేవతలు ఒకసారి రాక్షసులు ఒకసారి గెలిచినట్లే యిప్పుడు న్యాయం ఒకసారి అన్యాయం ఒకసారి గెలుస్తున్నవి.

అయితే విశేషమేమంటే - ఆనాడు వేదాల కనుకూలంగాను ఋషిమునుల ఉపదేశాల కనుగుణంగాను ధార్మిక జీవనం గడిపేవారిని దేవత లనేవారు. దానికి భిన్నంగా వేదవిరుద్ధంగాను, ఋషిమునుల ఉపదేశాలను తిరస్కరిస్తూను స్వేచ్ఛగా జీవించేవారిని అసురులనేవారు.

సత్యయుగం (కృతయుగం) అన్ని యుగాలకన్న పెద్దది. 17,28,000 సంవత్సరాల పరిమాణం గలది. అయినప్పటికి మనకు తెలిసిన యితిహాసం చాలా స్వల్పం. దానికి కారణం ముందు చెప్పుకొన్నట్లుగా భయంకరమైన ప్రకృతి ఉపద్రవం. అప్పుడు మృత్యువాత నుండి తప్పించుకున్న ఋషులు వారికి జ్ఞాపకమున్నది స్వల్పంగా వారి గ్రంథాలలో వ్రాసి పెట్టారు. వాటి సంక్షిప్తరూపమే మనం యింతవరకు తెలుసుకున్న చరిత్ర (ఇతిహాసం).

# త్రేతాయుగం - జలప్లావనం

త్రేతాయుగ ప్రారంభంలో ముందు చెప్పుకొన్నట్లుగా ఒక జలప్లావనం జరిగింది. దానిని గురించి మహాభారతంలో ఒక ప్రసంగం కనబడుతుంది.

**ఆదిత్యే సవితుర్ జేష్ఠ వివస్వాన్జగృహే తతః ॥**
**త్రైతాయుగాద్ చ పునరిర్వస్వాన్మనవే దదౌ ।**
**మనుశ్చ లోక భూత్యర్థం సుతాయేక్ష్వాకవై దదౌ॥**
**మహాభారతం (పూనాసంస్కరణం) శాం. 336-46, 47**

(అదితికుమారులైన) ఆదిత్యవంశంలో వివస్వాన్ రాజ పరివారంలో త్రేతాయుగ ప్రారంభంలో వివస్వాన్‌మనువు ఉత్పన్న మయ్యాడు. (జలప్లావనానంతరం) అతడు ఈ భూమిపై మరల మానవ సమాజాన్ని ఉత్పన్నంచేసాడు. ప్రసిద్ధుడైన ఇక్ష్వాకుమహారాజునకు జన్మనిచ్చాడు.

ఈ శ్లోకాలనుబట్టి మనకు అర్థమయ్యింది ఏమంటే - ఆ జలప్లావనంలో మనువు బ్రతికి బయటపడ్డాడు. అతడే త్రేతాయుగంలో మరల మానవ సమాజాన్ని పునర్నిర్మించాడు. ఈ త్రేతాయుగ జలప్లావన వృత్తాంతం మహాభారత వనపర్వంలో విస్తారంగా ఉంది. అందలి కొన్ని శ్లోకాలను పరిశీలిద్దాం.

**వివస్వతః సుతో రాజన్ మహర్షి సుప్రతాపవాన్**
**బభూవ నరశార్దూల ప్రజాపతి సమద్యుతిః ॥(2)**
**ఓజసా తేజసా లక్ష్మ్యా తపసా చ విశేషతః ।**
**అతి చక్రామ పితరం మనుః స్వయం చ పితామహమ్ ॥ (3)**
**తం కదాచిత్ తపస్యన్తమార్ద్రచీరజటాధారమ్ ।**

చీరిణీతీరమాగమ్య మత్స్యో వచన మబ్రవీత్ ॥ (6)
భగవాన్ హి కృతా రక్షా త్వయా సర్వా విశేషతః ।
ప్రాప్తకాలం తు యత్ కార్యం త్వయా తచ్ఛ్రుయతాం మమ ॥ (27)
అచిరాద్ భగవాన్ భౌమమిదం స్థావరజంగమమ్ ।
సర్వమేవ మహాభాగ ప్రలయం వై గమిష్యత ॥ (28)
సంప్రక్షాలనకాలో ౭యం లోకానాం సముపస్థితః ।
తస్మాత్ త్వాం బోధయామ్యద్య యత్ తే హితమనుత్తమమ్॥29)
నౌశ్చ కారయితవ్యా తే దృఢా యుక్తవటారకా ।
తత్ర సప్తర్షిభిః సార్ధమారుహేథా మహామునే ॥ (31)
బీజాని చైవ సర్వాణి యథోక్తాని ద్విజైః పురా ।
తస్యామారోహయేర్నావి సుసంగుప్తాని భాగశః ॥ (32)
బీజాన్యాదాయ సర్వాణి సాగరం పుప్లువే తదా ।
నౌకయా శుభయా వీర మహోర్మిణమరిందమ ॥ (37)
నృత్యమానమివోర్మీభిర్గర్జమానమివామ్భసా ।
క్షోభ్యమాణా మహావాతైః సా నౌస్తస్మిన్ మహోదధౌ ॥ (43)
సర్వమామ్భసమేవాసీత్ ఖం దౌశ్చ నరపుంగవ ।
ఏవం భూతే తదా లోకే సంకులే భరతర్షభ ॥ (45)
అదృశ్యన్తర్షయః సప్త మనుర్మత్స్యస్తథైవ చ ।
ఏవం బహూన్ వర్షగణాంస్తాం నావం సో౭థ మత్స్యకః ॥ (46)
చకర్షతి దిద్రితో రాజంస్తస్మిన్ సలిలసంచయే ।
తతో హిమవతః శృంగం యత్ పరం భరతర్షభ ॥ (47)
(మహాభారతం వనపర్వం అ. 187 లోనివి)

వివస్వాన్‌నకు (అతని వంశంలో) ఒక మహా ప్రతాపియైన పుత్రుడు పుట్టెను. అతడు ప్రజాపతివంటి కాంతిమంతుడు మరియు ఒక

గొప్ప ఋషి. అతడు ఓజ తప కాంతులలో తన పూర్వజులకన్న మిన్న. అతనిపేరు మనువు. ఒక రోజు ఆ మనువు తడి వస్త్రములు ధరించి జటాధారియై చీరిణీనది ఒడ్డున తపస్సు చేయుచుండెను. అంత అతనివద్దకు ఒక మత్స్యుడు (బహుశః నావలు నిర్మించువాడు కావచ్చును) వచ్చి ఈ విధంగా విన్నవించుకొనెను.

హే భగవన్ ! (మహాశయా!) పూర్వం మీరు నాకు ఒక గొప్ప ఉపకారం చేసారు. అందుచే నాకు తెలిసిన ఒక గొప్ప రహస్యాన్ని మీకు చెప్పదలంచితిని. అది ఏమంటే–త్వరలోనే ఒక గొప్ప ఉపద్రవం రానున్నది. భూమిపై నున్న ఈ సంపూర్ణ చరాచర జగత్తంతా నష్టం కాబోతున్నది. అంతా జలంతో ప్రక్షాళనం కానున్నది. అందుచే మీ క్షేమం కోరి మిమ్ములను జాగరూకుల చేయుటకే ఈ హిత వచనాలను చెప్పుచున్నాను.

"మీరు ఎటువంటి ఉప్పెనల కైనను తట్టుకొనగల సుదృఢమైన ఒక నావను నిర్మింపజేయండి. అట్టి నావపై మీరును, సప్త ఋషులును అధిరోహించండి. విద్వాంసుల సలహా తీసుకొని అన్ని జీవజాతుల బీజాలను సేకరించి ఆ నావలో భద్రపరచండి." అని విన్నవించెను.

మనువు అతని మాటలను ఆప్తవచనాలుగా భావించి అట్లే సుదృఢమైన నావను నిర్మింపచేసాడు. సప్త ఋషులను, అన్నిరకాల బీజాలను ఆ నావపైకి ఎక్కించి తానుకూడా ఆ నావను అధిరోహించాడు. మత్స్యుడు చెప్పినట్లే పెద్ద ఉప్పెన వచ్చింది. ఉత్తుంగ తరంగాలతో కూడిన ఆ మహాసాగరంలో నావపై మనువు తన పరివారంతో తేలియాడాడు. మత్స్యుడు అత్యంత నేర్పుతో ఆ నావను నడుపుతూ సురక్షితంగా ఎత్తైన ప్రాంతాలవైపు నావను చేర్చ ప్రయత్నించాడు. ఆకాశ పాతాళములు ఏకమైపోయినట్లుగా సముద్రం ఉప్పొంగింది. అప్పుడు ఆ నావలో ఉన్న

మనువు, సప్తఋషులు మరియు ఆ నౌకలో నున్నవారు మాత్రమే బ్రతికి బయటపడ్డారు. చాలాకాలం తరువాత ఉప్పెన క్రమంగా తగ్గి హిమాలయ పర్వతప్రాంతం బయటకు కనబడింది. మత్స్యుడు నావను అటువైపు నడిపి నావలోనున్నవారిని భూమిపైకి చేర్చాడు.

పై ప్రసంగంలోని మత్స్యుడు బాగా అనుభవంగల మత్స్యకారుడు కావచ్చును. సామాన్యంగా ప్రకృతిలో ఏదైనా ఉపద్రవం రాబోయేముందు కొన్ని ప్రకంపనాలు కలుగుతాయి. వాటిని మనకన్న జంతువులు బాగా గుర్తుపట్టగలుగుతాయి. అవి ఆ ప్రకంపనాలను గుర్తించి ఆందోళనతో సురక్షిత ప్రాంతాలవైపు పరుగులు తీస్తాయి. కొన్ని నెలల క్రితం సునామీ భూకంపం వచ్చినపుడు అట్లే జరిగింది. జంతువులు దూరంగా పారిపోయాయి. మృతులలో మానవుల సంఖ్యనే ఎక్కువగా గుర్తించబడింది. ఇంత విజ్ఞానం పెరిగినా జంతువులు గుర్తించగలిగిన ప్రమాదాన్ని మానవులు గుర్తించలేకపోయారు.

పై ప్రసంగంలోని మత్స్యకారుడు బహుశః ప్రకృతిని పరిశీలించి జంతువుల ప్రవృత్తిని ఆందోళనను గమనించి రాబోయే ఉపద్రవాన్ని కనిపెట్టి ఉండవచ్చును. మనువును హెచ్చరించి కొన్ని ప్రాణులను రక్షించి ఉండవచ్చును.

ఈ ఉపద్రవాన్ని గురించి (జలప్లావనను గురించి) మహాభారతంలోనేగాక మన రామాయణ, శతపథబ్రాహ్మణ, పురాణాలలోను వ్రాయబడింది. ఈ త్రేతాయుగ ప్రారంభ ప్లావన విషయం విదేశీయుల సాహిత్యంలో కూడా కనబడుతుంది. కాల్డియా, సుమేరు, యహూదీ, దక్షిణ అమెరికా, చైనా సాహిత్యాలలో అచ్చటచ్చట ఈ ప్లావన విషయం ఉంది. కనుక ఆ యా ప్రాంతాలలో కొందరు మానవులు ఆ జలప్రళయం నుండి బ్రతికి బయబటపడి ఉండవచ్చును.

మహాభారత ఆదిపర్వం 75వ అధ్యాయంలో మనువును గురించి, అతని సంతతిని గురించి కొంత వివరణ కనబడుతుంది. దాని ప్రకారం - వివస్యాన్‌యొక్క వంశంలో మహా మేధావీ, ధర్మాత్ముడు నైన మనువు జన్మించాడు. అతడు చాలా ప్రభావశాలి. మనువుకు ఒక తమ్ము డున్నాడు. అతని పేరు యముడు. ఈ మనువు వల్లనే మానవ జాతి విస్తరించింది. బ్రాహ్మణ, క్షత్రియు, వైశ్య, శూద్ర వర్ణాలు ఏర్పడ్డాయి. ఈ నాలుగు వర్ణాలు గుణ కర్మ స్వభావాలనుబట్టి ఏర్పడ్డాయే కాని జన్మతో వచ్చినవి కావు. జన్మతో అందరు కేవలం మానవులు మాత్రమే. వీరిలో బ్రాహ్మణ గుణకర్మస్వభావాలుకలవారు వేదశాస్త్ర అధ్యయన అధ్యాపనల లోను, యజ్ఞయాగాది క్రతువులలోను కాలం గడిపేవారు. అందుచే వారిపేర్లు అంతగా ప్రసిద్ధిని పొందలేదు. క్షత్రియులు రాజ్యపాలనాదులు చేసేవారు కనుక వారిపేర్లు కొన్ని శాస్త్రాలలో కనబడతాయి.

**వేనం ధృష్ణం నరిష్యంతం నాభాగేక్ష్వాకుమేవ చ ।**
**కారుష్య మథ శర్యాతిం తథా చైవాష్టమీ మిలామ్ ॥**
**నాభాగారిష్టదశమాన్ మనోః పుత్రాన్ ప్రచక్షతే ।**

వారు - వేనుడు, ధృష్ణుడు, నరిష్యంతుడు, నాభాగుడు, ఇక్ష్వాకుడు, కారుష,శర్యాతి, ఇలా, పృషధ్రుడు మరియు నాభాగరిష్టుడు. వీరు మనువు యొక్క పుత్రులుగా (సంతానంగా) చెప్పబడ్డారు.

మనువుకు వీరేకాక మరికొందరు పుత్రులు జన్మించారు. కాని, వారంతా పరస్పరం కలహించుకొని ఒకరినొకరు చంపుకొని మరణించారు. పై పదిమంది సంతానంలో యిద్దరే తమ వంశాలను విస్తరింపచేసారు. ఒకరు ఇక్ష్వాకుడు. మరొకరు ఇలా (కుమార్తె). ఇలయొక్క వివాహం బుధుడు అనే పేరుగల యువకునితో జరిగింది. వారికి పురూరవుడు

అనే కుమారుడు కలిగాడు. అతని పేరుతో పురువంశం ప్రచలితమయ్యింది. ఇక్ష్వాకుని వంశం సూర్యవంశంగా విఖ్యాతిని పొందింది. ఇలా బుధుల సంతానం చంద్రవంశంగా రూపుదిద్దుకుంది.

త్రేతాయుగంలోని మానవులు మరియు జీవజాతులు అన్నీ ఆ పెద్ద ఉపద్రవంనుండి బయటపడినవారి సంతానమే. ప్రపంచమానవులను జాగ్రత్తగా పరిశీలించినట్లయితే ముఖ్యంగా 3 జాతులు కనబడతాయి. అవి ఆర్య, మంగోలియా, హబ్షీ జాతులు. వీరి నుండే దేశ కాల జల వాయువుల ప్రభావంతో మరికొన్ని జాతులు ఏర్పడ్డాయి. ఇక్కడ జాతి పదం రూఢిగా వాడబడుతోంది. అసలు జాతి అంటే – సమాన ప్రసవాత్మికా జాతిః – ఒకే రకమైన ప్రసవం కలిగినవి" అని అర్థం. ఆ ప్రకారం మానవులంతా ఒకే జాతికి చెందినవారు. వారందరిని మానవజాతి అనాలి. కాని, నేడు లోకంలో ఒక తెగకు చెందినవారిని ఒక జాతిగా వ్యవహరిస్తున్నారు. కనుక ఇది రూఢి అర్థం. ఈ పుస్తకంలో ఆర్యజాతి (ఆర్య తెగ) ఇతిహాసం మాత్రమే వ్రాయబడుతోంది. భారతీయ పురాణాలలో కనబడే దస్యు, దానవ, అసుర, దైత్య, రాక్షస, గంధర్వ, దేవతాదు లందరు ప్రత్యేక జాతులు (తెగలు) కాదు. వీరంతా మనువంశ పరంపరలోనివారే. ఆర్యులే. వారి వారి గుణకర్మ స్వభావాలను బట్టి ఆ యా వర్గాలుగా విభజింపబడ్డారు.

## మను వంశావళి

ప్రపంచంలోని కాల్డియన్, బైబిలోనియన్, మిశ్రాణీ, యునానీ, రోమన్, సైక్సన్, నార్మన్ మొదలైన తెగలు కూడా ఆర్యసంతానమే. ఆర్యసంతానమే ప్రపంచంలో విస్తరించి ఆ యా దేశాలలో ఆ యా జాతులుగా వ్యవహరింప బడుతున్నాయి. బ్రహ్మ నుండి మనువు వరకు గల వంశక్రమం ఒక గ్రంథంలో ఒకరకంగా మరొక గ్రంథంలో మరొక

రకంగా కనబడుతుంది. దీనికి కారణం దానిని వంశక్రమంగా కాక అంటే వారి సంతానంగా కాక ఆ వంశక్రమంలో ప్రసిద్ధిని పొందిన వ్యక్తులుగా చెప్పబడుటయే. ఉదాహరణకు రామాయణ మహాభారతాలను పరిశీలిద్దాం.

**వాల్మీకి రామాయణంలో**

బ్రహ్మ → మరీచి → కశ్యప → వివస్వాన్ → మనువు అని వ్రాయబడింది.

**మహాభారతంలో**

ప్రచేతా (బ్రహ్మ) → ప్రచేతా పుత్రుడు → అచేతస → దక్ష → అదితి (కశ్యవపత్ని) → వివస్వాన్ → మనువు

మను → } ఇక్ష్వాకు → సూర్యవంశం
ఇలా → చంద్రవంశం

పై క్రమంలోని ప్రచేతా నామము బ్రహ్మకుగల మరొకపేరు.

పై రెండు వంశక్రమాలలో తేడా ఎందుకంటే వివస్వానుడు తల్లి వైపునుండి బ్రహ్మయొక్క 6వ తరంగా లెక్కింపబడ్డాడు. తండ్రి వైపు నుండి లెక్కిస్తే 4వ తరం వాడుగా అవుతాడు. కనుక ఈ వంశక్రమాలు తరాలు కాదు. ఆ క్రమంలో ప్రసిద్ధిని పొందిన ముఖ్యుల పేర్లు. ఒక ఋషి దృష్టిలో నలుగురు ముఖ్యులైతే మరొక ఋషి దృష్టిలో ఆరుగురు ముఖ్యులు కావచ్చు. మరొక ఉదాహరణ - మనువు నుండి శ్రీరాముని వరకు

**రామాయణంలో**

మను → ఇక్ష్వాకు → కుక్షి → వికుక్షి → బాణ → అరణ్య → పృథు → త్రిశంకు → ధుంధుమార → యువనశ్చ → మాన్ధాతా → సుసన్ధి → ధ్రువ సన్ధి → భరత → అసిత → సాగర → అసమంజ -

అంశుమాన్ → దిలీపు → భగీరథ → కుకుత్స్థ → రఘు → ప్రవృద్ధ – శంఖణ → సుదర్శన → అగ్నివర్ణ → శీఘ్రగ → మరు → పశుశ్రుక – అంబరీష → నహుష → యయాతి → నాభాగ → అజ → దశరథ → రాముడు.

ఈ 36 తరములలోను శ్రీరాముడు త్రేతాయుగ చివరికాలం నాటివాడు. ఆ ప్రకారం మనువునుండి శ్రీరాముని వరకు సుమారు 12,96,000 సంవత్సరములు (త్రేతాయుగ పరిమాణం) ఉంటుందనుకుంటే దీనిని 36తో భాగిస్తే ఒక్కొక్కరు 36,000 సంవత్సరాలు జీవించినట్లు అవుతుంది. ఇది అసంభవం. మనిషి ఎక్కువలో ఎక్కువ 400 సంవత్సరాలు జీవించవచ్చు నంటారు

పై 36 మంది ఆ వంశంలో ప్రసిద్ధిని పొందినవారు మాత్రమే. అయితే మన ఋషులు ప్రాచీన ఇతిహాస శైలిలో మనువు పుత్రుడు ఇక్ష్వాకుడనియు, అతని పుత్రుడు కుక్షి అనియు ఈ విధంగా పై వారందరు ఒకరి పుత్రులు ఒకరుగా వ్రాసారు. ఇక చంద్రవంశరాజుల వంశావళి పరిశీలిద్దాం. మహాభారతంలో ఒకచోట వైశంపాయనుడు చెప్పినట్లుగా, మరొకచోట కృష్ణద్వైపాయనుడు చెప్పినట్లుగా రెండు వంశావళులు కనబడతాయి. కృష్ణద్వైపాయనుడు మనువునుండి మొదలుపెట్టి ఈ విధంగా చెబుతాడు.

మను → ఇలా → పూరూరవ → ఆయు→నహుష → యయాతి → పురు → జనమేజయ → ప్రాచిన్వాన్ → సంయాతి→అహంయాతి → సార్వభౌమ→జయత్సేన → అవాచీన → అరిహ → మహాభౌమ → అయుతనాయీ → అక్రోధన → దేవాతిథి → అరిహ → ఋక్ష → మతినార → తంసు → ఈలన → దుష్యన్త → భరత → భుమన్యు → సుహోత్ర → హస్తీ → వికుంఠన → అజామీఢ → సంవరణ → కురు →

విదూర → అనశ్వా → పరీక్షిత → భీమసేన → ప్రతిశ్రవా → ప్రతీప → శంతను → (దేవవ్రత) → విచిత్రవీర్య → ధృతరాష్ట్ర → దుర్యోధన → పాండు → యుధిష్ఠిర

మొత్తం 43 తరములు. అంటే, వీరు ఆ వంశక్రమంలోని ప్రముఖులని గుర్తించాలి. మహాభారతంలో ఆదిపర్వం పరిశీలనగా చదివితే ఈ విషయం స్పష్టమవుతుంది . ఉదాహరణకు పై వంశావళిలో భుమన్యునకు సుహోత్రు డొకడే పుత్రుడు ఉన్నట్లుగా ఉంది. కాని, భుమన్యునకు దివిరథ, సుహోత్రా, సుహవీ, సుథజు, ఋచీకు లనే మరో అయిదుగురు పుత్రు లున్నారు. వారిలో సుహోత్రుడు జ్యేష్ఠుడు. అతనే రాజై తదుపరి వంశావళికి కర్త అయ్యాడు. ఈ సుహోత్రుడు ఇక్ష్వాకు వంశానికి చెందిన కన్యను వివాహమాడి అజామీఢుడు, సుమీఢుడు, పురుమీఢుడు అనే ముగ్గురుపుత్రల నుత్పన్నం చేసాడు. వీరిలో అజామీఢుడే వంశాన్ని నడిపాడు.

ఈ సుహోత్రుడే ఇక్ష్వాకువంశానికి చెందిన సువర్ణా అనే మరొక కన్యను వివాహమాడి హస్తి అను పేరుగల మరొక కుమారునికి జన్మనిచ్చాడు. ఈ హస్తిరాకుమారుడే హస్తినాపురాన్ని నిర్మించి పాలించినట్లుగా మహాభారత కథనం. హస్తిరాకుమారుడు త్రిగర్తరాజు యొక్క పుత్రిక యశోధరాను వివాహమాడి వికుంఠన అనే పేరుగల పుత్రునికి జన్మనిచ్చాడు. వికుంఠనుడు దశార్హ కులానికి చెందిన సుదేవీని వరించి ఆమె ద్వారా అజామీఢునికి జన్మనిచ్చాడు. దీనినిబట్టి అజామిఢుడు సుహోత్రునికి మునిమనుమడు కావాలి. అయినప్పటికి అజామీఢుడు సుహోత్రుని పుత్రునిగానే వైశంపాయనుడు వివరించిన వంశావళిలో చెప్పటం జరిగింది. కాన, ప్రాచీన ఇతిహాస శైలిలో పుత్రుడంటే కుమారుడే

కానక్కఱలేదు. మనుమడు లేదా మునిమనుమడు లేదా 5, 6 తరాల తదుపరివాడుకూడా కావచ్చును.

ధృతరాష్ట్రుడు తన వంశం నశించిపోతున్నదని బాధపడుతూ ఉంటే సంజయుడు అతనిని ఓదారుస్తూ "రాజా ! పురువంశంలో (చంద్రవంశంలో) ఎందరెందరో రాజులు జన్మించారు. ఎన్నెన్నో గొప్ప కార్యాలు చేసారు. చివరికి మరణించారు. అట్లే నీ కొడుకులు కూడా మరణించారు. విచారింపవల"దని శాంతపరుస్తాడు. కాని, పురు వంశావళిలో ముఖ్యులైన కొందరి పేర్లు మాత్రమే పై పట్టికలో కనబడతాయి.

ఇక్ష్వాకువంశంలో ఎందరెందరో శ్రేష్ఠపురుషులు ఉద్భవించారు. కాని, ఇలా వంశంలో అలా జరగలేదు. ఇలా పుత్రుడైన పురూరవుడు గర్వానికి, లోభానికి గురియై ఎన్నో దుష్టకార్యాలు చేసాడు. దేవలోకంనుండి ఊర్వశిని బలాత్కారంగా ఆర్యావర్తానికి తీసుకువచ్చాడు. ఆమె ద్వారా ఒక పుత్రుని పొందాడు. ఇంతేగాక, బ్రాహ్మణులను అనేక బాధలకు గురిచేసాడు. ప్రజలను పీడించాడు. విద్వాంసులు, మంత్రులు ఎన్ని విధాల నచ్చచెప్పినా అతను మారలేదు. చివరికి ఋషులే అతనిని నశింపజేసి అతని సంతానంలోని ఆయు అనే వ్యక్తిని రాజుగా చేసారు.

ఈ ఆయు నామక వంశంలోనే నహుషుడు జన్మించాడు. ఇతడు కూడా దుర్మార్గుడే అయ్యాడు. దేవలోకాన్ని జయించి ఇంద్రాసనాన్ని చేజిక్కించుకున్నాడు. ఇంద్రాసనంపై కూర్చున్న నహుషుని అహంకారం మితిమీరిపోయింది. లోభం పెరిగిపోయింది. ఋషులు మహర్షుల నుండి కూడా పన్నులు వసూలు చేయటం ప్రారంభించాడు. ఇంద్రుని పత్నిని వివాహం చేసుకోవాలని దుర్బుద్ధి పుట్టింది. అందుకై తన పల్లకీని

మహర్షులతో మోయించాడు. ఇతని దుశ్చర్యలు సహించలేక మహర్షులు శపించి నాశనం చేసారు. దేవతలను విడిపించి వారి రాజ్యాన్ని వారికి అప్పగించారు. తదుపరి నహుశుని పుత్రుడైన యయాతిని ఉత్తర పాంచాల దేశానికి రాజును చేసారు.

ఈ విధంగా ప్రాచీన కాలంలో రాజులు దుష్టులైతే విద్వాంసులు, ఋషులు వారిని గద్దె దింపి వారి వంశంలోని మరొకరిని రాజుగా చేసేవారు. అవసరమైతే అతనిని సంహరించేవారుకూడా. నహుష డనే పేరుగల వారు సూర్యవంశంలో ఒకరు, చంద్రవంశంలో ఒకరు కనబడతారు. వారి వంశావళులు ఈ విధంగా ఉన్నాయి.

**సూర్యవంశంలో** నహుషుడు → యయాతి → నాభాగ → అజ → దశరథ → శ్రీరాముడు

**చంద్రవంశంలో** - యయాతి (1) యదు→యదుకులం

(2) జనమేజయుడు - ప్రాచిన్తవాన్

- సంయాతి మొదలైన చంద్రవంశ రాజులు

ఋగ్వేదంలో నహుషుని పేరు కనబడుతుంది. అట్లని వేదంలో నహుషుని చరిత్ర ఉందనుకోవడం పొరబాటు. అక్కడ నహుష పదానికి అర్థం వేరే ఉంటుంది.

**ఆ యాతం నహుష స్పర్యాన్తరిక్షాత్సువృక్తిభిః ।**
**పిబాథో అశ్వినా మధు కణ్వానాం సవనే సుతమ్ ॥**

**(ఋగ్వేదం. 8-8-3)**

ఈ మంత్రదేవత 'అశ్వినా'. అంటే ఈ మంత్రంలో జంట అశ్వినుల గురించిచెప్పబడింది. ప్రకరణాన్ని బట్టి యిక్కడ జంటఅశ్వినులంటే సూర్యచంద్రులు. అప్పుడు మంత్రార్థం ఈ విధంగా ఉంటుంది.

ఓ అశ్వినులారా (సూర్యచంద్రులారా!) మీరు (నహుషః పరి) మనుష్యలోకంపై నుండే అంతరిక్ష మార్గం ద్వారా మంచి ఉద్దేశ్యంతో మావద్దకు రండి. (కణ్వానాం సవనే సుతమ్ మధు పిభాథో) కర్మశీలురైన మానవులచే చేయబడిన శ్రేష్ఠకర్మల ఫలితమును పానం చేయండి.

ఇది ఒక ఆలంకారిక వర్ణన. మానవులు శ్రేష్ఠకర్మలు చేస్తూ శ్రేష్ఠమైన పదార్థాలను సంపాదించి దేవతలకు అర్పించాలని దీని భావం. సూర్యచంద్రులు జడ దేవతలు. వాటికి అర్పించాలంటే అగ్నిహోత్రం చెయ్యాలి. మానవులలో దివ్యగుణాలు కలిగినవారంతా చేతనదేవతలు. వారికి సత్కారపూర్వకంగా దాన ధర్మాలు చెయ్యాలి.

'నహుషః' పదము 'నహ బన్ధనే' అనే మూల సంస్కృత ధాతువుతో నిర్మింపబడుతుంది. అందుచే 'కర్మలచే బంధింపబడిన మానవులు' అని పై మంత్రంలో అర్థం వ్రాయబడింది. ఈ పదానికి 'శత్రువులను బంధించగలవాడు, లేదా శత్రువులను ఎదుర్కొనగలవాడు' అని కూడా అర్థం వస్తుంది. ఈ అర్థంతో చంద్రవంశరాజులలోని ఆయు రాజు తన కుమారునికి 'నహుషుడు' అని పేరు పెట్టుకుని ఉండవచ్చు. అట్లే మరికొన్ని పేర్లు వేదాలలో కనబడవచ్చు. అచట వాటి ధాత్వర్థాన్ని ఆ యా ప్రకరణాలకు అనుగుణంగా చెప్పుకోవాలేగాని చరిత్రవుందని అనుకోరాదు.

## మనువు నుండి వంశావళులు ప్రారంభం

త్రేతాయుగ ప్రారంభంలో జరిగిన జలప్లావన నుండి మనువు బ్రతికి బయటపడ్డాడు. అతనితో బాటు మరికొందరు ఋషులు, సామాన్య మానవులు, పశుపక్ష్యాదులు కూడా రక్షింపబడ్డాయి. ఆ విధంగా రక్షింపబడినవారి నుండి మరల ప్రాణిజాతులు విస్తరింపబడ్డాయి. అందులో ముఖ్యుడు మనువు. అట్లే విదేశాలలో కూడా కొందరు రక్షింపబడి ఉండవచ్చును.

మన భారతీయ పరంపర ననుసరించి – పరమేశ్వరుడు అగ్ని వాయు ఆదిత్య అంగిర ఋషులకు ఋక్ యజుసామ అథర్వవేదాలను ప్రసాదించాడు. అంటే, వారు సమాధిస్థితిలో ఉన్నప్పుడు వారి బుద్ధిలో ఆ వేదజ్ఞానాన్ని ప్రకాశపరచాడు. ఆ నలుగురు ఋషులు సామాన్య జనులకు ఆ జ్ఞానాన్ని ఉపదేశిస్తూ వచ్చారు. బ్రహ్మ అను పేరుగల ఒక గొప్ప మేధావి ఆ నలుగురు ఆది ఋషుల నుండి 4 వేదాలను అధ్యయనంచేసి తన బుద్ధిలో ధారణచేసాడు. అట్టి బ్రహ్మను పూర్ణ విద్వాంసునిగా మన శాస్త్రాలు శ్లాఘిస్తాయి. మనం పూర్వ ప్రకరణంలో చెప్పుకొన్నట్లు బ్రహ్మ త్రివర్గశాస్త్రం పేరుతో బృహత్ గ్రంథాన్ని రచించాడు. దానిలో ధర్మ అర్థ కామములను గురించి విస్తృతంగా చెప్పబడింది. నాల్గవదియైన మోక్షశాస్త్రాన్ని బ్రహ్మ తన మానస పుత్రులైన ఋషులకు ఉపదేశించినట్లు మన శాస్త్రాలలో కనబడుతుంది. ఇక్కడ మానస పుత్రులంటే ప్రియ శిష్యు లని అర్థం చేసుకోవాలి.

బ్రహ్మ పై నాలుగు శాస్త్రాల వేత్తనేగాక ఆయుర్వేద, ధనుర్వేద, గంధర్వవేద, అర్థవేదాలు కూడా తెలిసిన గొప్ప శాస్త్రవేత్త. సకల విద్యానిధి. ఆ మహానుభావుడే ఆది మానవులకు గురువై వారి వారి యోగ్యతలను,శక్తి సామర్థ్యాలను బట్టి ఆయా శాస్త్రాలను బోధించాడు. ఇదంతా సత్యయుగ ప్రారంభంలో జరిగింది. కాలాంతరంలో సత్యయుగం గడచి త్రేతాయుగం ప్రారంభం కావడం, పెద్ద జలప్రళయం జరగటం, మనువు, మరికొందరు బ్రతికి బయటపడటం జరిగింది. ఆ ప్రళయంలో శాస్త్రాలు, శాస్త్రవేత్తలు చాలావరకు నశించిపోయారు. అనంతరం మనువు ఋషుల సహకారంతో ఆయా విద్యలను త్రేతాయుగంలో పునరుద్ధరించాడు.

బ్రహ్మ పూర్ణజ్ఞాని అనే విషయం మన శాస్త్రాలలోనేగాక మరికొన్ని

విదేశీ గ్రంథాలలో కూడా కనబడుతుంది. ప్రఖ్యాత ఆర్య విద్వాంసులు, చరిత్ర పరిశోధకులు అయిన పం. భగవదత్తగారు ప్రసిద్ధ ప్రపంచ చరిత్రకారుల గ్రంథాలను పరిశోధించి "భారత్‌వర్షకా బృహద్ ఇతిహాస్" అనే పెద్ద గ్రంథాన్ని రెండు సంపుటాలుగా (వాల్యూమ్స్‌గా) రచించారు. వాటిలో 2వ సంపుటంలోని 26వ పుటలో ప్రసిద్ధ చరిత్రకారుడైన స్టేన్‌లే సేకరించిన ఒక ప్రమాణాన్ని వ్రాసారు. ఆ ప్రమాణం ప్రాచీన ఇబ్రానీ గ్రంథాలనుండి సేకరించినది. మనం పైన చెప్పుకున్న బ్రహ్మ వారి భాషలో ఆదామ్‌గా (ప్రథమ మానవుడుగా–ఫస్ట్ మాన్‌గా) చెప్పబడ్డాడు. ఆయన ఈ విధంగా వ్రాసారు.

The Hebrew doctors ascribe to Adam various compositions on the subject of Ethics, Theology and Legislation, as well as a book on the creation of the world, which he bequeat hed to his posterity, and which together with the book of Seth and Edris as the Arabians denominate Enock were deposited in a chest, which many centuries after the deluge was found by the patriarch Abraham, in the country of Sabians. This information is given to us by Stanley, out of the old Chaldean and Arabian authors, in the following passage.

Kissaeus, a Mahomodean writer, asserts that the Sabiaaus possessed not only the book of Seth and Edris, but also others written by Adam himself ; for Abraham, after his expulsion from Chaldea by the tyrant Nimrod, going in to the country of the Sabians opened the chest of Adam, and behold! in it were the books of Adam, as also those of Seth and Edirs, and the names of all the prophets that were to succeed Abraham.

"ఇబ్రానీ విద్వాంసుల నమ్మకమేమంటే ఆదాము (బ్రహ్మ) చరిత్ర (ధర్మం)ను గురించి, విశ్వాసాలను గురించి మరియు రాజనీతిని గురించి పుస్తకాలు వ్రాసెను. అతడు సృష్టి ఉత్పత్తిని గురించి కూడా ఒక పుస్తకం వ్రాసెను. వాటిని అతడు భావి తరాలకోసం అర్పించెను. అతడు తన పుస్తకంతో బాటు సేత్ (వసిష్ఠుని) యొక్క పుస్తకాన్ని మరియు ఎడ్రిస్ (అత్రి) యొక్క పుస్తకాన్ని (మొత్తం మూటిని) ఒక పెట్టెలో పెట్టి సీలు చేసెను. అట్టివాటిని కొన్ని శతాబ్దాల తరువాత ప్లావనానంతరం అబ్రహామ్ పితామహుడు బయటకు తీసెను. అప్పటికి ఆ ప్రాంతం సైబీనియా దేశంగా ఉండెను.

ఈ విషయం కాల్డియన్ మరియు అరబీ సాహిత్యం చదివిన అనంతరం స్టేన్లేకు తెలిసింది. తదుపరి అతను తన పుస్తకంలో తన అభిప్రాయాన్ని ఈ విధంగా వ్రాసాడు.

కిసంస (KISSAEUS) అను పేరుగల ఒక మహ్మదీయ రచయిత గ్రహించిన దేమంటే సేబేనియన్ల దగ్గర సేట్ (వసిష్ఠుడు) మరియు అద్రిస్ (అత్రి) వ్రాసిన పుస్తకాలేకాక అదామ్ (బ్రహ్మ) స్వయంగా వ్రాసిన మరొక పుస్తకం కూడా ఉంది. ఆ పెట్టె ఆతతాయి నిమ్రూద్ ద్వారా కాల్డియా నుండి సైబీనియా దేశానికి తీసుకుపోబడింది. దానినే (అంటే ఆదాము పెట్టెనే) ఇబ్రహామ్ తెరవటం జరిగింది. దానిలో ఆదామ్ మరియు సేట్, అద్రిస్‌ల పుస్తకాలు దొరికాయి. ఆ పుస్తకాలలో అబ్రహామ్ తదుపరి ఋషుల పేర్లు కూడా ఉన్నాయి."

పై ప్రసంగాన్ని బట్టి గ్రహించవలసిందేమంటే జలప్రళయం రాకపూర్వం భావితరాలకోసం ఋషులు బ్రహ్మ, వసిష్ఠ, అత్రి ఋషులు వ్రాసిన గ్రంథాలను, మరికొన్ని ముఖ్యగ్రంథాలను భద్రమైన ఒక పెట్టెలోపెట్టి, నీరుపోకుండా గట్టి సీలుచేసి భూమిలో పాతిపెట్టిఉంటారు.

జలప్లావనానంతరం భూమిని త్రవ్వి ఆ పెట్టెను బయటకు తీసి ఉంటారు. ఆ పుస్తకాలలో సృష్టిపురాణం లేదా సృష్టి ఇతిహాసం (బుక్ ఆన్ ద క్రియేషన్ ఆఫ్ ద వరల్డ్) కూడా ఉన్నట్లు తెలుస్తున్నది. దీనిని బట్టి ఇతిహాసం (పురాణం) సత్యయుగంలో కూడా ఉన్నట్లు తెలుస్తున్నది. మరెన్నో గ్రంథాలు జలప్లావనంలో నశించిపోయి ఉంటాయి.

మనువు మరియు ఋషులు వీటి ఆధారంతోను, వారి స్మృతి ఆధారంతోను త్రేతాయుగంలోని మానవులకు జ్ఞానబోధ చేసిఉంటారు. ప్లావనానంతరం వ్రాయబడిన మొదటి విషయం మనువు యొక్క పుత్రుల గురించి. మనువుకు చాలామంది పుత్రులు కలిగారు. కాని, వారిలో చాలామంది పరస్పర వైమనస్యంతో కలహించుకొని మరణించారు. దీనిని బట్టి అన్ని కాలాలలోను దేవతలు (మంచివారు) రాక్షసులు (చెడ్డవారు) ఉంటారని తెలుస్తున్నది.

మనువుకు కలిగిన ధర్మాత్ములైన పుత్రులలో ఇక్ష్వాకుడు ఒకరు. ఇలా కూడా సద్గుణవతియే. కాని, ఆమె పుత్ర పౌత్రులు అంత మంచివారు కాదు. జీవులు వారి వారి పూర్వకర్మల ననుసరించి వివిధ ప్రవృత్తులు కలిగిన వారుగా ఉంటారు. కొందరిలో పరిసరాల ప్రభావం కన్న పూర్వజన్మలలోని కర్మల ప్రభావమే ఎక్కువగా ఉంటుంది. మంచి వారికి చెడ్డ కుమారులు, చెడ్డవారికి మంచి కుమారులు కలగటం అక్కడక్కడ కనబడుతుంది. ఇక్ష్వాకుడు, ఇలా స్వయంగా మనువు సంతానం కాకపోవచ్చు. వారి వంశంలో కాలాంతరంలో జన్మించినవారు కావచ్చు. అట్టివారినికూడా పుత్రులుగా చెప్పటం మన ప్రాచీన యితిహాస శైలి. ఇలా కొంతకాలం స్వయంగా రాజ్యాన్ని పరిపాలించింది. వృద్ధురాలైన తదుపరి తన కుమారుడైన పురూరవునకు రాజ్యాన్ని అప్పగించింది.

పురూరవుడు అహంకారి. తన ప్రజలను కష్టపెట్టడమే కాక ప్రక్క రాజ్యాలపై కూడా దండయాత్రలు చేసేవాడు. గంధర్వలోకాన్ని తన వశం చేసుకొని అక్కడనుండి ఊర్వశి అనే అప్సరసను తీసుకువచ్చి బలవంతంగా పెండ్లిచేసుకున్నాడు. ఆమెతోబాటు 3 అగ్నులను తీసుకువచ్చినట్లు చరిత్రలో కనబడుతుంది. వైదిక వాఙ్మయంలో అగ్నిపదం దైవీశక్తులకు సూచకంగా ఉంటుంది. బహుశః పురూరవుడు గంధర్వలోకం నుండి 3 వైజ్ఞానిక శక్తులను (లేదా విజ్ఞాన వేత్తలను) మానవలోకానికి తీసుకువచ్చి ఉండవచ్చును. వాటితో మానవలోకంలో విజ్ఞానం విస్తరించి ఉండవచ్చును.

పురూరవుని కుమారుడు ఆయు. అతడు స్వర్భానుకుమారి అనే పేరుగల కన్యను వివాహం చేసుకొని ఆమె నుండి అయిదుగురు పుత్రులను పొందాడు. వారి పేర్లు - నహుష, వృద్ధశర్మా, రజి,గయ, అనేన. వీరిలో నహుషుడు తదుపరి రాజై వంశావళిని విస్తరింపచేసాడు. ఇతని గురించి రాబోవు ప్రకరణాలలో తెలుసుకుందాము. నహుషుని పుత్రుడు యయాతి. యయాతినుండి వంశావళి రెండుగా విస్తరించింది. ఒకటి యదువంశం. ఈ వంశంలోనే కాలాంతరంలో యోగేశ్వర శ్రీ కృష్ణుడు జన్మించాడు. రెండవది పురువంశం. కాలాంతరంలో పురువంశంలోనే కౌరవ పాండవులు జన్మించారు. వీరేగాక ఎందరెందరో రాజులు, మహారాజులు పురువంశంలో ఉద్భవించి తమ తమ రాజ్యాలను విస్తరింపచేసుకున్నారు. శూరులు, వీరులు, కీర్తివంతులు జన్మించారు. ఈ పురువంశం త్రేతాయుగంలో ప్రారంభమై ద్వాపరయుగాంతం వరకు భారతదేశాన్ని పాలించింది.

మహాభారత యుద్ధానంతరం కొద్దికాలానికే పరస్పరం కలహించు కొని యదువంశం నశించిపోయింది. పురు వంశంలోని శూరవీరులంతా మహాభారత యుద్ధంలో చాలా వరకు మరణించారు. కౌరవులు పూర్తిగా నశించిపోగా పాండవులు అయిదుగురు మిగిలారు. వారుకూడా అభిమన్యు కుమారుడైన పరీక్షితునకు రాజ్యాన్ని అప్పగించి వనాలకు వెళ్ళిపోయారు. పరీక్షితుని సంతానం (వంశం) మహ్మదీయుల ఆక్రమణ సమయం వరకు కొనసాగింది. పంజాబ్ దేశ రాజైన జయపాలు (జయచంద్) చంద్ర వంశీయునిగానే చెప్పబడ్డాడు. భారతపురాన్ని మరియు రాజస్థాన్‌లోని కొన్ని రాజ్యాలను ఆంగ్లేయుల ఆక్రమణకాలం వరకు యదుకుల రాజ - మహారాజులు పరిపాలించినట్లుగా చరిత్రలో కనబడుతుంది.

ఈ యదుకుల పురువంశాలు చాలా కాలం భారతదేశాన్ని పాలించాయి. ఈ కులాలలో అప్పుడప్పుడు శూరులు, వీరులు, ధర్మాత్ములు, మేధావులుకూడా ఉద్భవించారు.

త్రిశంకుడు, మాందాతా, ప్రసేనజిత్, సగరుడు, దిలీపుడు, భగీరథుడు, రఘు, దశరథ, శ్రీరాములంతా ఇక్ష్వాకు వంశీయులు (సూర్యవంశీయులు).

మహ్మదీయుల ఆక్రమణకాలంలో అయోధ్యను సూర్యవంశీయులే పరిపాలించేవారు. వీరిని గురించి ముందు ప్రకరణాలలో వివరంగా తెలుసుకుందాము.

ఈ సందర్భంలో కలియుగంలో వేదాలను పునరుద్ధరించి, వైదిక సంస్కృతీ సభ్యతల యథార్థ స్వరూపాన్ని వివరించి ప్రచారం చేసిన మహర్షి దయానంద సరస్వతి గారి ఇతిహాసాన్ని గురించిన అభిప్రాయాలను తెలుసుకోవడంకూడా మంచిది. కనుక వాటిని గురించి ఆలోచిద్దాం.

# మహర్షి దయానందుని అభిప్రాయాలు

మహర్షి దయానందుని పూర్వాశ్రమ నామం మూలశంకరుడు. గుజరాత్‌లోని టంకారా అనే గ్రామంలో సామవేదీయ ఔదీచ్య బ్రాహ్మణ కుటుంబంలో వీరు జన్మించారు. తండ్రి కర్షన్‌లాల్‌జీ, తల్లి రుక్మిణి. వీరు సంపన్న కుటుంబానికి చెందినవారు. శివభక్తులు. 14 సంవత్సరాల ప్రాయం వచ్చేటప్పటికే మూలశంకరునిచే యజుర్వేదం పూర్తిగా కంఠస్థం చేయించారు. పార్థివ శివలింగపూజ చేయించేవారు. మూలశంకరుడు ఒకనాటి శివరాత్రి రోజున పగలంతా ఉపవాసం చేసి రాత్రి జాగరణ చేయడానికి తండ్రివెంట శివాలయానికి వెళ్ళాడు. అర్ధరాత్రి తరువాత క్రమంగా భక్తులంతా నిద్రలోకి జారుకున్నారు. మూలశంకరుడు నిద్రించక శివుని దర్శనం కోసం తదేక దృష్టితో శివలింగాన్ని చూస్తున్నాడు. అప్పుడొక విచిత్ర సంఘటన జరిగింది. ఎక్కడినుండో కొన్ని ఎలుకలు వచ్చి శివ లింగం వద్ద పెట్టిన నైవేద్యాన్ని తిని, లింగంపై పరుగులు తీయటం జరిగింది. ఆ సన్నివేశం చూసిన మూలశంకరుని హృదయంలో వివేకం జాగృతమయ్యింది. ఈ లింగం నిజంగా శివుడయితే ఈ ఎలుకలను అదలించదేమి? అనే ప్రశ్న ఉదయించింది. తండ్రిని లేపి అడిగితే - 'నిజమైన శివుడు కైలాసంలో ఉంటాడు. ఇది కలియుగం కనుక అతను ఇక్కడకు రాడు. ఈ లింగం ద్వారా అతనిని పూజించి ప్రసన్నం చేసుకోవాలి' అని తండ్రి సమాధాన మిచ్చాడు. దానితో తృప్తిచెందని మూలశంకరుడు యింటికివెళ్ళి ఉపవాసాన్ని విరమించి నిద్రించాడు.

16వ ఏట చెల్లెలి మరణాన్ని, 19వ ఏట తనను ఎంతగానో ప్రేమించే పినతండ్రి మరణాన్ని చూసిన తదుపరి మూలశంకరునిలో తీవ్రవైరాగ్యం కలిగింది. నిజమైనశివుని దర్శించి మృత్యువునుండి

తరించాలని దృఢమైన సంకల్పం చేసుకున్నాడు. తన 21వ ఏట యిల్లు వదలి గురువులను వెదుకుచు దేశసంచారం చేయటం ప్రారంభించాడు. లోకంలోని గురువులు చెప్పిన కఠోరవ్రతాలను, యోగ సాధనలను చేసి చూసాడు. కాని, నిజమైన శివుని దర్శనం కాలేదు. సంన్యాసాశ్రమం తీసుకొని దయానంద సరస్వతిగా మారాడు. అయినా ఫలితం కలగలేదు.

ఆనాడు భగవంతుని గురించి చెప్పుకునే రకరకాల కథలు విన్నాడు. భక్తులాచరించే వివిధ వ్రతాలను, కర్మకాండలను చూసాడు. ఇందులో ఏది సత్యమో అతనికి అంతుబట్టలేదు. ఎన్నెన్నో ప్రశ్న లుదయించాయి. వీటన్నిటికి సమాధానం చెప్పగల గురువుకోసం వెదుక నారంభించాడు. చివరకు మథురానగరంలోని స్వామి విరజానంద సరస్వతి వద్దకు చేరుకున్నాడు. ఆయన చెప్పిన సమాధానాలు స్వామి దయానందునికి సంతృప్తిని కలిగించాయి. ఆయనకు శిష్యుడై పాణినీయవ్యాకరణ ఆధారంగా వేదవేదాంగాల నన్నిటిని అధ్యయనం చేసాడు. సత్యం అవగతమయ్యింది. గురువునుండి సెలవు తీసుకొని యోగసాధన చేస్తూ ముక్తిని పొందాలనుకున్నాడు.

గురువు స్వామి విరజానంద సరస్వతి ప్రజ్ఞాచక్షువు. చిన్నతనం లోనే మసూచిక వ్యాధితో కన్నులు పోగొట్టుకున్నా ఏకసంతాగ్రాహి కావటం వల్ల వేదవేదాంగాల నన్నిటిని కంఠస్థం చేసిన మేధావి. ప్రాచీన వైదిక సంస్కృతీ సభ్యతలపట్ల, ఆర్ష గ్రంథాలపట్ల ఆయనకు అనన్యభక్తి.

ఇంతేగాక, స్వామి విరజానందులవారు గొప్ప దేశభక్తులు. వారు స్వామి దయానందునిలోని స్ఫూర్తిని, విద్యా వివేకాలను, ధైర్యసాహసాలను గుర్తించారు. వేదాల పేరుతో లోకంలో వ్యాపించిఉన్న అనేకానేక కురీతులను, మూఢనమ్మకాలను ఖండించి సత్యమైన వైదిక సంస్కృతీ

సభ్యతలను పునరుద్ధరించగల సమర్థుడని గ్రహించారు. అందుచే వాటినే గురుదక్షిణగా కోరారు. స్వామి దయానందులవారు గురువు మాట కాదనలేక గురుదక్షిణ చెల్లించుటకై కార్యక్షేత్రంలోకి దిగారు.

ఆనాడు వేదాల పేరుతో బాల్యవివాహాలు జరిగేవి. విధివశాత్తు స్త్రీలు భర్తను కోల్పోతే బలవంతంగా చితిలోకి త్రోసేసేవారు. లేకుంటే జీవితాంతం వైధవ్యాన్ని అనుభవిస్తూ బానిసలుగా గడపవలసి వచ్చేది. స్త్రీ శూద్రులకు వేదశాస్త్రాలు చదివే అధికారం ఉండేదికాదు. క్రమంగా క్షత్రియ వైశ్యులుకూడా వేదశాస్త్రాలకు దూరమయ్యారు. వేదాలు కేవలం బ్రాహ్మణులవరకే పరిమితమైపోయాయి. దానితో కొందరు స్వార్థపరులు ఋషుల గ్రంథాలలో అనేక వేదవిరుద్ధ ఆచారాలను ప్రక్షిప్తం చేసారు. అవి అన్నీ వేదమూలకాలే అని ప్రచారం చేసారు. వాటిలో ముఖ్యమైనవి జన్మమూలక వర్ణ-కుల వ్యవస్థ, విగ్రహారాధన, అవతారవాదం, ఒక్క దేవుని స్థానంలో అనేక దేవీ దేవతల కల్పన, మృతక శ్రాద్ధ తర్పణాలు, యజ్ఞయాగాదులలో పశుహింస, అంటరానితనం, బాల్య వివాహాలు, వృద్ధవివాహాలు మొదలైనవి. వేద విహిత పంచమహాయజ్ఞాల స్థానంలోను, అహింసా సత్య అస్తేయ బ్రహ్మచర్యాదుల స్థానంలోను పై మూఢాచారాలు వచ్చి కూర్చున్నాయి. వీటికితోడు దేశం విదేశీయులకు, విమతస్థులకు బానిస అయ్యింది.

అట్టి స్థితిలో మహర్షి దయానందులవారు నిర్భయంగా 'పాఖండ ఖండినీ' పతాకాన్ని ఎగురవేసి పై వేదవిరుద్ధ ఆచారాల నన్నిటిని ఖండించారు. వైదిక సిద్ధాంతాలను ప్రజలకు వివరించి చెప్పారు. పండితులతో అనేక శాస్త్రార్థాలు చేసి వారిని ఓడించారు. వేదాలను అందరూ చదివే అవకాశాన్ని పునరుద్ధరించారు. అప్రామాణిక వేద

భాష్యాల నన్నిటిని ఖండిస్తూ ప్రాచీన ఋషులు వ్రాసిన బ్రాహ్మణ ఆరణ్యక నిరుక్తాది ప్రమాణాలనిస్తూ వేదాలకు భాష్యం వ్రాసారు. సంస్కృత అర్థంతోబాటు సామాన్యులందరికి అర్థమయ్యే ఆర్య (హిందీ) భాషలో కూడా అర్థం వ్రాసారు. వైదిక సిద్ధాంతాలను సరళ హిందీ భాషలో సర్వులకు అర్థమయ్యేటట్లు 'సత్యార్థప్రకాశం' అనే అమర గ్రంథాన్ని రచించారు. నాలుగు వేదాలకు భూమికగా 'ఋగ్వేదాది భాష్యభూమిక' వ్రాసారు. మానవుని మహాత్మునిగా తీర్చిదిద్దే షోడశ సంస్కారాలను 'సంస్కారవిధి'గా సంకలనం చేసారు. గోకరుణానిధి, భ్రమోచ్ఛేదనము మొదలైన మరెన్నో లఘుగ్రంథాలును వ్రాసారు.

## 'సత్యార్థ ప్రకాశం'లో

మహర్షి తన 'సత్యార్థ ప్రకాశం' మొదటి 10 సముల్లాసాలలో (అధ్యాయాలలో) భారతీయ సంస్కృతీ సభ్యతల స్వచ్ఛమైన స్వరూపాన్నీ, వైదిక సిద్ధాంతాల విశుద్ధ స్వరూపాన్నీ వివరించి చెప్పారు. 11వ సముల్లాసంలో వైదిక సిద్ధాంతాలకు భిన్నంగా నేడు లోకంలో ప్రచలితమైయున్న-అనేక మూఢనమ్మకాలను హేతుబద్ధంగా ఖండించారు. అంటే వాటిలోని లోపాలను, వాటివల్ల కలిగే అనర్థాలను ధైర్యంగా చూపించారు. అట్టి 11వ సముల్లాసాన్ని (అధ్యాయాన్ని) ప్రారంభిస్తూ ప్రాచీన భారతదేశ ఔన్నత్యాన్ని, ఆనాటి రాజుల వైభవాన్ని, అప్పటి విద్యా విజ్ఞాన సదాచారాల విశిష్టతను చాలా సంక్షిప్తంగా వ్రాయటం జరిగింది. ఆ కొద్ది మాటలే వివేకవంతుల కళ్ళు తెరిపించాయి. మన ఇతిహాసాన్ని తెలుసుకోవాలన్న కుతూహలాన్ని కలిగించాయి. ఆ ప్రేరణతో కొందరు పరిశోధనలు సాగించి ఆశ్చర్యకరమైన వాస్తవాలను వెలుగోలోకి తెచ్చారు.

ముందుగా ఆయన మన భారతదేశాన్ని 'స్వర్ణభూమి' అన్నారు.

దానికి కారణం చెబుతూ 'ఒకప్పుడు ఈ దేశంలో బంగారాన్ని, రత్నాలను ఉత్పన్నం చేసేవారు. సృష్ట్యాదిలో ఆర్యులు త్రివిష్టప పీఠభూమినుండి (హిమాలయ పర్వత సానువులనుండి) ముందుగా ఈ గంగా సింధు మైదాన ప్రాంతానికే వచ్చి స్థిరనివాసం ఏర్పరచుకున్నారు. అప్పటికి ఈ ప్రాంతంలో మానవులెవరూ నివసించటం లేదు. ఆర్యులంటే ఉత్తమ మానవులని అర్థం. ఆర్య పదం గుణవాచకమేకాని జాతివాచకం కాదు. సదాచారానికి భిన్నంగా మద్య మాంస వ్యభిచారాదులను సేవించేవారిని దస్యులంటారు. దస్య పదంకూడా గుణవాచకమే" అని ఆయన అన్నారు.

"ప్రపంచ దేశాలన్నీ భారతదేశపుటౌన్నత్యాన్ని వేనోళ్ళ కీర్తించాయి. లోకంలో 'పరసువేది' అనే అద్భుతమైన ఱాయిని గురించి చెప్పుకుంటూ ఉంటారు. దానితో ఇనుమును తాకితే అది బంగారమైపోతుందని చెబుతారు. కాని, అది నిజం కాదు. అటువంటి ఱాయి ఉండటం అసంభవం. మరొకరకంగా చెబితే సరిపోతుంది. ఈ భారతదేశమే పరసువేది. లోహరూప దరిద్రావస్థలోనున్న దేశాలు ఈ దేశాన్ని తాకితే - అంటే ఈ దేశంతో సంబంధం పెట్టుకుంటే సువర్ణంగా ధనసంపన్నంగా మారిపోతాయి - అని చెప్పవచ్చు" నన్నారు.

మహర్షి చెప్పినది అక్షరాల నిజం. మన రామాయణంలో అయోధ్యానగర వైభవం ఎంతగానో వర్ణింపబడింది. లక్ష్మణుడు లంకా నగరాన్ని దర్శించి వచ్చి రామునితో ఆశ్చర్యంగా 'స్వర్ణమయీ లంకా' అని అంటాడు. మహాభారతంలో అనేక సంపన్న నగరాల వర్ణన ఉంది. ధర్మరాజుచేసిన రాజసూయ యాగంలో దోసిళ్ళతో బంగారపు కాసులను, రత్నాలను దానం చేసినట్టు వర్ణింపబడింది. మన దేశాన్ని దర్శించవచ్చిన విదేశీ యాత్రికులు కూడా యిట్టి మాటలే వారి పుస్తకాలలో వ్రాసుకున్నారు.

మహర్షి చెప్పిన మరొక సత్యం ఏమంటే - సృష్టి ప్రారంభం నుండి మహాభారత యుద్ధం జరిగిన సమయం వరకు ఆర్య చక్రవర్తులే (భారతదేశ చక్రవర్తులే) ప్రపంచదేశాలన్నిటిని పరిపాలించారంటారు. దానికి వారు ఎన్నో ప్రమాణాలు చూపించారు. చీనా దేశాన్ని పాలించే భగదత్తుడు, అమెరికాను పాలించే బభ్రువాహనుడు, యూరోపురాజు బిడాలాక్షుడు, ఈరాను దేశపు శల్యుడు మొదలైన వారంతా ఆజ్ఞానువర్తులై రాజసూయ యాగానికి వచ్చి కప్పాలు చెల్లించారు. భారతయుద్ధంలో పాల్గొని యుద్ధాలు చేసారని వారన్నారు. అట్లే రఘువంశరాజులు పాలించినపుడు లంకాధిపతియైన రావణుడు ఆజ్ఞానువర్తియై యుండేవాడు. శ్రీరామ చంద్రుని కాలంలో సీతను అపహరించి విరోధి అయ్యాడు. అప్పుడు రాముడు రావణుని తొలగించి ఆ రాజ్యాన్ని ధర్మాత్ముడైన విభీషణునికి యివ్వటం జరిగింది. స్వాయంభువరాజు మొదలుకొని పాండవులవరకు భారతీయార్యుల చక్రవర్తిరాజ్యమే ప్రపంచాన్ని పాలించింది - అని వారంటారు. అట్టి భారతదేశం ఈ స్థితికి ఎందుకు వచ్చిందో కూడా వివరించి చెప్పారు.

"పరమేశ్వరుని సృష్టిలో అభిమానులు, అన్యాయకారులు, అవిద్వాంసులు నైన వారి రాజ్యం ఎంతో కాలం నిలవదు. అందుచేతనే ఒకరితో ఒకరు పోట్లాడుకొని నశించారు. అవసరం కన్న అధికంగా ఐశ్వర్యం పెరిగితే సోమరితనం, విషయాసక్తి, ఈర్ష్యాద్వేషాలు పెరుగుతాయి. పురుషార్థం నశిస్తుంది. అదే పతనానికి దారితీస్తుంది. విద్య స్థానంలో అవిద్య వ్యాపిస్తుంది. దానితో అనేక మూఢనమ్మకాలు చోటుచేసుకుంటాయి. స్వేచ్ఛాచారం ప్రబలిపోతుంది. అదే మనదేశంలో జరిగింది. ఇక రాజ్యవ్యవస్థలో కూడా ఎక్కడ యుద్ధవిద్యాకౌశలం, ఆయుధసంపత్తి

పెరిగిపోతుందో అక్కడ తన్నెదిరించేవారు భూలోకంలో మరెవరూ లేరనే అహంకార అభిమానాలు పెరిగిపోతాయి. దానితో పక్షపాతం అన్యాయం చోటుచేసుకుంటాయి. పరస్పర వైరాలు ప్రారంభమౌతాయి. అదే భారతదేశంలో జరిగింది. విదేశీయులు ఆక్రమించాటానికి అవకాశం కలిగించిం"దని దయానంద మహర్షి అన్నారు.

పూర్వం ప్రపంచాన్ని పరిపాలించిన ప్రసిద్ధ చక్రవర్తుల పేర్లలో కొందరి పేర్లను మహర్షి పేర్కొన్నారు.

**అథమైతేర్వా పరే ऽ న్యే మహాధనుర్ధరాః చక్రవర్తినః కేచిత్ సుద్యుమ్న భూరిద్యుమ్నేంద్రద్యుమ్న కువలాయాశ్వయౌవనాశ్వ వధ్ర్యశ్వాశ్వపతి శశబిందు హరిశ్చంద్రా ऽ oబరీష ననక్తు సర్యాతి యయాత్యనరణ్యాక్ష సేనాదయః। అథ మరుత్త భరత ప్రభృతయో రాజానః॥**

(మైత్ర్యుపని. ప్ర 1-ఖం-4)

పై మైత్ర్యుపనిషత్ ప్రమాణం వల్ల పూర్వం సుద్యుమ్నుడు, భూరిద్యుమ్నుడు, ఇంద్రద్యుమ్నుడు, కువలయాశ్వుడు, యౌవనాశ్వుడు, వధ్ర్యశ్వుడు, అశ్వపతి, శశబిందువు, హరిశ్చంద్రుడు, అంబరీషుడు, ననక్తుడు, సర్యాతి, యయాతి, అనరణ్యుడు, అక్షసేనుడు, మరుత్తు, భరతుడు అను పేర్లుగల మహాధనుర్ధరులైన చక్రవర్తులు ప్రపంచాన్ని ఏకచ్ఛత్రాదిపత్యంగా పరిపాలించారు. ఇట్టి ప్రమాణాలే మనుస్మృతి రామాయణ మహాభారతాది గ్రంథాలలో కూడా ఉన్నాయని వారన్నారు.

విద్యలోను, చరిత్రలోను కూడా భారతదేశం ప్రపంచ గురువుగా ఉండేదని చెబుతూ మనుస్మృతిలోని ఒక శ్లోకాన్ని వారు ఉదహరించారు.

ఏతద్దేశ ప్రసూతస్య సకాశా దగ్ర జన్మనః।
స్వం స్వం చరిత్రం శిక్షేరన్ పృథివ్యాం సర్వమానవాః॥

(మనుస్మృతి. 2-20)

ఈ భారతదేశ అగ్రజన్ములైన విద్వాంసులనుండి ప్రపంచ మానవులంతా వారికి కావలసిన విద్యలను, సదాచారాలను అభ్యసింతురు గాక !

రామాయణ మహాభారతాది గ్రంథాలలో ఆగ్నేయాస్త్ర, వారుణాస్త్ర, సమ్మోహనాస్త్రాదుల వర్ణన కనబడుతుంది. అవి ఏవో కొన్ని మంత్రాలను పఠించినంత మాత్రాన్నే తయారవుతాయనే అభిప్రాయం లోకంలో ఉంది. ఇవన్నీ అసత్యాలు బూటకాలు అని కొందరంటారు. దానికి మహర్షి దయానందుడు వివరణయిస్తూ – నిజంగా పూర్వం అట్టి అస్త్రాలుండేవి. కానీ, అవి మంత్రాలు పఠించినంత మాత్రాన తయారైనవికావు. మంత్రం అంటే ఆలోచన. అటువంటి ఆయుధాలు నిర్మించటానికి కావలసిన ప్రక్రియ ఆ మంత్రాలలో చెప్పబడింది. ఆ మంత్రాలను చదివి వాటిని గురించి బాగా ఆలోచిస్తే ఆ ప్రక్రియ తెలిసేది. ఆ జ్ఞానంతో వారు ఆగ్నేయాది అస్త్రాలు నిర్మించేవారు. (వాటిని యిప్పటి బాంబులు, డైనమెట్లు మొదలైన వాటితో పోల్చవచ్చు) అని వివరించారు.

శత్రువు మంటలను పుట్టించే మందుతోకూడిన బాణాన్ని (ఆగ్నేయాస్త్రాన్ని) వదిలితే – వెంటనే దానిని చల్లబరచే వారుణాస్త్రాన్ని వీరులు ప్రయోగించేవారు. మత్తును కలిగించే మందుతో కూడిన బాణాన్ని (సమ్మోహనాస్త్రాన్ని) శత్రువు ప్రయోగిస్తే – దానిని నిర్వీర్యం చేసే మందుతోకూడిన బాణాన్ని వీరులు ప్రయోగించేవారు. ఇవి అన్నీ ఒక రకమైన ఆయుధాలే నని స్పష్టం చేసారు.

ఈ విధంగా మహర్షి దయానందుడు సందర్భం వచ్చినప్పుడంతా ఆ యా విజ్ఞాన విషయాలను వారి గ్రంథాలలో సూచన ప్రాయంగా వ్రాసారు. సత్యార్థప్రకాశ షష్ఠ సముల్లాసంలో రాజధర్మాలను గురించి హేతుబద్ధంగా వివరించారు. రాజులే (పాలించేవారే) విషయలోలురైతే ప్రజలు కూడా వారిని అనుసరిస్తారని హెచ్చరించారు. **'యథా రాజా**

తథా ప్రజా' అనే చాణక్యనీతిని గుర్తు చేసారు.

ఏకాదశ సముల్లాసం చివరలో ఆర్యావర్త దేశాన్ని అంటే మన భారతదేశాన్ని పాలించిన రాజవంశావళిని సేకరించి ప్రచురించారు. సంక్షిప్తంగానైనా రామాయణ మహాభారతాలలో స్వాయంభువ మనువునుండి వివస్వాన్ మనువు వరకు మరియు యుదిష్ఠిర పరీక్షితుల వరకు రాజవంశావళి చెప్పబడింది. ఆ తదుపరి ఎవరెవరు ఎంతెంతకాలం పరిపాలించారు ? అనే విషయం చాలామందికి తెలియదు. అందుచే మహర్షి ప్రయత్నించి ఆనాడు రాజస్థాన్‌లోని చిత్తోడ్‌గడ్ నుండి ప్రచురింపబడే 'హరిశ్చంద్ర చంద్రిక' 'మోహన చంద్రిక' అనే పక్షపత్రికలను పరిశీలించారు. అందులో చరిత్రకారుల పరిశోధనలు ప్రచురింపబడ్డాయి. వాటి ఆధారంగా 10 పేజీల రాజ వంశావళి పట్టికను సత్యార్థప్రకాశంలో వ్రాసారు. స్థలాభావం వల్ల ఆ పట్టికను ఇచట యివ్వలేకపోతున్నాము. సంక్షిప్తంగా –

శ్రీమత్ యుధిష్ఠిర మహారాజు (ధర్మరాజు) మొదలుకొని యశపాలు మహారాజు వరకు 4,157 సంవత్సరాల 9 నెలల 14 దినముల కాలంలో 124 మంది రాజులై పాలించారు. వీరంతా ఇంద్రప్రస్థాన్నే రాజధానిగా చేసుకొని పాలించారు. అయితే అందరూ యుధిష్ఠిర వంశీయులు కారు. వీరిలో కేవలం 30 మంది మాత్రమే యుధిష్ఠిర వంశీయులు. తదుపరి రాజ్యం చేతులు మారుతూవచ్చింది. అనంతరం విశ్రపుని వంశీయులు 14 మంది, వీరమహుని వంశీయులు 16 మంది పాలించారు. ఈ విధంగా వంశాలు మారుతూ పృథ్వీరాజు వంశంలోని 5వ తరం వాడైన యశపాలుని వరకు ఆర్యరాజులే మన దేశాన్ని పాలించారు.

ఈ చివరి యశపాలమహారాజు కాలంలోనే ఆర్య చక్రవర్తుల రాజ్యం పూర్తిగా పతనమై మహ్మదీయుల వశమయ్యింది. దీనికి కారణం మన దేశంలోని అంతర్గత కలహాలే. విక్రమ శకం 1249వ సంవత్సరంలో సుల్తాన్ శహబుద్దీన్‌గోరీ ఇంద్రపస్థంపై (ఢిల్లీపై) దండెత్తి యశపాలరాజును ఓడించాడు. అతనిని చెఱబట్టి ప్రయాగ కోటలో బంధించి తాను ఇంద్రప్రస్థానికి రాజయ్యాడు. అప్పటినుండి శహబుద్దీన్ వంశీయులు 53 మంది సుమారు 245 సంవత్సరాలు ఈ దేశాన్ని పాలించారు. వీటి వివరణ యిప్పుడు లభించే ఇతిహాస పుస్తకాలలో ఉంది. కనుక నేను వ్రాయుటలేదని మహర్షి అన్నారు.

### పూనా ప్రవచనాలలో

మహర్షి దయానంద సరస్వతి గారు పూనా నగరంలో ప్రజల కోరికమేరకు ప్రవచనాలు చెప్పటం జరిగింది. ఈ ప్రవచనాలు బుధవారంపేటలోని 'భిడే' గారి ప్రాంగణంలో విక్రమ శకం 1932 ఆషాఢ శు॥ పాడ్యమి క్రీ.శ. 4-7-1875 నుండి జరిగాయి. అప్పుడు జరిగిన మొత్తం 15 ప్రవచనాలలో 6 ప్రవచనాలు ఇతిహాసం విషయంలో చెప్పబడ్డాయి. వాటి సారాంశం ఏమంటే -

మనుస్మృతిలోని కొన్ని శ్లోకాల ఆధారంగా మహర్షి ఈ విధంగా చెప్పారు. 'స్వాయంభువ మనువు యొక్క పుత్రుడైన మరీచి మొదటి క్షత్రియరాజు. ఇతని తరువాత హిమాలయ ప్రాంతాన్ని ఆరుగురు క్షత్రియ రాజులు పాలించారు. అనంతరం ఇక్ష్వాకురాజు ఈ ప్రాంతాన్ని పాలించాడు. ఇక్ష్వాకుని కాలంలో రాజ్యం విస్తరించింది. ప్రజలు హిమాలయ పర్వత సానువుల నుండి దిగివచ్చి గంగాసింధు మైదానాన్ని తమ నివాస స్థానంగా చేసుకున్నారు. ఇక్ష్వాకుని కాలంలో విశ్వకర్మ అనే

పేరుగల ఒక గొప్ప శిల్పి ఉండేవాడు. అతడే ముందుగా విమానాన్ని నిర్మించే పద్ధతిని కనిపెట్టాడు. కొన్ని విమానాలను నిర్మించియిచ్చాడు.

ఆదిమానవులలోని బ్రహ్మ కుమారుడు విరాటుడు. అతనికి విష్ణువు, సోమసదుడు అనే పేర్లుగల యిద్దరు కుమారులు కలిగారు. ఆ కాలం నాటివాడే అయిన అగ్నిష్వాత్తునికి మహాదేవు డనే పేరుగల పుత్రుడు పుట్టాడు. వారిలో బ్రహ్మ విష్ణు మహాదేవులు ముగ్గురు దేవతలలో ప్రసిద్ధులుగా ఉండేవారు. వారు మానవులే. వారిలోని దివ్యగుణాలవల్ల విశిష్ట దేవతలుగా ప్రసిద్ధిని పొందారు. ఆనాడు హిమాలయ పీఠభూమిని దేవలోకం అనేవారు. అందలి ప్రజలను దేవత లనేవారు. అట్టి దేవతలలో బ్రహ్మ, విష్ణు, మహాదేవులు విశిష్టంగా ఉండేవారు.

ఆ హిమాలయాలలో మనోహరమైన ఒక కొండపై విష్ణువు తన నివాసాన్ని ఏర్పరచుకున్నాడు. ఆ ప్రాంతం సుందరమైన పుష్పాలతో, వనస్పతులతో, స్ఫటికంవంటి జల ప్రవాహాలతో నయనానందకరంగా ఉండేది. ఆ ప్రాంతాన్నే వైకుంఠమని పిలిచేవారు. మహాదేవునిది యౌగిక ప్రవృత్తి. అందుచే దూరంగా ఒక మంచుకొండపై తన నివాసాన్ని ఏర్పరచుకున్నాడు. దానిని కైలాసం అనేవారు. ఈ విష్ణు మహాదేవుల అనంతరం వారి సంతతి ఆ ప్రాంతాలకు అధిపతులైనా వారిని కూడా విష్ణు, మహాదేవులనే పిలిచేవారు. ఆప్రాంతాలను వైకుంఠ కైలాసము లనే అనేవారు. ఇట్లే బ్రహ్మ నివసించిన స్థానాన్ని సత్యలోకం అన్నారు. అతని తదుపరి అతని వంశీయులు ఆ ప్రాంతానికి అధిపతు లయ్యారు. అట్టి వారినికూడా బ్రహ్మ అనే వ్యవహరించేవారు.

ఇక్ష్వాకుని కాలంలో విస్తరించిన మానవ సంతతి గంగాసింధు మైదానానికి చేరుకొని అచ్చట స్థిరనివాసం ఏర్పరచుకున్నారు. దానికి

ఆర్యావర్తమని పేరు పెట్టారు. తమను ఆర్యులుగా చెప్పుకొనేవారు. వీరు ఇక్కడకు రాక పూర్వం గంగాసింధు మైదానం ఖాళీగాఉండేది. ఇతర మానవులు ఎవరూ ఉండేవారు కాదు. ఈ ఆర్యావర్తం ప్రారంభంలో హిమాలయ వింధ్యపర్వతాల మధ్య ఉండేది. పశ్చిమాన సరస్వతీనది (సింధునది) తూర్పున (బ్రహ్మపుత్ర) దృషద్వతీ నదులు ప్రవహించేవి. క్రమంగా ఆర్యావర్తంలో జనసంఖ్య పెరిగింది. దానిని తగ్గించటానికి దేవతలు అవిద్వాంసులు, అనాచారపరులు నైన వారిని విమానాలలో కూర్చుండబెట్టుకుని సంచరించేవారు. ఎక్కడెక్కడ సుందర మైదాన ప్రాంతాలు కనబడితే అక్కడక్కడ వారిని దింపి, అక్కడ నివసించటానికి ఏర్పాట్లు చేసేవారు. ఈ విధంగా ప్రపంచంలోని దేశాలన్నిటిలోను మానవులు వ్యాపించారు.

మన ప్రాచీన శాస్త్రాలన్నిటిలోను మన దేశానికి ఆర్యావర్తమని, భరతఖండమని, భారతవర్షమని పేర్లున్నాయి. ఆర్యులంటే ఉత్తమ మానవు లని అర్థం. అట్టి ఆర్యులు నివసించే దేశం కావటంవల్ల ఈ దేశాన్ని ఆర్యావర్త మన్నారు. భరత పదానికి భరించేది, పోషించేది అని అర్థం. మానవులను చక్కగా పోషిస్తుంది కనుక మన దేశానికి భారతదేశం అనే పేరు వచ్చింది. హిందూదేశం అనే పేరు మధ్యకాలంలో బలవంతంగా మనపై రుద్దబడింది. మహ్మదీయులు మన దేశాన్ని పాలించేటప్పుడు మనకు హిందువులని పేరుపెట్టారు. హిందువులు నివసించే దేశం కనుక మన దేశాన్ని హిందూదేశం అన్నారు. బలవంతంగా మనచేతకూడా హిందూదేశం అని అనిపించారు. హిందూ శబ్దానికి మంచి అర్థాలు లేవు. అరబీభాషలో హిందువులు అంటే దొంగలు దోపిడీగాండ్రు దుష్టులు అని అర్థం. అప్పుడు మనదేశం బానిసదేశంగా ఉండేది కనుక ఆ పేరు

భరించాము. ఇప్పుడు మనకు స్వాతంత్ర్యం వచ్చింది. స్వాభిమానం కలిగి ఉండటం మంచిది. హిందూ శబ్దాన్ని వదిలి మనం ఆర్యుల మని చెప్పుకోవా లని ఉద్బోధించారు. మనవారు గుణభ్రష్టులైన కానిండు కాని నామభ్రష్టులెంతమాత్రం కారాదని మహర్షి తన ఆవేదనను వ్యక్తం చేసారు.

మహర్షి దయానంద సరస్వతి గారు 25-7-1875 నాటి ప్రవచనంలో మరికొన్ని ఆసక్తికరమైన విషయాలు చెప్పారు.

ఆర్యులచే వ్యవస్థీకృతమైన ఆర్యావర్తానికి మొదటి క్షత్రియరాజు ఇక్ష్వాకుడు. ఇతడు బ్రహ్మనుండి ఆరవతరం వాడు. ఇక్కడ తరం అంటే తండ్రినుండి కొడుకువరకు అనికాదు. ఇతిహాసంలో తరం అంటే ఒక అధికారి నుండి మరియొక అధికారి వరకు ఉండే కాలం. దేవలోకానికి స్వాయంభువ మనువు మొదటి అధికారి. మరీచి రెండవ అధికారి. ఆ వరుసలో ఇక్ష్వాకుడు ఆరవ అధికారి. అతనికాలంలోనే ఆర్యావర్తం వ్యవస్థీకృత మయ్యింది. అందుచే ఇక్ష్వాకుడే ఆర్యావర్తానికి మొదటి రాజయ్యాడు.

ఇక్ష్వాకుని కాలంలోనే ప్రజలు సిరాతో అక్షరాలను వ్రాసే పద్ధతిని కనుగొని ప్రచారంలోకి తెచ్చారు. అప్పటికే ప్రజలకు వేదాలను కంఠస్థం చేసే శక్తి తగ్గిపోతుండేది. అందుచే వేదాలను లిపిబద్ధంచేసి ముందు తరాలకు అందించాలని విద్వాంసులు ఈ లిపిని ముందుగా ప్రయోగించారు. కనుక దీనికి 'దేవానాగర లిపి' అనే పేరు వచ్చింది. (దానినే మన ఇప్పుడు హిందీ అంటున్నాం. హిందీ భాషకు ప్రత్యేకం లిపి ఏమీ లేదనీ, దేవనాగరలిపినే ఆ భాషకు లిపిగా వాడుకొంటున్నారని పెద్దలు చెబుతారు.).

ఆదిమానవులలో బ్రహ్మ యొక్క ఉత్పత్తి వరకు దివ్యసృష్టి - అంటే అమైథున సృష్టి ఉండేది. ఆ తదుపరి నుండి మైథునీ సృష్టి (ఇప్పటివలె) ఏర్పడింది. ఆ క్రమంలో విరాటుడు పుట్టాడు. ఆయన తదుపరి మనువు పుట్టాడు. ఈ మనువే ధర్మ వ్యవస్థ గావించాదని, మనుధర్మశాస్త్రం వ్రాసాడని అంటారు. సృష్టిలో మొదటిదైన స్వాయంభువ మన్వంతరంలో జన్మించినవాడు కనుక ఈ మనువునకు స్వాయంభువమనువు అనే పేరు వచ్చింది.

మనుధర్మశాస్త్రం ప్రకారం ప్రజలందరు కలిసి యోగ్యత కలిగిన ఒక వ్యక్తిని ఎన్నుకొని రాజుగా చేయాలి. ఇక్ష్వాకుడు కూడా ఆ విధంగా ప్రజలచే ఎన్నుకొనబడిన రాజే.

కొందరు ఋషులు మనుమహారాజును సమీపించి వర్ణాశ్రమ ధర్మాలను గురించి, రాజ్యవ్యవస్థలను గురించి చెప్పమని కోరారు. అప్పుడు మనువు వాటిని వివరించి చెప్పాడు. ఆ మను భావాలను భృగుమహర్షి గ్రంథస్థం చేసారని చెబుతారు. ఇవి శ్లోకాలుగా కనబడతాయి. లోకంలో శ్లోకరచన రామాయణంతో ప్రారంభమయ్యిందనీ, వాల్మీకి ఆదికవి యనీ, రామాయణమే ఆదికావ్యమనీ అనుకుంటూ ఉంటారు. ఇది సరికాదు. అంతకు పూర్వానిదే అయిన మనుస్మృతియే ఆదికావ్యం. అప్పుడే శ్లోకరచన ప్రారంభమయ్యింది.

మనుస్మృతిలో 7, 8, 9 అధ్యాయాలలో రాజ్యవ్యవస్థ ఎలా ఉండాలో వివరింపబడింది. దాని ప్రకారం ఏర్పడిన రాజ్యంలో వ్యవస్థ ఎలా ఉండేదో సంక్షేపంగా తెలియపరుస్తాను. సుమారు నూరు గృహాలు ఉంటే అది గ్రామం, వేయి గృహాలుంటే అది మహా గ్రామం, పదివేలు ఉంటే నగరం, పదివేలకు పైన ఉంటే దానిని పురం అనేవారు. 10

గ్రామాలపై ఉండే అధికారిని దశేశుడు, వంద గ్రామాలపై అధికారిని శతేశుడు అనేవారు. ఇట్లే సహస్రేశుడు, దశ సహస్రేశుడు ఉండేవారు. వీరి పనితీరును పరిశీలించే గూఢచారులు ఉండేవారు. వీరందరిపై పరిపాలన చేసే రాజ్యాధికారి, సేనాధికారి, న్యాయాధికారి, కోశాధికారి అనే నలుగురు అధికారు లుండేవారు. అట్టి వ్యవస్థకు ఒక అధ్యక్షు డుండేవాడు. అతనినే రాజు అనేవారు. ఆర్యావర్త రాజసభకు మొదటి అధ్యక్షునిగా ఇక్ష్వాకుని ఎన్నుకొన్నారు.

ఇవేగాక ధర్మార్యసభ, విద్యార్యసభ ఉండేవి. వీటిపని కేవలం ధర్మాధర్మ వివచేన, విద్యా వ్యవస్థలే. నిర్ణయాధికారం పై రాజార్యసభకు మాత్రమే ఉండేది. సైనిక వ్యవస్థ కూడా ఉత్తమంగా ఉండేది. ఇప్పటి వలెనే సైనికులు చాలా క్రమశిక్షణతో ఉండేవారు. ఆజ్ఞాపాలనమే వారి కర్తవ్యంగా ఉండేది. వారికి ధనుర్వేదం నేర్పబడేది. నేటి యుద్ధవ్యవస్థ కన్న ప్రాచీన కాలంలో విశేషంగా వ్యూహరచన ఉండేది. మకర వ్యూహం, బక వ్యూహం, బలాకావ్యూహం, సూచీవ్యూహం, సూకర వ్యూహం, శకట వ్యూహం, చక్రవ్యూహం మొదలైన వ్యూహరచనలు వారికి నేర్పబడేవి. ఇట్టివి రామాయణ భారతాలలో మనకు కనబడతాయి. అనేకరకాల అస్త్ర శస్త్రా లుండేవి. సైనికులను కూడా శ్రద్ధగా చూసేవారు. సైనిక వ్యవస్థపైనే సమస్త ఐశ్వర్యాలు ఆధారపడి ఉన్నాయని భావించేవారు.

ఆనాడు దండన వ్యవస్థ కూడా విశేషంగా ఉండేది. సామాన్య వ్యక్తికిచ్చే దండనకన్న శిష్టునకు, విద్యావంతునకు, అధికారికి యిచ్చే దండన వందలరెట్లు ఎక్కువగా ఉండేది. అవసరమైతే రాజులను (అధ్యక్షులను) తొలగించి మరొకరిని రాజుగా చేసేవారు. సగరుని కాలంలో యిట్టి వ్యవస్థ ఉత్తమోత్తమంగా ఉన్నట్లు మన చరిత్రలో కనబడుతుంది. సగర

రాజు చాలా ఉత్తముడు. నీతిమంతుడు. కాని, అతని కుమారుడు 'అసమంజా' దుష్టుడు దుర్మార్గుడు. ప్రజలను అనేకరకాలుగా బాధించేవాడు. ఒక రోజు ఒక పేదవాని కొడుకును నీటిలో పడవేసాడు. అప్పుడు ఆ పేదవాడు తనకు న్యాయం చెయ్యమని రాజార్యసభను కోరాడు. అంత సగరరాజు తన కొడుకును దండించి, భయంకరా రణ్యంలోని ఒక చెఱసాలలో పెట్టించాడు. ఆనాడు న్యాయం అంత ఉత్తమంగా ఉండేది. రాజకుమారునికైనా శిక్ష పడేది.

మనం చెప్పుకున్న సగరుని గురించి కొన్ని అభూత కల్పనలు కూడా లోకంలో ఉన్నాయి. అతనికి 60,000 మంది పుత్రులున్నారనీ వారికి పెద్దపెద్ద చేతులుండేవనీ, వారే సముద్రాన్ని త్రవ్వేరని చెప్పుకుంటారు. ఇవి అన్నీ అసంభవ విషయాలు. ఎవరో కల్పించి వ్రాసి ఉంటారు.

సగరుని తరువాత అతని కుమారునికాక 'ఉపరిచరుడు' అనే వ్యక్తిని రాజుగా చేసారు. ఇతడు గాలి గుమ్మటాలవంటి విమానాలను తయారుచేయటంలో నిపుణుడు. కౌషీతక బ్రాహ్మణంలో అనేక చక్రవర్తుల వర్ణన ఉంది. వీరిలో కొందరు అశ్వవిద్యను అంటే అగ్నివిద్యను తెలిసిన వారుండేవారు. తదనంతరం జగద్విఖ్యాతుడైన భరతుడు ఈ దేశాన్ని పాలించాడు. అప్పటినుండి మన ఆర్యావర్త దేశానికి 'భరత వర్షము' అనే పేరు ప్రసిద్ధిని పొందింది. అనంతరం రఘుమహారాజు, శ్రీరాముడు మొదలైనవారు ఈ దేశాన్ని పాలించారు. ఇటువంటి వీరులు, పరాక్రమవంతులు, విద్వాంసులు, వైద్యశిఖామణులు, న్యాయాధీశులు అయిన వారెందరో ఈ దేశాన్ని పాలించారు. మన దేశానికి గొప్ప ఉన్నతిని కలిగించారు.

ఆ కాలంలో బాల బాలికలను ఐదేండ్ల ప్రాయంలోనే

పాఠశాలలకు పంపినట్లుగా 'కౌషీతకీయ' బ్రాహ్మణంలో వ్రాసి ఉంది. నిర్బంధ విద్యావిధానాన్ని వారు అమలపరచేవారు. ఈ నియమాన్ని తప్పితే రాజార్యసభ తల్లిదండ్రులకు దండన విధించేది. క్రమంగా ఆ కాలం గడచిపోయింది. శంతన మహారాజు కాలం వచ్చింది. అప్పటికి ఆర్యావర్తం ఐశ్వర్యంలో మునిగి తేలుతూ ఉండేది. ఆ ఐశ్వర్య మత్తువల్లనే సామాజిక నియమాలు సడలిపోయాయి. క్రమంగా రాజులు విషయాసక్తులయ్యారు. ధనవంతుల మనే అహంకారం పెరిగిపోయింది. క్రమగా భారతదేశం పతనోన్ముఖమయ్యింది.

శంతనమహారాజు అత్యంత విషయాసక్తు డయ్యాడు. సత్యవతిని వివాహం చేసుకోవడానికి ధర్మం తప్పాడు. తన విషయాసక్తిని తీర్చుకోవడానికి ధర్మాత్ముడైన భీష్ముని బలిచేసాడు. భీష్మునికి యివ్వవలసిన రాజ్యాన్ని సత్యవతీ పుత్రులకు అంటగట్టాడు.

సత్యవతి చరిత్రవల్ల ఆనాడు కూడా సామాజిక నియమాలు చాలా బలంగా ఉన్నట్లుగా తెలుస్తున్నది. శంతనుడు మహారాజైఉండికూడా పేదవాడైన సత్యవతితండ్రిపై బలప్రయోగం చెయ్యలేకపోయాడు. భీష్ముడు తాను జీవితాంతం బ్రహ్మచారిగా ఉంటానని ప్రతిజ్ఞ చేసేవరకు సత్యవతిని వధువుగా యివ్వటానికి అంగీకరించలేదు. దీనివల్ల ఆనాటి ప్రజలు ఎంత స్వాధీనపరులో అర్థమౌతోంది. రాజులుకూడా సామాజిక నియమాలను పాలించేవారని తెలుస్తున్నది. శంతనుని కాలంనుండి క్రమంగా పాపం పెరిగిపోయింది. చివరికి కౌరవ పాండవులు చేసిన మహాభారతయుద్ధంతో ఆర్యచక్రవర్తి రాజ్యం సమాప్తమయ్యింది.

భారతయుద్ధం తరువాత కౌరవులలో కృపాచార్యుడు, కృతవర్మ, అశ్వత్థామ అనే ముగ్గురు మాత్రమే మిగిలారు. పాండవులలో పాండవులు

అయిదుగురు, శ్రీకృష్ణుడు మిగిలారు. దీనికంతకు కారణం మూర్ఖులకు, నీచులకు నిర్ణయాధికారం యివ్వడమే. శకునివంటి నీచుని సూచనల మేరకు రాచకార్యాలు జరిగేవి. దుర్యోధనునివంటి దుష్టుని కోరికల మేరకు నిర్ణయాలు జరిగేవి. గృహంలోని అంతఃకలహాలు పెరిగి పెరిగి భారతయుద్ధానికి కారణమయ్యాయి. సర్వం నాశనమయ్యింది.

ఇట్లే పురువంశంకూడా నాశనమయ్యింది. ధర్మమూర్తి శ్రీకృష్ణుడు ద్వారకలో రాజ్యంచేసేవాడు. అప్పుడు యాదవులు చాలా ఉన్నత స్థితిలో ఉండేవారు. పాడి పంటలతో, ధన కనక వస్తు వాహనాలతో తులతూగేవారు. దురదృష్టవశాత్తు వారిలో వ్యసనాలు చోటుచేసుకున్నాయి. క్రమంగా విషయాసక్తులైపోయారు. చివరకు బలరాముడు మద్యం త్రాగుతూ నీటిలో మునిగి చనిపోయాడు. సాత్యకి సర్పంతో పోరాడి చనిపోయాడు. మిగిలిన యాదవులంతా తప్పత్రాగి ఒకరితో నొకరు మల్లయుద్ధాలుచేసి చచ్చిపోయారు. ఈ విధంగా పురువంశంలో శ్రీకృష్ణుడు తప్ప మిగిలినవారంతా మరణించారు.

శ్రీకృష్ణుడు నిర్యాణం చెందగా, పాండవులు వానప్రస్థులుగా వెళ్ళిపోగా అభిమన్యు కుమారుడైన పరీక్షితుడు రాజయ్యాడు. ఇతడు కొంచం చంచల స్వభావి. ఆర్షగ్రంథాల ప్రబోధమేమిటో అర్థం కాలేదు. ఆ కారణంచేత మెల్లమెల్లగా పుక్కిట పురాణాల ప్రచారం ప్రారంభ మయ్యింది. పరీక్షితుని అనంతరం జనమేజయుడు, తర్వాత వజ్రనాథుడు రాజులయ్యారు. వీరు పాలనా సమర్థులు కారు. వీరి కాలంలోనే పురువంశ వైభవమంతా నాశనమయ్యింది. విద్యాసభ, ధర్మార్యసభ, రాజార్యసభ అనే మూడు సభలు (అసెంబ్లీలవంటివి) శాశ్వతంగా రద్దు చేయబడ్డాయి. అధికారమంతా రాజుల చేతిలోకి

వెళ్ళిపోయింది. రాజులు నిరంకుశులై తమ యిష్ట ప్రకారం రాజ్యపాలన చేసారు.

విద్యావైభవం కూడా నశించిపోయింది. క్రమంగా వేదశాస్త్రాలు చదివే అధికారం బ్రాహ్మణులవరకే పరిమితమైపోయింది. బ్రాహ్మణవాక్కు బ్రహ్మవాక్కుగా ప్రజలపై రుద్దబడింది. 'బ్రహ్మ వాక్యం ప్రమాణమ్ । బ్రాహ్మణాస్తు భూదేవాః' అనే అర్థరహిత వాక్యాలు ప్రాచుర్యం పొందాయి. తమ స్వార్థం కోసం 18 పురాణాలను కల్పించారు. అనేక దేవీదేవతల మూర్తులను తయారుచేసారు. గుళ్ళు గోపురాలు కట్టించి ప్రజలను అజ్ఞానంలో పడవేసారు. తమకు అనుకూలంగా శ్లోకాలు వ్రాసుకొని ఋషులు వ్రాసిన మనుస్మృతి మొదలైన గ్రంథాలలో ప్రక్షిప్తం చేసారు (చొప్పించారు). ఆ శ్లోకాలు తాము చెబితే ప్రజలు నమ్మరని ఋషుల గ్రంథాలలో చొప్పించి అవి ఋషులు చెప్పిన వాక్యాలే నని ప్రచారం చేసారు. రాజశాసనానికి, దండనకు కట్టుబడ కుండునట్లు "శ్మశానంలో ప్రజ్వరిల్లినా, యజ్ఞకుండంలో తేజరిల్లినా అగ్ని ఏవిధంగా దైవంగా భావించబడుతుందో అట్లే బ్రాహ్మణుడు విద్వాంసుడైనా లేక మూర్ఖుడైనా సాక్షాత్తుగా దేవతయే. ఒకవేళ బ్రాహ్మణుడు అనిష్టకార్యం (చెడ్డకార్యం) చేసినా అతడు సాక్షాత్తు పరమ దేవతయే. (మనుస్మృతి. 9-317, 318,319)" అను భావంగల శ్లోకాలను వ్రాసి మనుస్మృతిలో ప్రక్షిప్తం చేసారు.

క్రమంగా బ్రాహ్మణులు కూడా వ్యసనపరు లయ్యారు. యజ్ఞ యాగాదుల పేరిట మద్యపాన మాంసభక్షణలు చేసారు. సోమయాగాన్ని వికృతం చేసి సోమరసంపేరిట మద్యపానం చేసేవారు. అజామేధం పేరిట మేకలను చంపి అగ్నిహోత్రంలో ఆహుతులనిచ్చి ప్రసాదంగా ఆ

మాంసం తినేవారు. అశ్వమేధం పేరిట అసభ్యకర చేష్టలు చేసేవారు. ఎవరైనా భూతదయాపరులు 'ఇవేమిటని ?అడిగితే – వేదంలో ఈ విధంగా ఉంది. 'ఇది వేదాజ్ఞ, ఇది ఈశ్వరాజ్ఞ' అని సమాధానం చెప్పేవారు. ఆ దుస్థితే బౌద్ధమతం పుట్టడానికి అవకాశం కల్పించింది.

వేదాల పేరుతో జరుగుతున్న ఈ అత్యాచారాలను మహాత్మా బుద్ధుడు చూసి సహించలేకపోయాడు. అతనికి సంస్కృతం రాకపోవటం వల్ల వేదాలను చదివిచూడలేకపోయాడు. బ్రాహ్మణులు చెబుతున్న మాటలే సత్యమనుకొన్నాడు. అందుచే 'హింసను ప్రేరేపించే వేదాలతో నాకు పనిలేదు. అట్టి దేవునితో కూడా నాకు పనిలేదు' అన్నాడు. అహింసయే పరమ ధర్మమని ప్రచారంచేసాడు.

బ్రాహ్మణుల అత్యాచారాలతో విసిగిపోయిన ప్రజలకు బుద్ధుని మాటలే సత్యమనిపించాయి. లక్షలకొలది జనులు బౌద్ధమతాన్ని స్వీకరించారు. కొంతకాలం తర్వాత జైనమతం ప్రచారంలోకి వచ్చింది. బౌద్ధ జైన మతాలు రెండూ నాస్తికమతాలే. వారు పరమేశ్వరు నంగీకరించరు. కాని, పరమేశ్వరుని స్థానంలో వారి గురువులను కూర్చుండబెట్టి పూజిస్తారు. ముఖ్యంగా జైనులు వారి పారసనాథాది తీర్థంకరుల (గురుదేవుల) విగ్రహాలను నిర్మించి వాటికి గుళ్ళుకట్టి పూజించ నారంభించారు. అట్టహాసంగా జరిగే ఈ పూజలు చూడటానికి సామాన్య ప్రజలు ఎగబడేవారు. వీరంతా ఎక్కడ జైనమతంలో కలిసిపోతారో నని బ్రాహ్మణులు కొన్ని దేవతామూర్తులను నిర్మించి గుళ్ళుకట్టారు. ఆ మూర్తులకు ధూప దీప నైవేద్యాలతో పూజలు చేయడం ప్రారంభించారు. ఒక్కొక్క మూర్తికి ఒక్కొక్క పురాణం వ్రాసి అవి అన్నీ వేదవ్యాసులవారు వ్రాసినవే నని ప్రచారం చేసారు. దానితో కొంత జనప్రవాహం ఇటు

మరలింది. ఈ విధంగా వేదమతంలో విగ్రహారాధన ప్రవేశించింది. ఏకేశ్వరుని స్థానంలో అనేకేశ్వరుల కల్పన జరిగింది. క్రమంగా ప్రజలు మందిరాలకు వెళ్ళి విగ్రహాలను పూజించ నారంభించారు. అనతి కాలంలోనే మూర్తిపూజ కర్మకాండలో ముఖ్యభాగమైపోయింది.

జైనులలో కొంత సహనం, అహింసావ్రతం ఉండేవి. కాని, వారు వేద విరోధులు. వైదిక ధర్మాన్ని నాశనం చేయ్యాలని ఎన్నో కుట్రలు పన్నారు. వేదాలపై ఎన్నో ఆక్షేపణలు చేసారు. ముఖ్యంగా వేదాలలో అశ్లీలగాథలు, హింసా ఉన్నాయన్నారు. బ్రాహ్మణులపై ఎక్కువగాను, క్షత్రియ వైశ్యులపై కొద్దిగాను పక్షపాతం చూపి శూద్రులను కించ పరచిందన్నారు. వేదాలలో ఏకేశ్వరోపాసన లేదని, బహుదేవతల కల్పన ఉందని ప్రచారం చేసారు. అంతటితో ఆగక ఋషులు వ్రాసిన అనేక వైదిక గ్రంథాలను కాల్చి భస్మం చేసారు. దీనివల్ల వైదిక కర్మకాండకు, వర్ణాశ్రమ వ్యవస్థకు తీరని నష్టం జరిగింది. బౌద్ధులు, జైనులు అనేక నాస్తిక దర్శనాలను రచించి ప్రజలను ఆధ్యాత్మికాంధకారంలో పడవేసారు.

ఈ విధంగా జైనమతం సుమారు 300 సంవత్సరాలు ఆర్యావర్తాన్ని (భారతదేశాన్ని) పాలించింది.

అనంతరం మహామేధావి, తపస్వి, యోగి అయిన స్వామి శంకరాచార్యులవారు ఉద్భవించారు. సుమారు రెండువేల రెండువందల సంవత్సరాలకు పూర్వం దక్షిణ భారతదేశంలోని కేరళలో వీరు జన్మించారు. సాంప్రదాయక ద్రవిడ బ్రాహ్మణ వర్ణంలో జన్మించిన వీరు బ్రహ్మచర్యాశ్రమాన్ని చక్కగా పాలించి వ్యాకరణాది సమస్త వైదిక శాస్త్రాలను చదివారు. అప్పటి దేశ పరిస్థితిని, వైదిక మత దుస్థితిని చూసి చాలా విచారించారు. సత్యమైన ఆస్తిక వేదమతం అంతరించి బౌద్ధ జైన నాస్తిక మతాల

వ్యాప్తివల్ల లోకానికి చాలా నష్టం కలిగిందని బాధపడ్డారు. ఈ నాస్తిక మతాలను ఏ విధంగా వెళ్ళగొట్టాలా? అని దీర్ఘంగా ఆలోచించారు. జైనమత గ్రంథాలను చదివి చూసారు. వారి కుయుక్తులు అర్థమయ్యాయి. వారిని శాస్త్రార్థాలతో ఓడించి పారద్రోలాలని నిశ్చయించుకొన్నారు. ఉజ్జయినీ నగరానికి చేరుకున్నారు.

అప్పుడు ఉజ్జయనీ నగరాన్ని జైనమతానుయాయియైన సుధన్వుడు పరిపాలించేవాడు. అతడు జైనధర్మగ్రంథాలనే గాక సంస్కృతాన్ని కూడా చదువుకొన్నవాడు. అందువల్ల అతనిలో కొంత విద్యా వివేకాలుండేవి. శ్రీ శంకరాచార్యులవారు వారిని కలుసుకొని "ఓ రాజా ! మీ జైన పండితులను పిలిపించి నాతో శాస్త్రార్థం చేయించండి. దానివల్ల సత్యాసత్యాలు తెలుస్తాయి. అప్పుడు జైనమతం సత్యమైనదని తేలితే నేను వైదికధర్మాన్ని వదలి జైనమతంలోకి వస్తాను. ఒకవేళ వైదికమతమే సత్యమైనదని వెల్లడయితే మీరు వైదికమతంలోకి రండి" అని ప్రస్తావించారు. రాజులో కొంత విద్యాగంధం ఉండటంవల్ల ఈ ప్రస్తావన అతనికి నచ్చింది. అతనిలో చాలాకాలంగా సత్య జిజ్ఞాస ఉండేది. అందుచే ఇది చక్కని అవకాశంగా భావించి మహాసంతోషంతో "మీరు సూచించినట్లు శాస్త్రార్థం చేయించి సత్యాసత్యనిర్ణయం చేస్తా"నన్నాడు. దూరదూర ప్రాంతాలనుండి జైన పండితులను పిలిపించి సభ ఏర్పాటు చేసాడు.

ఆ శాస్త్రార్థసభలో శ్రీ శంకరాచార్యులవారి పక్షం వేదమత స్థాపన, జైనమత ఖండనము. జైనపండితుల పక్షం స్వమతస్థాపన, వేదమత ఖండన. ఈ శాస్త్రార్థం చాలా దినాలు జరిగింది. చివరికి జైన పండితులు ఓడిపోయారు. శంకరాచార్యులవారికే విజయం లభించింది. అందుచే శాస్త్రార్థనియమాన్ని అనుసరించి సుధన్వమహారాజు మరియు జైన

పండితులు వారి జైనమతాన్ని విడిచిపెట్టి వేదమతాన్ని స్వీకరించారు. దానితో దేశమంతా పెద్ద అల్లకల్లోలం చెలరేగింది. ప్రజలలో సత్యజిజ్ఞాస పెరిగింది. అప్పుడు సుధన్వరాజు తన మిత్రులకు, మిగిలిన రాజులకు ఉత్తరాలు వ్రాసి, శంకరాచార్యులవారితో శాస్త్రార్థ సభలను ఏర్పాటు చేసారు. అంతటా శ్రీ శంకరులనే విజయం వరించింది. జైనులు ఓడిపోయారు. సుధన్వుడు మొదలైన రాజులు శంకరాచార్యులవారు దేశసంచారం చేస్తూ ప్రచారం చేసుకోవడానికి ఏర్పాట్లు చేసారు. సంరక్షణకొరకు పరిచారకుల నేర్పాటు చేసారు. సుమారు 10 సంవత్సరాలు దేశమంతా తిరిగి శ్రీ శంకరాచార్యుల వారు వేదమత ప్రచారం చేసారు.

ఆనాడు ధనం పుష్కలంగా ఉండటంచేత అనతికాలంలోనే వేదమతం విస్తరించింది. ఆ కాలంలో బౌద్ధ జైన మతాలేకాక శాక్త పాశుపత కాపాలికాది అనేక పాఖండమతాలుండేవి.

**శాక్తైః పాశుపతైరపి క్షపణకైః కాపాలికై ర్వైష్ణవై రన్యై రప్యఖిలైః ఖలు ఖలైర్దుర్వాది భిర్వైదికమ్ । మార్గం రక్షితుముగ్రవాది విజయం మానహతోర్వ్యథాత్.**

**- (శంకర విజయం సర్గ. 15-శ్లో 65)**

వాటి నన్నిటిని ఖండించి శ్రీ శంకరాచార్యులవారు వేదమతాన్ని స్థాపించారు. అందరిచేత యజ్ఞోపవీతధారణ చేయించి వేదాధ్యయనం చేయ ప్రోత్సహించారు. రాజుల సహకారంతో జైన మందిరాలలోనే వేదపాఠశాలలు స్థాపించాలనుకొన్నారు. ఇంతలోనే యిద్దరు కపట జైన మునులు వేదమతం స్వీకరించినట్లు నటిస్తూ కపటభక్తితో శంకరాచార్యులకు ప్రేమపాత్రులయ్యారు. సమయంచూసి విషయుక్త ఆహారం వారిచే తినిపించారు. దానితో వారికి ఆకలి మందగించి శరీరమంతా వ్రణాలు

పుట్టాయి. శరీరం నిర్వీర్యమైపోయింది. అంత వారు శరీరాన్ని త్యజించారు. దానితో అందరు నిరుత్సాహులైపోయారు. వేదప్రచారం నిలిచిపోయింది.

శ్రీ శంకరాచార్యులవారు జైనమత ఖండనకొరకే అద్వైత సిద్ధాంతాన్ని ప్రతిపాదించి ఉండవచ్చు. అది వారి నిశ్చిత సిద్ధాంతము కాకపోవచ్చు. వేదపాఠశాలలు ప్రారంభించకముందే వారు దివంగతులు కావడం విచారకరం.

శ్రీ శంకరాచార్యులవారి అనంతరం వారి శిష్యులకు మహంతు పదువులు లభించి శ్రీమంతులయ్యారు. సన్మానాలు పొందారు. కాని వేదాల పునరుద్ధరణకు పాటుపడలేదు. వారు అద్వైత మతవ్యాప్తికి మాత్రమే కృషిచేసారు.

అద్వైతం శ్రీశంకరుల నిశ్చిత మతమైతే అది వేద సమ్మతం కాదు - అని మహర్షి దయానందులవారు అన్నారు. అనేక శాస్త్రీయ ప్రమాణాలతో, యుక్తి ప్రమాణాలతో అద్వైత సిద్ధాంతంలోని లోపాలను వివేచించి చూపారు. వాటిని వివరంగా తెలిసికోగోరువారు మహర్షి వ్రాసిన 'సత్యార్థ ప్రకాశం' చదువగోరుచున్నాము.

మరికొన్ని ఇతిహాసాన్ని గురించిన దయానంద మహర్షి అభిప్రాయాలను తదుపరి ప్రకరణాలలో తెలిసికొందాము.

196 కోట్ల సంవత్సరాల మన యితిహాసం చాలవారకు విదేశీయుల ద్వేషాగ్నికి ఆహుతైపోయింది. మిగిలిన ఇతిహాసాన్ని కూడా పూర్తిగా వ్రాయటం కష్టమే. అందుచే ప్రాచీన యితిహాసంలోని ముఖ్యమైన సంఘటనలను ఒక క్రమంలో తెలుసుకునే ప్రయత్నం చేద్దాము.

# ఇతిహాసంలోని కొన్ని ముఖ్య ఘటనలు

మన ప్రాచీన ఇతిహాసానికి మూలం బ్రాహ్మణ ఆరణ్యక గ్రంథాలు. వీటినే ఇతిహాసం, పురాణం, కల్పం, గాథా, నారశంసీ అనే పేర్లతో మన గ్రంథాలలో పేర్కొనటం జరిగింది.

బ్రాహ్మణానీతిహాసాన్ పురాణాని కల్పాన్ గాథా నారశంసీరితి'

(తై. ఆ. 2-9)

బ్రాహ్మణాని కల్పాన్ గాథా నారశంసీరితిహాస పురాణానీతి'

(అశ్వలాయన గృహ్యసూత్రాలు. 3-3-1)

నేడు ప్రచారంలో ఉన్న 18 పురాణాలు కల్పితాలు. జైన మతం ఉచ్ఛస్థితిలో ఉన్నపుడు కూడా బ్రహ్మ వైవర్త పురాణం, వాయుపురాణం మాత్రమే ఉండేవి. అనంతరమే మిగిలిన పురాణాలు కల్పించబడ్డాయి. కనుక యివి వేదవ్యాసులవారు వ్రాసినవి కావు. కనుక, ఏవిధంగానైతే మనం మన దర్శన ఉపనిషదాదులకు వేదాన్ని పరమ ప్రమాణంగా నమ్ముతామో, అట్లే మన ఇతిహాసానికి పై అయిదు బ్రాహ్మణాది గ్రంథాలను పరమ ప్రమాణంగా స్వీకరించాలి. వీటితోబాటు మహర్షి వాల్మీకి వ్రాసిన రామాయణాన్ని, మహర్షి వేదవ్యాసులవారు వ్రాసిన మహాభారతాన్ని ప్రమాణంగా స్వీకరించాలి. అయితే వీటిలో చాలా ప్రక్షిప్తాలు చేర్చబడ్డాయి. కనుక తర్కంతో వాటిని వేరు చేయాలి. ఆలంకారిక కథలలోని సారాంశాన్ని గ్రహించాలి. అంతేకాని, ఆ కథలు ఇతిహాసం కాదని కొట్టిపారవేయ కూడదు.

## హిరణ్యకశిపుడు

దక్ష ప్రజాపతి, అతని ధర్మపత్ని శతరూపా కూడా బ్రహ్మయొక్క సంతానంగా చెప్పబడ్డారు. అయితే వీరిద్దరు అమైథునీయ సృష్టిలోనివారే.

ఇచట బ్రహ్మ అంటే ఒక వ్యక్తికాదు. సృష్ట్యాదిలో పరమేశ్వరునిచే ఆవిర్భవింపబడిన సృష్టిరచనా శక్తి (క్రియేటివ్ ఫోర్స్). ఈ శక్తియే ప్రకృతిలోని తత్త్వాలను కలిపి అండాలను నిర్మించింది. ఆ అండాలలో ఆదిమానవులు యువావస్థవరకు ఎదిగి బయటకు వచ్చారు. దక్షప్రజాపతి, శతరూపాలు అట్టివారే. వీరిద్దరితోనే మైథున సృష్టి ప్రారంభమయ్యింది. వీరికి 50 మంది కుమార్తెలు, కొందరు కుమారులు కలిగారు. కుమారులంతా వైరాగ్య సంపన్నులు కావటంవల్ల వివాహం చేసుకోలేదు. భగవద్ధ్యానంలో గడపటానికి వనాలకు వెళ్ళిపోయారు.

శతరూపా దక్షుల 50మంది కుమార్తెలు సర్వాంగసుందరులు. వారినే పుత్రులుగా భావించి ఆ దంపతులు ప్రేమానురాగలతో పెంచి పెద్ద చేసారు. వారిలో పదిమంది కన్యల వివాహం ధర్మునితో జరిపించారు. 27 మందిని మరీచి పుత్రుడైన కశ్యపునికి యిచ్చి వివాహం జరిపించారు.

శతరూపాగురించి 2, 3 కథలు ప్రచారంలో ఉన్నాయి. మనం ఆదిమానవసృష్టి ప్రకరణంలో తెలుసుకున్నట్లుగా శతరూపాకు ఆకూతి, దేవహూతి, ప్రసూతి అను ముగ్గురు పుత్రిక లున్నారు. వారిలోని ప్రసూతి వివాహం దక్షప్రజాపతితో జరిగింది. వీరిద్దరికి 13 మంది పుత్రికలు పుట్టారు.

రెండవ కథ : బ్రహ్మయొక్క పుత్రిక శతరూపా. ఆమె తండ్రియైన బ్రహ్మనే కామించింది. ఫలితంగా స్వాయంభువ మనువు జన్మించాడు.

మూడవ కథ : ఈ ప్రకరణంలో తెలిసికొన్నట్లుగా శతరూపా వివాహం దక్షప్రజాపతితో జరిగింది. వారిద్దరికి 50 మంది పుత్రికలు కలిగారు. ఈ మూడు కథలను పరిశీలించి చూస్తే శతరూపా ఒక స్త్రీ కాకపోవచ్చు. బ్రాహ్మీశక్తినుండి జనించిన ఒక దివ్య ప్రాకృతిక శక్తి కావచ్చు. మన ప్రాచీన యితిహాసశైలి ననుసరించి కథగా కల్పన చేసి ఉండవచ్చు.

మరీచీ పుత్రుడైన కశ్యపుడు కూడా అమైథునీయ దివ్యసృష్టి నుండి ఉద్భవించినవాడే నని కొన్ని గ్రంథాలలో చెప్పబడింది. ఋగ్వేద దశమ మండలంలోని 18వ సూక్తంలో (10 నుండి 13 వరకు గల మంత్రాలలో) అమైథున సృష్టిని గురించిన కొన్ని సంకేతాలు కనబతాయి. ఆదిమానవులకు, మిగిలిన ప్రాణులకు భూమియే తల్లిగర్భాశయంగా ఉండి పాలించి పోషించి పెద్ద చేసిందనే భావం ఆ మంత్రాలలో కనబడుతున్నది. అథర్వవేద (18-3-49, 50, 51) మంత్రాలలో కూడా యిట్టి భావమే ఉంది. వీటిని గురించి ఆలోచించవలసిఉంది. ఏమైనను ఆలంకారిక రూపంలో చెప్పబడిన ఈ అమైథునీయ దివ్యసృష్టి మన బుద్ధికి అందటం లేదు. కశ్యపునితోనే మైథునీయ మానవ సృష్టి ప్రారంభమైనట్లు గ్రహించాలి.

కశ్యపునితో వివాహం జరిగిన కన్యల పేర్లు ఈ విధంగా ఉన్నాయి. అదితి, దితి, దను, కాలా, దనాయు, సింహికా, క్రూరా, ప్రాధా, విశ్వా, వినితా, కపిలా, ముని, కదు.

వీరిలో అదితికి 12 మంది పుత్రులు పుట్టారు. వారి పేర్లు - ధాతా, మిత్ర, అర్యమా, ఇన్ద్ర, వరుణ, అంశ, భగ, వివస్వాన్, పూషా, సవితా, త్వష్టా మరియు విష్ణు

కాలాంతరంలో వీరిలోని ఇంద్రుడు దేవతలకు రాజయ్యాడు. విష్ణువు గొప్ప యోద్ధుడయ్యాడు. ఎప్పుడెప్పుడు ఎక్కడెక్కడ దేవతలకు విపత్తు కలుగుతుందో అక్కడ విష్ణువు యుద్ధంచేసి విజయాన్ని కలిగించేవాడు. ఇంద్రుడు రాచకార్యనిర్వహణలో నిపుణుడు. అందుచే అతనిని దేవరాజ్యానికి రాజును చేసారు. అతడు దేవరాజుగా, దేవేంద్రుడుగా ప్రసిద్ధిని పొందాడు.

కశ్యపుని రెండవ పత్ని దితికి యిద్దరు కుమారులు కలిగారు.

వారి పేర్లు హిరణ్యకశిపుడు, హిరణ్యాక్షుడు. వీరిద్దరు దైత్యులయ్యారు. హిరణ్యకశిపునకు అయిదుగురు పుత్రులు కలిగారు. వారి పేర్లు - ప్రహ్లాద్, సంహ్లాద్, అనుహ్లాద్, శివి, వాష్కల్.

హిరణ్యకశిపుని జన్మ వృత్తాంతాన్ని గురించి ఒక కథ ప్రచారంలో ఉంది - దితికి సంతానాన్ని కనాలనే కోరిక లేకుండేది. చాలా కాలం ఆమె నిస్సంతానురాలుగానే ఉండిపోయింది. ఉన్నట్లుండి ఒక రోజు ఆమెలో తీవ్రమైన కామేచ్ఛ కలిగింది. వెంటనే పతివద్దకు వెళ్ళి తన కోరికను ప్రకటించింది. అప్పుడు కశ్యపుడు సాయంకాల అగ్నిహోత్రం చేస్తున్నాడు. ఇది సమయం కాదు మరొక సమయంలో రమ్మన్నాడు. అందుకు దితి చాలా ఆగ్రహం చెంది నిందించింది. అంత కశ్యపుడు వివశుడై ఆమె కోరిక నెరవేర్చాడు. ఆమె గర్భవతి అయ్యిందికాని అనుపయుక్త సమయంలో గర్భధారణ చెయ్యటం వల్ల ఆమెకు దుష్ట ప్రవృత్తిగల పుత్రుడు పుట్టాడు. అతడే హిరణ్యకశిపుడు.

హిరణ్యకశిపుడు పెరిగి పెద్దవాడయ్యేకొలది అతనిలో దుష్టత, క్రూరత పెరిగి పెద్దవయ్యాయి. మహా బలవంతుడు కావటంవల్ల తన కొక రాజ్యాన్ని నిర్మించుకున్నాడు. దానితో అభిమాన అహంకారాలు పెరిగి తారాస్థాయికి చేరుకున్నాయి. కొంతకాలానికి -

**"ఈశ్వరో ౽హమహం భోగీ సిద్ధో ౽ హం బలవాన్ సుఖీ -** నేనే ఈశ్వరుడను. ఈ సమస్తము నాదే - నా కొఱకే. నేను సిద్ధుడను. పరమ సుఖాలన్నీ నాకే లభించాలి" అనే విపరీత బుద్ధి పుట్టింది. దానితో అతడు అందరికి కష్టాలను కలిగించసాగాడు. తాను కోరింది దోచుకొని అనుభవించాడు.

ఇతని తమ్ముడు హిరణ్యాక్షుడు కూడా యిట్టి దుష్టప్రవృత్తి

గలవాడే. వీరిద్దరు కలిసి అనేక దుష్కార్యాలు చేసారు. హిరణ్యాక్షుడయితే పెద్ద భూభాగాన్ని అక్రమంగా ఆక్రమించుకొని తనవశం చేసుకున్నాడు. అందలి ప్రజలను నానా హింసలు పెట్టాడు. అప్పుడు ప్రజలంతా మహా యోధుడైన విష్ణువు దగ్గరకు వెళ్ళి తమను రక్షించమని మొరపెట్టుకున్నారు. అంత విష్ణువు హిరణ్యాక్షునకు ఎన్నో విధాల నచ్చచెప్ప చూసాడు. అధర్మంగా భూమిని ఆక్రమించి ప్రజలను బాధించటం మంచిది కాదని హితవు చెప్పాడు. కాని, హిరణ్యాక్షుడు మారకపోగా విష్ణువు వద్దకు వెళ్ళి తనపై ఫిర్యాదు చేసినందుకు ప్రజలును మరింత హింసిచ సాగాడు. అప్పుడు విష్ణువు చేసేదిలేక హిరణ్యాక్షుడు తన పినతల్లి దితి యొక్క కుమారుడే అయినా సంహరించాడు.

ఆ విశాల భూంభాగాన్ని అతని బంధం నుండి విడిపించాడు. బంధుత్వంకన్న ధర్మానికే ప్రాధాన్యత నిచ్చాడు.

దీనితో హిరణ్యకశిపునకు చాలా ఆగ్రహం కలిగింది. అయినా విష్ణువు తనపెద్దతల్లి అదితియొక్క కుమారుడు కావటంవల్ల అతనిపై ప్రత్యక్షంగా యుద్ధానికి వెళ్ళలేదు. అతనిని మరొక రకంగా చంపటానికి ఎత్తులు పన్నటం ప్రారంభించాడు. ప్రత్యక్ష యుద్ధానికి వెళ్ళకపోవడానికి మరొక కారణం కూడా ఉంది. తన పెద్ద కుమారుడు ప్రహ్లాదుడు, ప్రజలు కూడా విష్ణువు చేసింది మంచిపనే అన్నారు. ధర్మానికే విజయం లభించిందన్నారు. అన్యాయం, అధర్మం ఎప్పటికైనా నశించి పోతుందన్నారు. దానితో హిరణ్యకశిపుడు వెనుకంజవేసాడు. ఏదైనా ఎత్తుపన్ని విష్ణువును చంపాలను కున్నాడు.

ప్రహ్లాదుని ప్రవృత్తి దీనికి పూర్తిగా భిన్నం అతడు గర్భంలో ఉన్నప్పుడే హిరణ్యకశిపుడు తపస్సు చేయడానికి వనాలకు వెళ్ళాడు.

సాధనచేసి విశేషబలాన్ని పొంది, భూమండలాన్నంతా తన వశం చేసుకోవాలని అతని కోరిక. ఆ సమయంలో ప్రహ్లాదుడు పుట్టాడు. హిరణ్యకశిపుడు ఇంట లేనందున నవజాత శిశువుని తీసుకొని ప్రహ్లాదుని తల్లి జపధ్యానాలలో ప్రశాంతంగా గడపాలని, నారదమహర్షి ఆశ్రమానికి చేరుకుంది. అందుచే ప్రహ్లాదుని బాల్యం నారదమహర్షి ఆశ్రమంలో గడచింది. అక్కడి సత్సాంగత్యం వల్ల, ఉపదేశాలవల్ల ప్రహ్లాదుడు పరమేశ్వర భక్తు డయ్యాడు.

హిరణ్యకశిపుడు సాధనా తపస్సులద్వారా అపార బలాన్ని పొంది రాజ్యానికి తిరిగివచ్చాడు. ఈ విషయం తెలిసి ప్రహ్లాదుని తల్లి బాబుని తీసుకొని రాజప్రసాదం చేరుకుంది. పెరిగిన పరిసరాల ప్రభావం వల్ల, నారదమహర్షి ఉపదేశాలవల్ల ప్రహ్లాదునిలో ధర్మప్రియత అధర్మఖండన ప్రవృత్తిగా పెరిగాయి. తండ్రి చేసే దుశ్చేష్టలను ఖండిస్తూ, బాధితులపట్ల సానుభూతిని ప్రకటించేవాడు. విష్ణువు హిరణ్యాక్షుని చంపినప్పుడు కూడా దుర్మార్గునికి తగిన దండనే జరిగిందని భావించాడు. ఆక్రమిత భూభాగాన్ని విముక్తి గావించి ప్రజలకు మేలుచేసెనని విష్ణువును ప్రశంసించాడు. ప్రహ్లాదుని ఈ ప్రవృత్తి తండ్రికి నచ్చలేదు. విష్ణువు మనకు విరోధి శత్రువు నని అనేక విధాల నచ్చచెప్ప ప్రయత్నించాడు. కాని, ప్రహ్లాదుడు వినలేదు.

ప్రహ్లాదుని సమాధాన మేమంటే – లోకంలో రెండే రెండు పక్షాలుంటాయి. ఒకటి ధర్మం, రెండవది అధర్మం. తల్లి–తండ్రి, సోదర–సోదరీ, రాజ – ప్రజా సంబంధాలు వాటి ముందు లెక్కకు రావు. పరమేశ్వరుడు ధర్మప్రియుడు కనుక నేను పరమేశ్వరుని పక్షంలో, ధర్మపక్షంలో ఉంటానని స్పష్టంగా చెప్పాడు. దానికి హిరణ్యకశిపుడు

ఆగ్రహం చెంది "నన్ను మించిన బలవంతులు లోకంలో మరెవ్వరూ లేరు. నేను ఈ దేశానికి రాజును. నేనే ఈశ్వరుడను. నేను ఆదేశించినదే ధర్మం. కనుక నీవు నా పక్షంలో ఉండవలసిందే" అని ఆదేశించాడు. అయినా ప్రహ్లాదునిలో మార్పు రాలేదు.

పరమేశ్వరుడు సర్వవ్యాపకుడని, సర్వాంతర్యామియని, న్యాయ కారియని, ధర్మాత్ములను రక్షించి దుర్మార్గులను దండిస్తాడని ప్రహ్లాదుడు ప్రజలలో ప్రచారం చేయటం ప్రారంభించాడు. ప్రజలు ప్రహ్లాదునిలోని ధార్మికతను, ధర్మప్రియతను గుర్తించారు. అయినా హిరణ్యకశిపునికి భయపడి మౌనంగా ఉండిపోయారు.

ఒకరోజు ప్రహ్లాదుని గురువు ఒక ఆరోపణ తీసుకొని హిరణ్యకశిపుని వద్దకు వచ్చాడు. ప్రహ్లాదుడు పాఠశాలలోని విద్యార్థులలో విప్లవం తీసకువస్తున్నాడనీ, పాఠశాలలో విద్యార్థులు తన మాట వినటంలేదనీ, రాజు దుష్టుడనీ నాసిక్తుడనీ ప్రచారం చేస్తున్నాడని- అతని ఆరోపణ.

ప్రహ్లాదుని పిలిచి అడుగగా నేను సత్యమని నమ్మినదానినే ప్రచారం చేస్తున్నానని సమాధాన మిచ్చాడు.

అంత హిరణ్యకశిపుడు క్రోధితుడై కఠినమైన దండన విధించాడు.

"మూడు రోజులు గడువు ఇస్తున్నాను. ఈలోపున మనసు మార్చుకుని నన్ను ఈశ్వరునిగా అంగీకరించి నా ఆజ్ఞానుబద్ధుడైతే సరేసరి. లేకున్న ఏ మాత్రం దయతలచకుండా బాగా కాలిన యినుపస్తంభానికి ప్రహ్లాదుని కట్టివేయండి" అని ఆజ్ఞాపించాడు.

విష్ణువుకు ఈ వార్త తెలిసి హిరణ్యకశిపుని నగరానికి చేరుకున్నాడు. ప్రహ్లాదుని రక్షించడానికి ప్రజలను సంఘటితపరచ నారంభించాడు. విష్ణువు హిరణ్యకశిపునికంటె ఎక్కువ బలవంతుడు కాకపోయినా తక్కువ వాడు

కాదని ప్రజలు గుర్తించారు. ఇంతేకాక, హిరణ్యాక్షుని ద్వంద్వయుద్ధంలో విష్ణువు ఒక్కడే సంహరించిన విషయంకూడా ప్రజలకు తెలుసు. కనుక ప్రజలు ఇది ఒక మంచి అవకాశంగా భావించి విష్ణువు చెప్పినట్లు చెయ్యడానికి, సహకరించడానికి స్వచ్ఛందంగా ఒప్పుకొన్నారు. ఉత్సాహంగా ప్రహ్లాదుని రక్షించడానికి సిద్ధమయ్యారు.

మూడురోజులు గడచినా ప్రహ్లాదుడు హిరణ్యకశిపుని సర్వేశ్వరునిగా అంగీకరించలేదు. ఇంతవరకు చేసినది ఇప్పుడు చేస్తున్నదికూడా అన్యాయమని అధర్మమని ఘోషించాడు. దండన నిశ్చితమైన రోజున హిరణ్యకశిపుడు సార్వజనిక సభను ఏర్పాటు చేసాడు. ప్రహ్లాదునిపై ఆరోపణలను వినిపించాడు. అగ్నిని జ్వలింపజేసి ఒక ఇనుప స్తంభాన్ని బాగా కాల్పించాడు. ప్రహ్లాదుని ఆ స్తంభానికి కట్టివేయమని ఆజ్ఞాపించాడు.

ఈ ఆజ్ఞకు ప్రహ్లాదుడు ఏమీ భయపడలేదు. విచారించలేదు. ప్రసన్నంగానే అందుకు తయారయ్యాడు. ఇంతలో విష్ణువు పెద్ద జన సమూహంతో అక్కడకు వచ్చాడు. "ఓ హిరణ్యకశిపుడా!' నేనే అందరికన్న బలవంతుడనని గర్విస్తున్నావు కదా ! చేతనైతే నాతో ద్వంద్వ యుద్ధం చేయు"మన్నాడు. నేను నరసింహుడను (నరులలో సింహమువంటివాడను) అన్నాడు.

ఈ హఠాత్ పరిణామానికి హిరణ్యకశిపుడు ఆశ్చర్యచకితుడయ్యాడు. ప్రజలను, తన సైనికులను ఒకసారి పరికించి చూసాడు. అందరూ ప్రహ్లాదునిపైననే సానుభూతిగా ఉన్నట్లు గ్రహించాడు. చేసేదిలేక విష్ణువుతో ద్వంద్వయుద్ధానికి తలపడ్డాడు. ఆ భీకరపోరులో చివరికి హిరణ్యకశిపుడు నరసింహుని (విష్ణుని) చేతిలో హతుడయ్యాడు. ప్రజలంతా సంతుష్టులయ్యారు.

అనంతరం విష్ణువు ప్రహ్లాదుని ఆ ప్రాంతానికి రాజుగా చేసి తన వైకుంఠానికి (హిమాలయాలలోని తన ప్రాంతానికి) తిరిగి వెళ్ళిపోయాడు.

ఈ చారిత్రిక కథనుండి మనం గ్రహించవలసిందేమంటే - ప్రహ్లాదుని కాలంనాటికే భూమిపై జనసంఖ్య బాగా పెరిగింది. ప్రజలు గంగాసింధుమైదానానికి వచ్చి భూమిని వ్యవసాయానికి అనుకూలంగా మార్చుకుని జీవిస్తున్నారు. అట్టి విశాల భూభాగాన్ని అన్యాయంగా ఆక్రమించుకొని హిరణ్యాక్షుడు తానే స్వామినని ప్రకటించుకొన్నాడు. ప్రజలు కష్టించి పండించుకున్న దానిని దోచుకుని అనుభవించాడు. అప్పుడు ప్రజలు ఆనాటి మహాయోధుడైన విష్ణువు వద్దకు వెళ్ళి మొర పెట్టుకున్నారు. విష్ణువు ఆ హిరణ్యాక్షుని ద్వంద్వయుద్ధంలో సంహరించి ఆక్రమిత భూమిని విడిపించి ప్రజలకందించాడు.

ఇట్టి చారిత్రిక కథను వికృతపరచి పౌరాణికులు విష్ణువును దేవుని చేయటానికి ఒక పౌరాణిక కథను కల్పించారు. విష్ణువు వరాహావతారం ఎత్తి భూమిని చాపచుట్టగా చుట్టి ఎత్తుకుపోతున్న హిరణ్యాక్షున్ని చంపారన్నారు. అట్లే హిరణ్యకశిపుని కథకు నరసింహావతారాన్ని కల్పించారు.

హిరణ్యాక్ష హిరణ్యకశిపుల కాలంనాటికి జనసంఖ్య పెరిగిందే కాని యింకా రాజ్యవ్యవస్థ నిర్మాణం కాలేదు. అప్పటికి జనులలో చాలావరకు సాత్త్విక ప్రవృత్తే ఉండేది. అప్పుడు

న వై రాజ్యం న రాజా ఽ ఽ సీన్న చ దండో న దాండికః ।
ధర్మేణైవ ప్రజాః సర్వా రక్షన్తి స్మ పరస్పరమ్ ॥

రాజ్యం లేదు. రాజూ లేడు. దండనవిధానం లేదు. దండించేవాడూ లేడు. అప్పుడు సమస్త ప్రజలు ధర్మంద్వారానే పరస్పరం

రక్షించుకొనేవారు. అట్టి సమయంలో దుష్టులైన హిరణ్యాక్ష హిరణ్యకశిపులు తమ స్వార్థంకోసం కొందరు అనుచరులను, సేవకులను తయారుచేసుకొని ప్రజలను పీడించారు. ఆ కారణంచేత విష్ణువు వంటి మహాపురుషులు సంఘటన తయారుచేసుకొని దుష్టులను ఎదుర్కొనవలసి వచ్చింది.

## మహారాజు పృథు

కాలక్రమంలో జనసంఖ్య బాగా పెరిగింది. దానితోబాటు జలం నుండి మరికొంత భూభాగం బయటకు వచ్చింది. క్రమంగా బ్రహ్మయొక్క సంతతి దూరదూర ప్రాంతాలకు వెళ్ళి నివసించసాగారు. ఏ వేగంతో జనసంఖ్య పెరిగిందో అంత వేగంగా వేదప్రచారం సాగలేదు. అందరికీ వేదజ్ఞానాన్ని అందుకునే సామర్థ్యంకూడా అప్పటికి కలగలేదు. పూర్వజన్మ సంస్కారాలు కలిగిన మానవులలో సహజంగానే ధర్మాధర్మాల, కర్తవ్యాకర్తవ్యాల, భక్ష్యాభక్ష్యాల మిమాంస కలుగుతుంది. అంటే ఏది ధర్మం? ఏది అధర్మం? ఏది చేయతగినది ? ఏది చేయకూడనిది? ఏది తినదగినది? ఏది తినకూడనిది? మొదలైన విషయాల చర్చ కలిగింది. దీనికితోడు జనసంఖ్యకు తగినంత ఆహారోత్పత్తి జరగలేదు. దానితో బలవంతులు బలహీనులను దోచుకొని తినటం మొదలయింది. ఎక్కువ బలవంతులు ముఠాలను తయారుచేసుకుని బలహీనులను పీడించటం ప్రారంభించారు.

అప్పుడు సత్పురుషులు కొందరు బ్రహ్మను సమీపించి తమ తమ కష్టాలను, ధర్మసందేహాలను చెప్పుకున్నారు. ఇచట బ్రహ్మ అంటే ముందు చెప్పుకున్న బ్రాహ్మీశక్తి (క్రియేటివ్ ఫోర్స్) కాదు. బ్రాహ్మీశక్తి కేవలం ఆదిమానవులను, ఆది పశుపక్షి క్రిమికీటకాదులను అమైథునంగా సృష్టిస్తుంది. ఆ శక్తి సృష్ట్యాదిలో కొంతకాలం మాత్రమే పనిచేస్తుంది. ఆ

తరువాత మైథున సృష్టి పనిచేయటం ప్రారంభిస్తుంది. ఇక్కడ బ్రహ్మ అంటే ఈశ్వరీయ జ్ఞానమైన నాలుగువేదాలను అధ్యయనంచేసి ధారణ చేసిన గొప్ప విద్వాంసుడు. వేదజ్ఞానాన్ని వివరించి చెప్పగల సమర్థుడు. ఈయన పుష్కర్‌లో ఉండేవారని మహర్షి దయానంద సరస్వతి అన్నారు. ఇతనినే పౌరాణికులు చతుర్ముఖబ్రహ్మగా కల్పనచేసి పురాణాలలో వర్ణించారు. నాలుగు ముఖాలు కలిగినవాడు అంటే నాలుగు వేదాలను ధారణచేసినవాడని అర్థం చేసుకోవాలి. అట్టి బ్రహ్మకు దేవతలు తమ కష్టాలను యిబ్బందులను తెలుపగా బ్రహ్మ ఆలోచించి ఒక నీతి శాస్త్రాన్ని రచించాడు. ఈ నీతి శాస్త్రమే 'త్రివర్గ శాస్త్ర' మనే పేరుతో ప్రసిద్ధిని పొందింది. ఇది రాజ్యాంగవిధానం వంటి శాస్త్రం. దానిలో ధర్మార్థ కామములను గురించి వివరింపబడింది. వాటితోబాటు వాటిని చక్కగా అనుష్ఠింపజేయటానికి ఒక రాజ్యవ్యవస్థ ఏర్పాటు చేయాలని ఆదేశించబడింది. ఆ వ్యవస్థకు ఒక అధిపతి ఉండాలని నిర్దేశించబడింది. అట్టి పదవికి 'రాజు' అని పేరు పెట్టింది. రాజ్యనియమాలనే దండనీతిగా పేర్కొంది.

బ్రహ్మచే రచింపబడిన ఆ త్రివర్గశాస్త్రం యిప్పుడు లభించటం లేదు. దాని ఆధారంగానే మనువుచే రచింపబడిన మనుస్మృతి లభిస్తున్నది. మరికొందరు ఋషులు వ్రాసిన స్మృతులు కూడా లభిస్తున్నాయి. వాటిలో

శ్లో॥ అరాజకే హి లోకే ఽ స్మిన్సర్వతో విద్రుతే భయాత్ ।
రక్షార్థమస్య సర్వస్య రాజానమసృజత్ప్రభుః ॥
(మనుస్మృతి. 7-3)

రాజులేకున్న లోకంలో ధర్మవ్యవస్థ అస్తవ్యస్తమయ్యే భయం ఉంది. కాన, పరమేశ్వరుని వేదాజ్ఞ ననుసరించి రాజును ఏర్పాటు చేయాలి.

శ్లో॥ స రాజా పురుషో దండః స నేతా శాసితా చ సః।
చతుర్ణామాశ్రమాణాం చ ధర్మస్య ప్రతిభూః స్మృతిః ॥
(మనుస్మృతి. 7-17)

దండన విధానమే రాజు. ఆ దండనీతియే పురుషుడు. అదియే నేత (ధర్మమార్గాన నడిపేది) శాసనకర్త. అదే నాలుగు ఆశ్రమాలను రక్షిస్తుంది - అనే ఉపదేశాలున్నాయి.

బ్రహ్మ త్రివర్గశాస్త్రం రచించిన తర్వాత భద్రపురుషులు సమర్థుడైన రాజును వెతకనారంభించారు. ఆనాడు నిస్వార్థంగా పరోపకారం చేస్తూ ధార్మిక జీవితం గడుపుచున్న 'విరజా' అనే పేరుగల వ్యక్తిని రాజుగా ఎన్నుకుంటే బాగుంటుందనుకున్నారు. కాని, అతను రాజుగా ఉండటానికి అంగీకరించలేదు. సంన్యాసాశ్రమం స్వీకరించి దేశసంచారం చేస్తూ ధర్మప్రచారం చేస్తానన్నాడు.

విరజునకు కీర్తిమాన్ అనే పేరుగల ఒక పుత్రుడున్నాడు. అతనిని రాజుగాఉండమని కోరితే అతను కూడా అంగీకరించలేదు. యోగాభ్యాసంలో గడుపుతానన్నాడు. అందుచే కర్దముని పుత్రుడు అనంగుని రాజుగా చేశారు. అనంగుడు రాజ్యపాలన చేయ సమర్థుడు. దండనీతి విశారదుడు. ధర్మాత్ముడు. ఆ విధంగా అనంగుడు ఆర్యావర్తానికి మొదటి రాజయ్యాడు.

(వెనుక ప్రకరణంలో మనం మహర్షి దయానందులవారి అభిప్రాయాలు తెలుసుకున్నాము. అందు స్వాయంభువ మనువు యొక్క పుత్రుడైన మరీచి ప్రథమ క్షత్రియరాజనియు, ఆ పరంపరలో ఇక్ష్వాకుడు ఆరవరాజనియు తెలిసికోవటం జరిగింది. ఆ పరంపర స్వాయంభువ మన్వంతరానికి చెందినది. ఈ ప్రకరణంలో మనం ఏడవ మన్వంతరమైన

వైవస్వత మన్వంతరంలోని చరిత్ర తెలిసికుంటున్నాము. ముఖ్యంగా 28వ చతుర్యుగంలోని ఆదియుగం (సత్యయుగం - కృతయుగం) గురించి తెలుసుకుంటున్నామని గ్రహించవలెను.)

అనంగుని అనంతరం అతని కుమారుడు అతిబలుడు రాజయ్యాడు. ఈతని కాలంలో రాజ్యం మరికొంత విస్తరించింది. కాని క్రమంగా అతడు విషయలోలుడైపోయాడు. అందుచే ప్రజలు అసంతుష్టులయ్యారు. అతనిని గద్దె దించారు.

ఆ కాలంలో మృత్యు అనే పేరుగల ఒక వ్యక్తి ఉండేవాడు. అతనికి సునీతా అనే పేరుగల కుమార్తె ఉండేది. అట్టి సునీతా కుమారుడైన వేనుని అతిబలుని తరువాత రాజుగా చేసారు. అతడుకూడా సింహాసనంపై కూర్చున్నప్పటినుండి రాగద్వేషాలకు గురిఅయ్యాడు. ప్రజలను బాధించేవాడు. ఋషులు అతనికి అనేకవిధాల నచ్చుచెప్పిచూసారు. అయినా అతడు మారలేదు. విసిగిపోయిన ఋషులు అతనిని సంహరించినట్లుగా చరిత్రలో కనబడుతుంది. దీనినిబట్టి ఆనాడు ప్రజాస్వామ్యం ఉండేది. లేదా పక్షపాతరహితంగా న్యాయాన్ని ధర్మాన్ని ప్రబోధించే మహర్షుల నిర్ణయంపై రాజును (అధికారిని) ఎంచుకునేవారని తెలుస్తున్నది.

మహాభారతంలో వేనుని కథ విచిత్రంగా వర్ణింపబడింది.

కురుక్షేత్ర రణరగంలో భీష్మపితామహులవారు అంపశయ్యపైన పరుండి ఉత్తరాయణ రాకకోసం ఎదురుచూస్తున్నారు. ఆ సమయంలో యోగేశ్వర శ్రీకృష్ణుని ప్రేరణవల్ల యుధిష్ఠిరుడు (ధర్మరాజు) రాజనీతిని గురించి ఉపదేశం పొందడానికి భీష్ములవారిదగ్గరకు వస్తాడు. రాజనీతిని గురించిన ఎన్నెన్నో విషయాలు తెలుసుకుంటాడు. ఆ సందర్భంలో యుధిష్ఠిరుడు -

**య ఏష రాజన్ రాజేతి శబ్దశ్చారతి భారత ।**

**కథమేష సముత్పన్నస్తన్మే బ్రూహి పరంతప ॥** (మ.భా.శాం.59-5)

'హే శత్రుసంతాపక భరతవంశ శ్రేష్ఠా ! లోకంలో 'రాజు' అనే పదం వాడుకలో ఉంది. ఈ పదం ఎలా పుట్టింది ? ఎప్పటినుండి వాడుకలోకి వచ్చింది ?' అని అడిగాడు.

ఇంతేగాక, రాజును సామాన్యమానవునితో సరిపోల్చిచూస్తే అవయవ నిర్మాణంలోకాని, సుఖదుఃఖానుభవంలోకాని, మనోవాక్కాయ కర్మలలోకాని ఏమీ భేదం కనబడదు కదా!. అయినప్పటికి రాజు ఒక విశేష వ్యక్తిగా, నాయకుడుగా, అధికారిగా గుర్తింపబడటానికి కారణమేమి? అని అడిగాడు. అందుకు సమాధానంగా భీష్మపితామహుడు త్రివర్గశాస్త్ర ఆవిర్భావాన్ని గురించి వివరించి చెప్పాడు. ఆ శాస్త్రంలోని కొన్ని రాజనీతిని గూర్చిన ముఖ్యవిషయాలు తెలియపరచాడు. రాజుకు ఉండవలసిన లక్షణాలను చెప్పాడు.

ఆ శాస్త్రం పుట్టినప్పటినుండే రాజ్యం, రాజు అనే వ్యవస్థలు ప్రారంభమయ్యాయి. ముందుగా అనంగుడు, తదుపరి అతని పుత్రుడు అతిబలుడు రాజు లయ్యారు. అతిబలుడు ఇంద్రియ లోలుడగుటచే అతనిని గద్దెదింపి సునీతా కుమారుడైన వేనుని రాజుగా చేసారు. అతడుకూడా దురాచారపరుడు లోకకంటకుడు అగుటచే వేదవిదులైన ఋషులు అతనిని మంత్రపూతకుశలతో సంహరించారు.

అనంతరం ఋషులు మంత్రపూర్వకంగా వేనుని దక్షిణ ఊరువును మన్థనం చేయసాగారు. అంత ఆ ఊరువునుండి హ్రస్వాంగములతో ఒక వికృతాకార మానవుడు ఉత్పన్నమయ్యాడు. ఋషులు అతనిని చూసి 'నిషీద'– కూర్చో అన్నారు. ఆ నిషాదుని నుండి నిషాదులు (గిరిజనులు), మ్లేచ్ఛులు (వింధ్యపర్వత నివాసులు) ఉద్భవించారు.

తదుపరి ఋషులు వేనుని కుడిచేతిని మంథనం చేసారు. ఆ చేతినుండి ఒక సుందరమైన మానవుడు ఉత్పన్నమయ్యాడు. అతడు దేవతల రాజైన ఇంద్రునివలె క్షాత్రతేజస్సుతో, కవచ కరవాలాదులతో ధనుర్ధారియై వెలుగొందాడు. అతడు వేదవేదాంగ పారంగతుడు, దండనీతి విశారదుడు కూడా.

ఆ వ్యక్తి మహర్షులకు చేతులు జోడించి "ఓ ఋషి పుంగవులారా! ధర్మార్థముల గురించిన వివేక జ్ఞానం నాకు స్వాభావికంగానే ప్రాప్తించింది. వీటితో నేను మీకు ఏవిధమైన సేవచేయవలెనో సెలవిండు. మీరు నన్ను ఏ పనికొరకు నియోగిస్తే ఆ పనిని తప్పక చేస్తాను. ఆజ్ఞాపించుడు" అని ప్రార్థించాడు. (మ. భా. శాం. 59)

ఈ ఆలంకారిక కథనుండి మనం గ్రహించవలసిన సారాంశ మేమంటే - వేనుడు దురాచారపరుడగుటచే ఋషులు అతనిని రాజ పదవినుండి తొలగించారు. ఇది అతనికి మృత్యువువంటిదే. అనంతరం ఋషులు అతని సంతతిలో యోగ్యులెవరో వెదకసాగారు. అతను దురాచారపరుడగుటచే పెక్కురు అందమైన యువతులను బలవంతంగా తన భార్యాలుగా చేసుకొన్నాడు. వారికి కలిగిన సంతానంలో చదువు సంస్కారంలేని ఒక వ్యక్తి లేచి నిలబడి తనను రాజుగా చేయమని కోరాడు.

ఋషులు అతనిని పరీక్షించి ఇందుకు నీవు తగవు, నిషీద -కూర్చోమన్నారు. కాలాంతరంలో అతని సంతతియే నిషాదులుగా- మ్లేచ్ఛులుగా వ్యవహరింపబడ్డారు.

తదుపరి క్షత్రియ గుణ కర్మ స్వభావాలుగల యోగ్యుడైన సంతానం వరున్నారా ? అని పరిశీలించారు. చివరికి అందుకు తగిన యోగ్యుడైన క్తిని గుర్తించారు. అతనుకూడా ఋషుల ఆజ్ఞాబద్ధుడై ధర్మశాస్త్రాన్ని ుసరించి పాలిస్తానన్నాడు.

ఆనాడు ప్రజాస్వామ్యం ఆ విధంగా ఉండేది. సజ్జనులు, ధర్మాత్ములు, విద్వాంసులు, ఋషులు, వేదానుయాయులు ముఖ్యంగా పక్షపాత రహితంగా ధర్మాన్ని ధైర్యంగా చెప్పగలిగేవారి సూచనల మేరకు రాజును నిర్ణయించేవారు. ఆ విధంగా నిర్ణయింపబడిన వేనుని కుమారునికి ఋషులు ఈ విధంగా ధర్మోపదేశం చేసారు. – ఆజ్ఞాపించారు.

**నియతో యత్ర ధర్మో వై తమశఙ్కః సమాచర ।**

ఓ వేనునందన ! ఏ కర్మలవలన నియమపూర్వకంగా ధర్మసిద్ధి కలుగుతుందో వాటిని నిర్భయంగా ఆచరించు.

**ప్రియాప్రియే పరిత్యజ్య సమః సర్వేషుజన్తుషు ।**
**కామం క్రోధం చ లోభం చ మానం చోత్సృజ్య దూరతః ॥**

ప్రియాప్రియములను గురించిన ఆలోచనలను విడిచిపెట్టి కామ క్రోధ లోభ మానములను దూరముగా నెట్టివేసి సమస్త ప్రాణుల యెడ సమభావమును కలిగిఉండు.

**యశ్చ ధర్మాత్ ప్రవిచలేల్లోకే కశ్చన మానవః ।**
**నిగ్రాహ్యాస్తే స్వబాహుభ్యాం శశ్వద్ ధర్మమవేక్షతా ॥**

ధర్మవిచలితుడైన (ధర్మాన్నితప్పిన) మానవుడెవరైనా సరే సనాతన ధర్మాన్ని దృష్టిలోపెట్టుకుని నీ బాహుబలంతో అతనిని ఓడించి తగిన దండన విధించు.

**ప్రతిజ్ఞాం చాధిరోహస్వ మనసా కర్మణా గిరా ।**
**పాలయిష్యామహం భౌమం బ్రహ్మ ఇత్యేవ చాసుకృత్ ॥**

ఈ ఆజ్ఞలను పాలించుటతోబాటు 'నేను నా మనోవాక్కాయక లతో బ్రహ్మజ్ఞానాన్ని – వేదజ్ఞానాన్ని అనుసరించి ఈ భూమిని పాలిం నని ప్రతిజ్ఞ చేయుము–అని ఆజ్ఞాపించారు.

అంత వేనుని పుత్రుడు ఈ విధంగా ప్రతిజ్ఞ చేసాడు.

**యశ్చాత్ర ధర్మో నిత్యోక్తో దండనీతివ్యపాశ్రయః।**
**తమశఙ్కః కరిష్యామి స్వవశో న కదాచన ॥**

**(మ.భా.శా.59-103- నుండి 107)**

"వేదాలలో దండనీతికి సంబంధించిన ఏ ధర్మం చెప్పడిందో దానిని నిస్సంకోచంగా పాలిస్తాను. ఎప్పుడును స్వేచ్ఛగా వ్యవహరించను".

అంతట బ్రహ్మవేత్తలైన మహర్షులు 'ఏవ మస్తు' అని ఆశీర్వదించి వేనపుత్రుని రాజుగా స్వీకరించారు.

వాలఖిల్యగణం మరియు సరస్వతీనదీతీరస్థ మహర్షి సముదాయం అతనికి మంత్రులుగా - చక్కటి ఆలోచనలను చెప్పువారిగా ఉండటానికి అంగీకరించారు. మహర్షి గర్గభగవాన్ అతని దర్బారులో జ్యోతిష్యవేత్త అయ్యాడు. వేదవిజ్ఞానవేత్త శుక్రాచార్యులవారు పురోహితులయ్యారు. ఆ వేనుని కుమారుడే కాలాంతరంలో పృథుచక్రవర్తిగా జగత్ప్రసిద్ధిని పొందాడు.

ఆర్యావర్తమునకు. అనంగుడు ప్రథమ రాజేఅయినా విశ్వవిఖ్యాతిని పొందిన పృథుచక్రవర్తినే ప్రథమ రాజుగా ప్రజలు చెప్పుకొన్నారు. సృష్ట్యాదిలోని విష్ణువే ఎనిమిదవ తరంలోనివాడైన పృథునిలో ప్రవేశించాడని సంతృప్తిచెందారు. ఆ పరంపర ఈ విధంగా ఉంటుంది

విష్ణువు - విరజా - కీర్తిమాన్ - కర్దముడు - అనంగుడు - అతిబలుడు - వేనుడు - పృథు.

ఈ వేనకుమారునికి పృథు అనే పేరు రావడానికి ఒక కారణం ఉంది. ఆ కాలంలో ఈ పృథివి వ్యవసాయానికి అనుకూలంగా ఉండేదికాదు. మెట్ట పల్లాలతో బాయిరప్పలతో ఊసరక్షేత్రంగా ఉండేది.

సమతాం వసుధాయాశ్చ స సమ్యగుదపాదయత్ ।
వైషమ్యం హి పరం భూమి రాసీదితి చ నః స్మృతమ్ ॥
(మహాభారతం శాం. 59-114)

అట్టి భూమిని వేనకుమారుడు సమతలం చేయించి వ్యవసాయక్షేత్రంగా మార్చాడు. ప్రజలకు కావలసిన అన్నిరకాల పంటలను పండించాడు. ప్రజలను కన్నబిడ్డలవలె పాలించాడు. అందుచే ఆయనను పృథుచక్రవర్తిగా లోకమంతా పిలిచారు.

మన్వంతరాలలో మార్పుజరిగినపుడు భూమిపై పాక్షిక ప్రలయాలు జరుగుతాయి. భూకంపాలు, తుఫానులు ఉప్పెనలు, జలప్రలయాలు (సునామీలు) మొదలైనవి కలుగుతాయి. ఈ విషయం మహాభారతం ఈ విధంగా చెబుతుంది.

మన్వంతరేషు సర్వేషు విషమా జాయతే మహీ ।
ఉజ్జహార తతో వైన్యః శిలాజాలాన్ సమన్తతః ॥
(మ.శాం. 52-115)

నేటి వైజ్ఞానికులుకూడా లక్షసంవత్సరాల కొకసారి భూమి మొత్తం మంచుమయంగా మారిపోతుందంటున్నారు. భూభ్రమణంలోను, సూర్యుని చుట్టూ తిరిగే చలనంలోను జరిగే మార్పులే దీనికి కారణమని ఊహిస్తున్నారు. ఖచ్చితమైన కారణాలేమిటో తెలిసికోవడానికి యత్నిస్తున్నారు.

పృథుచక్రవర్తికన్న పూర్వం కందమూల ఫలాదులు పుష్కలంగా లభించేవి. జనసంఖ్య కూడా తక్కువగా ఉండేది. అప్పటి ప్రజలకు అనాయాసంగా లభించే సహజ పంటలే సరిపోయేవి. కాలక్రమంలో జనసంఖ్య పెరిగింది. ఆహార అవసరాలు పెరిగాయి. వ్యవసాయం చేసి పంటలు పండించవలసిన అవసరం ఏర్పడింది. ఆ సమయంలో

పృథుమహారాజు చేసిన ప్రయత్నం – వ్యవసాయం ప్రపంచానికే ఆదర్శంగా నిలిచింది. ఆనాడు పృథుమహారాజు 17 రకాల పంటలను పండించాడని (తేనేయం పృథివీ దుగ్ధా సస్యాని దశ సప్త చ) మహాభారతం చెబుతుంది. ఆవు పొదుగునుండి పాలను పిండినట్లుగా పృథుమహారాజు భూమినుండి వివిధ పంటలను పిండాడని వాయుపురాణం (63–19) చెబుతుంది.

కేవలం వ్యవసాయమేకాక పృథుమహారాజు అనేక విద్యలను ప్రపంచానికి నేర్పాడు. ప్రపంచదేశాలన్నీ పృథుమహారాజుకు కట్నాలు సమర్పించాయని మహాభారతం వర్ణిస్తుంది. 'తం సాక్షాత్ పృథివీ భేజే రత్నాన్యాదాయ" – ఆ పృథివీ మాతయే రత్నాలు తీసుకువచ్చి సమర్పించినట్లుగా ఆయన పట్టాభిషేక మహోత్సవం జరిగినట్లు మహాభారతం కీర్తిస్తుంది. అంటే భూలోకమందున్న ప్రజలంతా ఆయనకు కట్నాలు తీసుకువచ్చి సమర్పించారని అర్థం. సముద్రప్రాంతం వారు, పర్వత ప్రాంతంవారు, దేవతలరాజైన ఇంద్రుడు అక్షయ ధనాన్ని సమర్పించారు. యక్షరాక్షస రాజైన కుబేరుడైతే ధర్మార్థకామముల మూడింటికి సరిపోవునంతటి ధనరాశి నర్పించాడు. మేరుపర్వతరాజు స్వర్ణభండారాన్ని బహుకరించాడు. కోట్లాది ప్రజల సమక్షంలో ఆయన పట్టాభిషేకం మహావైభవంగా జరిగింది.

ఆయన రాజ్యపాలనకూడా ఆదర్శవంతంగా జరిగింది. ఆయన రాజ్యంలో –

న జరా న చ దుర్భిక్షం నాధయో వ్యాధయస్తథా ॥
సరీసృపేభ్యః స్తేనేభ్యో న చాన్యోన్యాత్ కదాచన ।
భయముత్పద్యతే తత్ర తస్యరాజ్ఞో ౽భిరక్షణాత్ ॥
(మ.భా.శా. 59–121, 122)

ఎవరికీ అకాల వృద్ధాప్యంరాలేదు. దరిద్రంతోకాని, వ్యాధితోకాని ఎవరూ బాధపడలేదు. అతని సువ్యవస్థిత రక్షణవల్ల చోరులవల్లగాని, దుండగులవల్లగాని, సర్పాలవల్లగాని ఎట్టి భయం ఉండేదికాదు.

ఈ భూతలంపై సువ్యవస్థితమైన సామ్రాజ్యాన్ని స్థాపించి ధర్మాన్ని నాలుగు పాదాలపై నడిపించిన మహానుభావుడు పృథుమహారాజు. ప్రజలను సర్వవిధాల రంజింపచేశాడుకనుక అతడే 'రాజు' అని పిలువ యోగ్యుడని భీష్మపితామహు డంటాడు –

**తేన ధర్మోత్తర శ్చాయం కృతో లోకో మహాత్మనా ।**
**రంజితాశ్చ ప్రజాః సర్వాస్తేన రాజేతి శబ్ద్యతే ॥**

**(మ.భా.శాం. 59–125)**

విద్యాసదాచారాలతో విలసిల్లు బ్రాహ్మణులు గాయపడకుండా కాపాడాడుకనుక అతనిని క్షత్రియు డన్నారు. ధర్మం ద్వారా ఈ భూమిని ప్రథితం (ప్రకాశింప) చేసాడు కనుక ఈ భూమి పెక్కురచే పృథ్వీ అని పిలవబడుతోంది.

**బ్రాహ్మణానాం క్షతత్రాణాత్ తతః క్షత్రియ ఉచ్యతే ।**
**ప్రథితా ధర్మతశ్చేయం పృథివీ బహుభిః స్మృతా ॥**

**(మ.భా.శాం. 59–126)**

ఈవిధంగా పృథు మహారాజు బ్రహ్మవ్రాసిన త్రివర్గశాస్త్రాన్ని నుసరించి ప్రజలను కన్నబిడ్డలవలె పాలించిన మహానుభావుడు. తరతరాలకు ఆయన ఆదర్శ చక్రవర్తి.

## దేవతలు – అసురులు

భారతీయపరంపర ననుసరించి జీవుడు అమరుడు. శరీరం మరణిస్తుందేకాని జీవుడు మరణించడు. చిరిగిన వస్త్రాన్ని విడచి నూతన

వస్త్రాన్ని ధరించునట్లుగా జీవుడు వృద్ధావస్థనుగాని వ్యాధినిగాని పొందిన శరీరాన్ని విడచి నూతన శరీరాన్ని ధరిస్తాడు. సూక్ష్మ కారణ శరీరాలను తనవెంట తీసుకుని మరొక శరీరంలో ప్రవేశిస్తాడు. కనుక జీవునకు వెనుక జన్మ ప్రవృత్తే ఉంటుంది. అప్పుడప్పుడు ఆసురీ ప్రవృత్తిగల వారియింట దైవీ ప్రృవృత్తిగలవారు జన్మిస్తారు. దీనికి ఉదాహరణ హిరణ్యకశిపుని యింట ప్రహ్లాదుని జననం. వేనుని యింట పృథుమహారాజు జననం కూడా అట్టిదే. దీనికి విపరీతంగా దైవీ ప్రవృత్తిగలవారియింట ఆసురీ ప్రృవృత్తి గలవారు జన్మిస్తారు. కశ్యప ప్రజాపతి యింట హిరణ్యాక్ష హిరణ్యకశిపుల వలె.

మన ప్రాచీన ఇతిహాసంలో తరచు దేవాసురుల ప్రసక్తి కనబడుతుంది. ఇవి రెండూ వేరువేరు తెగలు కావు. మానవులలోనే దైవీప్రవృత్తి గలవారిని దేవతలని, ఆసురీప్రవృత్తి గలవారిని అసురులనీ అంటారు. చరిత్రను పరిశీలిస్తే ఈ దేవాసురులు అన్ని కాలలోను (అన్ని యుగాలలోను) అన్నిదేశాలలోను కనిపిస్తారు.

లోకంలో ఒక వదంతి ఏమంటే - దేవలోకం వేరుగా, మానవలోకం వేరుగా, అసురలోకం వేరుగా ఉంటాయని. దీనితోబాటు సత్యయుగం(ఆదియుగం)లో అంతా ధర్మాత్ములే ఉండేవారనీ, ధర్మం నాలుగు పాదాలపై నడిచేదనీ ఒక నమ్మకం. త్రేతాయుగంలో ఒక కాలు విరిగి మూడు కాళ్ళపై ధర్మం నడిచేదనీ, ద్వాపరయుగంలో రెండకాళ్ళపై నడిచిందనీ, ఈ కలియుగంలో ధర్మం కేవలం ఒక్క పాదంపైననే నడుస్తున్నదని పౌరాణికులు చెబుతూ ఉంటారు. పురాణాలలో కూడా అట్లే వ్రాయబడిఉంది. ఇది సత్యంకాదు. మనం వెనుక ప్రకరణంలో సత్యయుగ చరిత్ర తెలుసుకున్నాం. అప్పుడు కూడా దుష్ట ప్రవృత్తిగలవారు ఉండేవారు. ఆ యుగంలో హిరణ్యాక్ష హిరణ్యకశిపులేగాక

స్వాయంభువమనువు సంతానంలోకూడా అసుర ప్రవృత్తిగలవార్కు కొందరుండేవారని మహాభారతం చెబుతుంది.

**పంచాశత్ తు మనోః పుత్రాస్తథైవాన్యే భవన్ క్షితౌ।**
**అన్యోన్యభేదాత్ తే సర్వే వినేశురితి న శ్రుతమ్ ॥**
**(మహాభారత ఆదిపర్వం. 75-17, 18)**

అంటే - మనువుకు మరొక 50 మంది పుత్రులు కలిగారు. కాని, వారంతా దుష్టులు. పరస్పరం యుద్ధం చేస్తూ మరణించారు.

మనువు తరువాత సృష్టి విస్తరించింది. దేశాన్ని బట్టి, వారు చేసే కర్మలనుబట్టి భిన్నభిన్న జాతులేర్పడ్డాయి. వారిలో పరస్పర విరోధాలుకూడా ఏర్పడుతూఉండేవి.

జాతు లెన్నిఉన్నా స్వభావాలనుబట్టి రెండువర్గాలుగా విభజించవచ్చు. అవే - దైవీ అసురీ వర్గాలు. ఈ రెండు వర్గాలలో కాలాంతరంలో దేశాన్నిబట్టి వంశాలనుబట్టి మరికొన్ని జాతులేర్పడ్డాయి. అట్టి వంశాలలోను దైవీ అసురీ స్వభావాలుగల మనుష్యుల మధ్య విభేదాలు - యుద్ధాలు జరుగుతూఉండేవి. అప్పుడు మిగిలిన ప్రజలంతా తమ తమ వర్గాలలో చేరి పరస్పరం యుద్ధాలుచేస్తూ ఉండేవారు. ఇవే చరిత్రలో దేవాసుర సంగ్రామాలుగా వర్ణింపబడ్డాయి.

శతపథ బ్రాహ్మణంలో 'విద్వాంసో వై దేవాః - విద్వాంసులే దేవత' లని చెప్పబడింది. ఇచట విద్వాంసులంటే కేవల వ్యాకరణ జ్ఞానం కలిగినవారని కాదు. విద్య అంటే **'వేత్తి యథావత్తత్త్వం పదార్థ స్వరూపం యయా సా విద్యా'** అని నిర్వచనం. దేనివల్ల పదార్థాల యథార్థ స్వరూపం బోధపడుతుందో అది విద్య. అటువంటి విద్య కలిగినవారు విద్వాంసులు. ఆ విద్య కనుగుణంగా జీవితం గడుపువారు దేవతలని పై బ్రాహ్మణ

వాక్యానికి అర్థం. ఈ విద్వాంసులు దేవతలు, ఋషులు, పితరులు' అని మూడు రకాలుగా ఉంటారు. వీరినే ముక్కోటి దేవతలని లోకంలో చెప్పుకుంటూ ఉంటారు. అంటే మొత్తం 3 కోట్ల మంది దేవతలని కాదు. కోటి అంటే వర్గమని అర్థం. దేవతలను 3 వర్గాలుగా విభజించవచ్చు నని దీని భావం.

పదార్థాల యథార్థ జ్ఞానం కలిగిన విద్వాంసులను మన పూర్వులు 3 వర్గాలుగా విభజించి వ్యవహరించారు. అందు దేవతలంటే పరోపకారాది సద్గుణ సంపన్నులు. ఋషులంటే యోగాభ్యాసంచేసి సమాధి స్థితిలో వేదమంత్రాల అర్థం తెలుసుకొని ప్రచారం చేసేవారు. పితరులంటే తమ విద్యా కళాకౌశలాలతో ప్రజలను పాలించి పోషించేవారు. ఇట్టి త్రివిధ దేవతలు ఎక్కువగా హిమాలయ పర్వతప్రాంతాలలో ఉండేవారు. వీరిని గురించి మహర్షి దయానందులవారు తమ పూనా ప్రవచనాలలో ఈ విధంగా వివరించారు.

"కాశ్మీరునుండి నేపాలు వరకుగల ఉత్తుంగ హిమాలయ శిఖరాలపై దేవతలు అనగా విద్వాంసు లుండేవారు. ఇప్పటివలె పూర్వం హిమాలయ పర్వతాలపై యింత మంచు ఉండేదికాదు. ఇప్పుడున్నంత మంచు ఉంటే అప్పుడు వారు అచట నివసించలేకపోయేవారు. ఆనాడు భద్రపురుషులు అచట రాజ్యం చేసేవారు. ఢిల్లీ ప్రాంతంలో ఇంద్రప్రస్థ మను స్థానం ఒకటి ఉంది. అచట ఇంద్రుని రాజ్యముండేది. పుష్కర ప్రాంతంలో బ్రహ్మ, వైకుంఠంలో (బదరీ ప్రాంతంలో) విష్ణువు, కైలాస పర్వతంపై (కేదారనాథ్ కావచ్చు) మహాదేవుడు నివసించేవారు. అలకాపురంలో కుబేరు డుండేవాడు.

ఆనాడు ఈ దేవతలకు-దురాచారపరులైన ఆటవికులకు మధ్య

యుద్ధాలు జరుగుతూ ఉండేవి. దేవతలు విమానాలలో కూర్చుని యుద్ధాలు చేసేవారు. ఆనాడు స్త్రీలు కూడా విలువిద్యా ప్రవీణులై యుద్ధాలు చేసినట్లు చరిత్రలో కనబడుతుంది. ఆ ప్రవృత్తి యిప్పటికీ రాజపుత్రులలో కనబడుతుంది. విదేశీయులు మనదేశాన్ని పాలించినపుడు మన ఇతిహాస గ్రంథాలన్నిటిని కాల్చివేసారు. అందుచే తేదీల ప్రకారం మన ప్రాచీన ఇతిహాసాన్ని వివరించలేకపోతున్నా"మని మహర్షి చెప్పారు.

ఈ సందర్భంలో దయానందమహర్షి విద్యయొక్క ఇతిహాసం కూడా వివరంగా చెప్పారు. దాని సారాంశమేమంటే -

అందటికన్న మొదటి విద్వాంసుడు బ్రహ్మ. ఇతడు అగ్ని వాయు ఆదిత్య అంగిర ఋషులవద్ద వరుసగా ఋక్ యజు సామాథర్వ వేదాలను అభ్యసించి చతుర్వేద పారంగతుడయ్యాడు. అట్టి బ్రహ్మయొక్క పుత్రుడు విరాటుడు. విరాటుని పుత్రుడు మనువు. మనువుకు మరీచి అత్రి అంగిరసాది దశపుత్రులుండేవారు. ఆ కాలంలో ఋగ్వేదానికి 21 శాఖలు, యజుర్వేదానికి 101 శాఖలు, సామవేదానికి 1000 శాఖలు, అథర్వవేదానికి 9 శాఖలు మొత్తం 1131 శాఖలుండేవి. చతుర్వేదాలను అర్థసహితంగా తెలిసికొని యజ్ఞాలు చేయించేవారిని బ్రహ్మ అనేవారు. బ్రాహ్మణులు వేదాలకు వ్రాసిన వ్యాఖ్యానాలను బ్రాహ్మణగ్రంథాలంటారు. వాటికి అనుబ్రాహ్మణాలు కూడా అనేకం ఉండేవి.

ఋషులు పరిశుద్ధమైన జలవాయువులుగల ఏకాంత స్థానంలో వసిస్తూ యోగసాధన చేస్తూ ఉండేవారు. వేదమంత్రాల అర్థాన్ని శ్రవణ మననాలు చేస్తూ, పదార్థ వివేచనచేస్తూ, సిద్ధాంత నిర్ణయాలు చేస్తూ నైమిషారణ్యాది స్థానాలలో ఉండేవారు. అప్పుడప్పుడు సభలను

ఏర్పాటుచేసి వివిధ ధార్మిక నైతిక విషయాలపై చర్చలు చేస్తూ ఉండేవారు. ప్రాచీనమైన మహర్షి పాణిని విరచిత అష్టాధ్యాయిలో అనేక ఋషుల పేర్లు కనబడతాయి. సభలలో సర్వవిధాలుగా చర్చించిన మీదటనే సిద్ధాంత గ్రంథాలు రచించేవారు. సర్వమానవ కల్యాణంకొరకు ఆలోచించేవారు. అట్టి రాజ్యాంగాన్ని నిర్మించడానికి ప్రయత్నించేవారు. మనుస్మృతి 7వ అధ్యాయంలో రాజ్యాంగాన్ని గూర్చిన ఎన్నో ఆదర్శ సూత్రాలు వివరింపబడ్డాయి.

ప్రాచీన కాలంలో చతుర్దశ విద్యల నభ్యసించే ఆచార ముండేది. నాలుగు వేదాలు, నాలుగు ఉపవేదాలు, ఆరు వేదాంగాలు కలిసి చతుర్దశ విద్య లౌతాయి. ఉపవేదాలంటే ఆయుర్వేద ధనుర్వేద గంధర్వవేద అర్థవేదాలు. ఆయుర్వేదంలో కేవలం ఔషధాల వివరణేకాకుండా శరీర నిర్మాణ-ధర్మాలు (అనాటమీ-ఫిజియోలాజీ), రోగ నిర్ణయం, వాజీకరణం మొదలైనవికూడా చెప్పబడ్డాయి. శస్త్రచికిత్సను గూర్చిన పరిణత (అడ్వాన్స్‌డ్) పద్ధతు లుండేవి.

ఒకసారి ఒక ఆంగ్లేయ వైద్యుడు దయానందమహర్షితో-ఆర్యులకు శస్త్రచికిత్స తెలియదు. ఆంగ్లేయులమైన మేమే శస్త్రచికిత్స ప్రారంభించి అభివృద్ధిపరచా మన్నాడు. అంతట మహర్షి తన వద్దనున్న సుశ్రుత గ్రంథములోని నేత్రాధ్యాయాన్ని చూపించారు. అందులో నేత్రనరాలను సైతం నిలువుగా చీల్చగల పరికరాల వర్ణన ఉంది. అది చూసి ఆ ఆంగ్లేయుడు నిరుత్తరుడయ్యాడు.

ధనుర్వేదంలో - బ్రహ్మాస్త్రం, పాశుపతాస్త్రం, నారాయణాస్త్రం, వారుణాస్త్రం, మోహనాస్త్రం, వాయవ్యాస్త్రం మొదలైనవి ఏవిధంగా నిర్మించాలో వ్రాయబడింది. వేదార్థాల నాలోచించి పదార్థాల గుణ

గణాలను విచారించి ఆనాడు అస్త్ర శస్త్రాలను నిర్మించేవారు. అవి కేవలం మంత్రాలు కావు. ఆయుధాలు. ఆనాడు క్షత్రియులు మిక్కిలిగా శ్రమించి ధనుర్వేదాన్ని అభ్యసించేవారు.

గాంధర్వవేదంలో వేదమంత్రాలను వివిధ విధాలుగా గానం చేసే పద్ధతులు చెప్పబడ్డాయి. (సామవేదమంత్రాలను వెయ్యి విధాలుగా గానం చేసేవారు. ఆ గాంధర్వవేదం నుండే శాస్త్రీయ సంగీతం ఆవిర్భవించిందంటారు).

అర్థవేదం శిల్పకళాశాస్త్రం. కేవలం రాతిశిల్పాలశాస్త్రమే కాదు. నేడు ఇంజనీరింగని చెప్పబడే అన్నిరకాల శిల్పకళలు అందు వర్ణింపబడ్డాయి. మయసంహిత, వరాహసంహిత, విశ్వకర్మసంహిత మొదలైన గ్రంథాలలో వివిధ శిల్పకళలు వివరింపబడ్డాయి. అనేక రకాల విమానాలు, యంత్రాలు, వాహనాలు, సాధనాలు, పరిశ్రమలు, భవనాలు నిర్మించబడేవి.

శిక్ష కల్పము వ్యాకరణము నిరుక్తము ఛందస్సు జ్యోతిష్యము అనే ఆరు శాస్త్రాలను వేదాంగాలంటారు. ఇవి వ్యాకరణ శాస్త్రాలు. వీటిని చక్కగా అభ్యసించినవారికే వేదార్థం అవగతమౌతుంది. వేదాలనుండి ఎన్నో విద్యలను ఆవిష్కరించగలుగుతారు.

మరొక ఆరు ఉపాంగాలుకూడా తప్పక చదువతగినవి. వీటిని దర్శనశాస్త్రా లంటారు. అవి – వైశేషిక న్యాయ సాంఖ్య యోగ మీమాంసా వేదాంత దర్శనాలు. ఇవి ఆరూ సృష్టిని ఆరుకోణాలలో పరిశీలించి వ్రాయబడిన గ్రంథాలు. వీటి అధ్యయనంవల్ల సృష్టినియమాలు, సృష్టి రహస్యాలు అవగతమౌతాయి.

ప్రాచీన భారతీయ పరంపర ననుసరించి పిల్లలకు అయిదవ సంవత్సరంలోనే అక్షరాభ్యాసం చేయించి చదవటం వ్రాయటం నేర్పేవారు.

కొన్ని నీతి శ్లోకాలు, స్తుతి ప్రార్థన మంత్రాలు నేర్పేవారు. ఎనిమిదవ ఏట ఉపనయన వేదారంభ సంస్కారాలు చేసి గురుకులాలకు పంపేవారు. బాలురకు వేరుగా బాలికలకు వేరుగా గురుకులాలుండేవి. అక్కడ వారు సాంగోపాంగంగా వేదాధ్యయనం చేసేవారు. వారి సామర్థ్యం కొలది విద్యల నభ్యసించి, స్నాతకులై గృహాలకువచ్చి గృహస్థాశ్రమంలో ప్రవేశించేవారు. పంచమహాయజ్ఞాలను విధిగా చేస్తూ తమ విద్యా సామర్థ్యాలకు తగిన వృత్తిని (వర్ణాన్ని) స్వీకరించి సదాచారపరులై జీవించేవారు. ఇట్టివారిని ద్విజులు అనేవారు. విద్యాగర్భంనుండి రెండవ సారి జన్మించినవారని ద్విజ పదానికి అర్థం. పూర్వజన్మ సంస్కారాలవల్ల, పెరిగిన పరిసరాల ప్రభావంవల్ల కొందరిలో విద్యాభిరుచి ఉండదు. చదువు వారికి చాలా భారంగా ఉంటుంది. అటువంటి వారిని శూద్రులు అనేవారు. ఇట్టివారు తమకు అభిరుచిగల సేవావృత్తిని స్వీకరించేవారు. సదాచారపరులై ఉన్నతికొరకు ప్రయత్నించేవారు. వీరంతా ఆర్యులుగానే వ్యవహరింప బడేవారు. వీరిలో దివ్యగుణాలుగల వారిని దేవత లనేవారు.

పూర్వజన్మల సంస్కారాలవల్ల మరికొందరు ఆర్యత్వానికి భిన్నంగా ఇంద్రియలోలురై సదాచారానికి, ధర్మానికి దూరంగా జీవిస్తారు. స్వార్థమే వారికి పరమార్థంగా ఉంటుంది. అమాయకులను, బలహీనులను బాధిస్తూ క్రూరంగా వ్యవహరిస్తారు. అభిమాన అహంకారాలు కలిగి ఉంటారు. ఇట్టివారిని అసురు లనేవారు. వీరు అసూయా అత్యాశల వల్ల యితరుల కష్టార్జితాన్ని దోచుకుంటూ ఉండేవారు. అప్పుడు దేవతలు సంఘటితమై వీరిపై యుద్ధంచేసి సంహరించి బలహీనులును కాపాడేవారు.

ఇంతేగాక, అసురులు అందమైన స్త్రీలను అపహరించి బలవంతంగా తమ భార్యలుగా చేసుకునేవారు. ఒక్కొక్క పురుషుడు

అనేక మంది స్త్రీలను వివాహమాడేవాడు. సంతానంకూడా వీరికి ఎక్కువగానే ఉండేది. వీరు భౌతికవాదులగుటచే భోగవిలాసాలకే ప్రాధాన్యత నిచ్చేవారు. మద్యమాంసాలను సేవించేవారు. విశాలమందిరాలను, నగరాలను నిర్మించుకొని వాటిని ఐశ్వర్యసంపన్నం చేసుకొనేవారు. వీరి భోగభాగ్యాలను, విలాసాలను చూసి కొందరు దేవతలు ఆకర్షితులై వీరిలో చేరుతూ ఉండేవారు. చరిత్రలో యిట్టి సంఘటనలు అక్కడక్కడ కనబడతాయి.

వీరి ప్రవృత్తి ప్రయత్నాలవల్ల వీరి నగరాలు ధనంతో, జనంతో వివిధ సంపదలతో తులతూగుతూ ఉండేవి. వీరి జనసంఖ్య పెరిగే కొలది రాజ్యాన్ని విశాలం చేసుకోవడానికి, క్రొత్త రాజ్యాలు స్థాపించుకోవడానికి ప్రయత్నం చేసేవారు. ఆ ప్రయత్నంలో వీరు దేవతల రాజ్యాలపైనకూడా ఆక్రమణలు చేస్తూ ఉండేవారు. చరిత్రలో కనబడు దేవాసుర సంగ్రామాలన్నీ యిట్టివే.

ఇక అమృత మంథనం ఏమిటో ఆలోచిద్దాం.

## అమృత మంథనం

దేవతలు అసురులు కలిసి పాలసముద్రాన్ని మంథనం చేసి అమృత కలశాన్ని సంపాదించారనే కథ అప్పుడప్పుడు వింటూ ఉంటాం. శ్రీమహావిష్ణువు జగన్మోహినీ రూపాన్ని దాల్చి ఆ అమృతాన్ని అసురలకు అందకుండా చేసాడని పురాణాలలో వర్ణింపబడింది. ఈ కథ పురాణాలలోనే కాక రామాయణ భారతాలలో కూడా కనబడుతుంది. కాన, చరిత్రతో దీనికి ఏదో సంబంధం ఉంది. ఈ కథ పూర్వాపరాలు తెలుసుకుంటే మనకు ఒక అవగాహన ఏర్పడుతుంది.

వెనుక ప్రకరణంలో తెలిసికొన్నట్లుగా ఆనాడు అసురుల సంఖ్య క్రమంగా పెరగసాగింది. అవసరాలు పెరిగాయి. అందుచే అసురులు తరచుగా దేవతల రాజ్యాలపై దాడిచేయటం జరిగేది. దేవతలకు ఆస్తి నష్టం ప్రాణనష్టం ఎక్కువగా జరుగుతూ ఉండేది. అట్టి క్లిష్ట పరిస్థితిలో దేవతలు సంఘటితమై ఆలోచించటం ప్రారంభించారు. సుమేరు పర్వత శ్రేణిలోని ఒక శిఖరంపై దేవతలు ఒక సమావేశం ఏర్పాటు చేసారు. ప్రసిద్ధ నాయకులనంతా ఆ సమావేశానికి ఆహ్వానించారు.

ఆ సమ్మేళన ముఖ్యోద్దేశ్యమేమంటే 'అసురుల బారినుండి ఎలా బయటపడాలి' అనేది. ఎవరికి తోచిన ఆలోచన వారు చెప్పారు. చివరికి సకల విద్యావేత్తయైన బ్రహ్మ ఆ ఆలోచనలను విశ్లేషిస్తూ – అసురులను చంపినంత మాత్రాన వీరి పీడ విరగడకాదు. అసురప్రవృత్తి గలవారు మరల మరల పుడుతూనే ఉంటారు. కనుక మరేదైనా ఉపాయం ఆలోచించాలని సూచించాడు. వీరి సంఖ్య తక్కువ చెయ్యాలంటే ధర్మ ప్రచారం చేసి మానవులంతా ధర్మకర్మలలో ప్రవృత్తులయ్యేటట్లు చూడాలని సూచించాడు. ఈ దేశంలోనే కాక సంపూర్ణ భూమండలమంతా ధర్మ ప్రచారం చెయ్యాలన్నాడు. "అప్పుడే పాపాత్ముల (అసురల) సంఖ్య తక్కువవుతుంది. ధర్మాత్ముల (దేవతల) సంఖ్య ఎక్కువవుతుంది. శిష్టులకు రక్షణ జరుగుతుంది" అన్నాడు.

అయితే, ఈ కార్యం చాలా విశాలమయ్యింది. ఫలితం రావడానికి చాలా సమయం పడుతుంది. కనుక ఒక ప్రక్క ఆ ప్రయత్నం చేస్తూనే ప్రస్తుతం ఏర్పడుతున్న ముప్పునుండి బయటపడటానికి ఏదైనా తాత్కాలిక ప్రయత్నం చెయ్యాలన్నాడు. ముఖ్యంగా దేవతలకు ఏర్పడుతున్న జననష్టం ఆపాలన్నాడు. అందుకు దేవతలు అమృతపానం చెయ్యడం

అవసర మన్నాడు. అమృతం క్షీరసముద్రంనుండి లభిస్తుంది. కాస క్షీరసముద్ర మంథనం చెయ్యాలని సూచించాడు.

బ్రహ్మ సూచించిన ఈ ఉపాయం దేవతలందరికి నచ్చింది. క్షీరసముద్ర మంథనం చెయ్యడానికి దేవతలసభ తీర్మానంచేసి సర్వసమ్మతితో ఆమోదించింది. అప్పటినుండి అందుకొరకు ప్రయత్నాలు ప్రారంభమయ్యాయి.

**పురాణ కథలో** – దేవతలు మంథర పర్వతాన్ని కవ్వంగాచేసారు. దానిని అనంతనాగు సాయంతో సముద్రం దగ్గరికి తీసుకువచ్చారు. ఆ పర్వతాన్ని కచ్ఛపరాజు వీపుపై నిలబెట్టారు. ఆదిశేషుని కవ్వపుత్రాడుగా చేసారు. త్రాడును దేవతలు అటువైపు కొందరు ఇటువైపు కొందరు పట్టుకుని త్రిప్పనారంభించారు. చాలా కష్టంగా కవ్వం తిరుగుతున్నది. ఇంతలో అసురులు అక్కడకువచ్చి మీరు చాలా కష్టపడుతున్నారు. మీకు మేము సాయం చేస్తామన్నారు. అప్పుడు వారు ఏమీ భాగం కోరలేదు. అందుచే దేవతలు కాదనడం మంచిది కాదని అంగీకరించారు. అసురులు మేము తలవైపునే పట్టుకుంటాము, తోకను పట్టుకోమన్నారు. దేవతలు అందుకు అంగీకరించి వారు తోకను పట్టుకున్నారు. మంథనం ప్రారంభమయ్యింది. కవ్వపుత్రాడుగానున్న ఆదిశేషునికి కష్టం కలిగి నోటినుండి కాలకూట విషం స్రవించాడు. అది రాక్షసులను బాధించసాగింది.

అప్పుడు శివుడు ఆ విషాన్ని పానంచేసాడు. మ్రింగితే లోపలున్న లోకాలు దగ్ధమై పోతాయని కంఠంలోనే ధరించాడు. అందుచే శివుని కంఠం కమిలిపోయింది. నీలకంఠుడైపోయాడు.

క్రమంగా క్షీరసముద్రాన్నుండి అద్భుతమైన వస్తువులు రావటం ప్రారంభమయ్యింది. అప్పుడు అసురుల మనసులో లోభం ప్రవేశించింది.

ఎలాగైనా కొంతవాటా కోరాలనే ఆలోచన కలిగింది. చివరికి అమృత భాండం వెలువడింది. అసురులు మాకూ భాగం పంచమన్నారు. అప్పుడు విష్ణువు జగన్మోహినీరూపంలో వచ్చి అసురులను మభ్యపెట్టి అమృతమంతా దేవతలకు పంచిపెట్టాడట.

పై పౌరాణిక కథ విన్న వివేకవంతుల బుద్ధిలో అనేక ప్రశ్నలుదయిస్తాయి. క్షీరసముద్రం ఎక్కడుంది? అసలు అటువంటి సముద్రం ఉంటుందా ? మంథర పర్వతాన్ని సముద్రంలోకిఎట్లా చేరుస్తారు ? దానిని కచ్ఛపము (తాబేలుపై) ఎలా నిలుపుతారు ? దానికి కవ్వపు త్రాడుకాగల అంతపెద్ద సర్పం ఉంటుందా? మొదలైనవి అనేక ప్రశ్నలు.

బుద్ధితో ఆలోచిస్తే ఈ పౌరాణిక కథలో కల్పితమే (అసత్యమే) ఎక్కువ కనబడుతుంది. బహుశః పౌరాణికులు వారు కల్పించిన దేవతలు అమృతం త్రాగినందున సదా జీవించి ఉంటారని చెప్పడానికి ఈ కథ కల్పించిఉంటారు. తమ విష్ణువు అనేక అవతారాలు దాల్చి దేవతలను కాపాడతాడని నమ్మించడానికి విష్ణువును ఈ కథలో చేర్చారు. దీనిలో స్వల్పమైన సత్యమేదైనా ఉందంటే అది అమృతం. అయితే అమృతం అంటే ఏమిటి ?

వేద వ్యాఖ్యాన గ్రంథాలైన బ్రాహ్మణ గ్రంథాలలో ఆధ్యాత్మిక విషయాలు సరళంగా అర్థం కావడానికి కొన్ని కథానికలు కల్పించబడ్డాయి. అందులో దేవతలు అగ్నిని ఆత్మలో ధరించి అమరులయ్యారన్నది ఒక కథానిక.

దేవాసురలమధ్య విభేదాలు, కలహాలు అనాదిగా వస్తున్నవే. ఒక పర్యాయం దేవతలు మరొక పర్యాయం అసురులు విజయం పొందుతూ ఉండేవారు. వీరిద్దరు మరణధర్మం కలవారే. అంటే దేవతలూ చనిపోయేవారు, అసురులూ చనిపోయేవారు. పుట్టినవారు మరణించక

తప్పదు. జాతస్య హి ధృవో మృత్యుః – అనేది సృష్టి నియమం. మరి, అమరత్వం అంటే ఏమిటి ? శాస్త్రాలలో వివరించబడ్డ ముక్తి సాధనల నన్నిటిని ఆచరిస్తూ యోగాభ్యాసం చేస్తే ఆత్మ పరమాత్మల సాక్షాత్కారం కలుగుతుంది. జీవుడు తన యథార్థ స్వరూపాన్ని తెలుసుకొని తనను అమరుడుగా– మరణించనివానిగా తెలుసుకుంటాడు. ప్రారబ్ధం ముగిసి శరీరబంధనంనుండి విడివడిన తదుపరి ముక్తిని పొందుతాడు. అక్కడ చిరకాలం అంటే 3,11,040 కోట్ల సంవత్సరాలు ఏ కష్టం లేకుండా పరమేశ్వరుని ఆనందంలో ఉంటాడు. దీనినే అమరత్వాన్ని – అమృతత్వాన్ని పొందటమని శాస్త్రాలలో చెప్పబడింది.

ఇక లోకవ్యవహారంలో 'అమృతం త్రాగి అమరులవటం' అంటే ఆత్మను గురించి శ్రవణ మననాలు చేసి తాను అమరుడైన జీవుడనని తెలుసుకోవటం. ఆ జ్ఞానానికి అనుగుణంగా జీవించటం. చావు పుట్టుకలు శరీరానికేగాని తనకు కావని గుర్తించి ధర్మకార్యాలను ధైర్యంగా ఆచరించటం.

శతపథబ్రాహ్మణంలోని కథానికలో – దేవతలు అగ్నిని ఆత్మలో ధరించి అమరులైనట్లు వ్రాయబడింది. ఆ కథానిక ఈ విధంగా సాగింది.

దేవాసురు లిరువురు అనాత్మజ్ఞులే. అయినా వారిరువురిలో అగ్ని అమరంగా ఉండేది. దాని ఆశ్రయంతోనే వారిరువురు అమృతత్వాన్ని అనుభవించేవారు. ఒకానొక సమయంలో దేవతలపై అసురులే విజయం పొందారు. దేవతల సంఖ్య బాగా తగ్గిపోయింది. తమను తాము కాపాడుకోవటానికి దేవతలంతా ఒక చోట సమావేశమై ఉపాయం ఆలోచించసాగారు. అమరమైన అగ్నిని మనం బయట సేవిస్తున్నాం. అలా కాకుండా అగ్నిని ఆత్మలోనే ఆధానం చేసుకోవడం మంచిదను

కున్నారు. అసురులకు కూడా యిట్టి ఆలోచనే వచ్చిందేమో నని వారిని యుక్తిగా ప్రశ్నించి తెలుసుకున్నారు. అగ్నిని అసురులు కేవలం భౌతిక ప్రయోజనాలకే వాడుకుంటున్నారని గ్రహించారు. అంతట దేవతలు అగ్నిని ఆత్మలో ధరించి అమరు లయ్యారు.

ఈ కథలోని భావమేమంటే - ఇచట అగ్ని అంటే యజ్ఞాగ్ని- అగ్నిహోత్రం. పూర్వం ప్రతి గృహస్థు ఉదయ సాయం సమయాలలో అగ్నిహోత్రం చేసేవాడు. దానివల్ల జలవాయువులు శుద్ధమై ఆరోగ్యలాభం కలిగేది. ఋతువులు అనుకూలంగా మారేవి. సమయానుకూల వర్షాలు కురిసి దేశం పాడిపంటలతో సుభిక్షంగా ఉండేది. ఇదంతా భౌతిక ప్రయోజనం మాత్రమే. దీనివల్ల ఆధ్యాత్మిక ప్రయోజనం కూడా మరొకటుంది. అగ్నిహోత్రం చేస్తూ అగ్నిహోత్రంవలె జీవించాలని సంకల్పించి తదనుగుణంగా జీవించటం. దీనినే యజ్ఞమయ జీవన మంటారు. అగ్నిహోత్రం పక్షపాతం లేకుండా అన్ని ప్రాణులకు మేలు చేస్తుంది. అట్లే మనం ఫలితాన్ని ఆశించకుండా పరోపకార కర్మలు పక్షపాతం లేకుండా సార్వజనిక ప్రయోజనం కొరకు చేయాలి. ఆ నిష్కామ కర్మయోగం క్రమంగా మనకు అమరత్వాన్ని - ముక్తిని కలుగజేస్తుంది. ఈ విషయం వివరంగా తెలిసికోగోరువారు మాచే ప్రచురింపబడిన “అగ్నిహోత్ర ఆధ్యాత్మిక స్వరూపం” అనే పుస్తకం చదువగోరుచున్నాము.

క్షీరసాగర మథనంలోని అమృతం అంటే ఆత్మజ్ఞానమే. బహుశః దేవతలు మరియు అసురులు ‘వేదాలు’ అనే క్షీరసాగరాన్ని మథించి ఉంటారు. అందుండి అనేక విద్యావిజ్ఞానాలు బహిర్గతమై ఉంటాయి. చివరగా ఆత్మజ్ఞాన మనే అమృతం లభించి ఉంటుంది. సహజంగానే అసురులు మోహవశులు కనుక భౌతిక విద్యావిజ్ఞానాలవైపే ఆకర్షితులై

ఆత్మజ్ఞానాన్ని విస్మరించి ఉంటారు. దేవతలు ధర్మప్రియులు సత్వగుణ ప్రియులు కావటంవల్ల భౌతిక సంపదలకన్న ఆత్మజ్ఞానమే గొప్పదని గ్రహించి దానిని పానం చేసి ఉంటారు.

అయితే ఆ కథలోని మంథర పర్వతము, అనంతనాగు, కూర్మము, ఆదిశేషుడు వేటికి సంకేతాలో పరిశోధించవలసియున్నది.

సంస్కృత కోశ గ్రంథాలలో అమృత పదానికి చాలా అర్థాలు వ్రాయబడి ఉన్నాయి. అందులో అమృతవల్లి ఒకటి. దీనినే తిప్పతీగ అంటారు. దీనినుండి తిప్పసత్తు తయారుచేస్తున్నారు. ఇది మంచి బలవర్ధకం. బలకర ఔషధాలలో (టానిక్స్‌లో) దీనిని కలుపుతూ ఉంటారు. ఒకవేళ పెద్ద మోతాదులో అట్టి ఔషధం తయారుచేసి ఉంటారు. దీనికన్న సోమలత మరింత శ్రేష్ఠంగా శాస్త్రాలలో వర్ణింపబడింది. దాని రసంకూడా కావచ్చు.

ఆవుపాలను, ఆవునేతిని కూడా సంస్కృతంలో అమృతం అంటారు. ఆవుపాలు ఎక్కువ పరిమాణంలో సేకరించి పెద్ద కవ్వాన్ని నిర్మించి చిలికి వెన్నను తీసి ఉంటారు. ఆ వెన్నను నేతిగా కాచి ఆహారంగాను అగ్నిహోత్రానికి గాను ఉపయోగించి ఉంటారు. లేదా మరేదైనా ప్రక్రియ కావచ్చు.

అమృత మంథనం తర్వాత దేవాసురుల పరస్పర వైరం పెరిగిపోయింది. అసురులకు దేవతలు చేసిన మోసం తెలిసిపోయింది. అమృతమంతా మోహిని దేవతలకు పంచిపెట్టటంవల్ల దేవతలు బలవంతులయ్యారు. యుద్ధానికి సన్నద్ధులయ్యారు. అప్పటి దేవాసుర యుద్ధం అతి భయంకరంగా జరిగినట్లు చరిత్రలో కనబడుతుంది. ఆ యుద్ధంలో మొదటిసారిగా నరులుకూడా దేవతల పక్షం వహించి యుద్ధంలో పాల్గొన్నారు. ఇచట నరులంటే సామాన్యమానవులు కావచ్చు

లేదా విష్ణువు యొక్క అనుయాయులు కావచ్చు. ఆనాడు విష్ణువు యొక్క అనుయాయులను నరు లనేవారు. నర నారాయణు లనే మాటలు పురణాలలో అక్కడక్కడ కనబడతాయి.

విష్ణువు యొక్క నివాస స్థానం వైకుంఠ మని వెనుక ప్రకరణంలో తెలుసుకున్నాం. కాలాంతరంలో ఆయన మైదానప్రాంతానికి వచ్చి రాజ్యమేర్పరచుకొని యుండవచ్చును. ఆ రాజ్యంలోని ప్రజలను నరులనీ, రాజును నారాయణుడని వ్యహరించి ఉంటారు. దేవతలకు, అసురులకు మధ్య భయంకరయుద్ధం జరుగుచున్నదని తెలిసి నరులు ధనుర్బాణాలు ధరించి యుద్ధంలో పాల్గొన్నారు. నారాయణుడు (విష్ణువు) కూడా సుదర్శనచక్రం ధరించి దేవతల పక్షంలో యుద్ధం చేసాడు. ఆ సుదర్శన చక్ర మహిమను మహాభారతం ఈ విధంగా కీర్తిస్తుంది.

తదాగతం జ్వలితహుతాశనప్రభం భయంకరం కరికరబాహురచ్యుతః।
ముమోచ వై ప్రబలదుగ్రవేగవాన్ మహాప్రభం పనానగరావదారణమ్ ॥

(మ.భా. ఆదిపర్వం. 19-22)

అక్కడకు తీసుకురాబడిన సుదర్శనచక్రం భయంకరమైన ప్రజ్వలిత అగ్నివలె ప్రకాశించింది. దానికి పెద్ద పెద్ద శత్రునగరాలను ధ్వంసం చేయగల శక్తి ఉంది. ఏనుగు తొండంవంటి బలం గల బాహువులు గల విష్ణువు ఆ చక్రాన్ని శత్రువులపై ప్రయోగించాడు. (బహుశః ఇది ఏదైనా యంత్రం వంటిదికావచ్చు).

భారతయుద్ధంవంటి భీషణ సంగ్రామం జరిగింది. ఆ యుద్ధంలో అసురులు, దైత్యులు పరాజయం పాలయ్యారు. విజయం దేవతలను వరించింది.

ఈ యుద్ధం అమృతం కొరకు జరిగిన దేవాసుర సంగ్రామంగా ...ప్పబడింది.

అనంతరం యయాతి కథ తెలుసుకునే ముందు జంబూద్వీపాన్ని గురించి, అందలి దేశాల గురించి కొద్దిగా తెలుసుకుందాము.

## జంబూద్వీపం

భారతీయులు తమ నిత్యకర్మలలోను, వివాహాది శుభ కార్యాలలోను సంకల్పం చెప్పుకొని ఆచరించటం అనాదిగా వస్తున్న ఆచారం. అందు జంబూద్వీప భరతఖండ భారతవర్షముల ప్రసక్తి కనబడుతుంది. నిత్యకర్మలలో చెప్పుకునే సంకల్పం చిన్నదిగాను, ఉపనయన వివాహాదులలో చెప్పుకునే సంకల్పం పెద్దదిగాను (మహాసంకల్పంగాను) ఉంటుంది. చిన్న సంకల్ప ప్రారంభం ఈ విధంగా ఉంటుంది.

**ఓం తత్సత్ అద్య బ్రహ్మణః ద్వితీయ ప్రహర ఉత్తరార్థే (లేదా ద్వితీయే పరార్ధే) శ్వేత వరాహకల్పే, సప్తమే వైవస్వత మన్వంతరే, అష్టావింశతి తమే చతుర్యుగే, కలియుగే కలి ప్రథమచరణే, జంబూద్వీపే, భరతఖండే, భారతవర్షే, ఆర్యావర్త పుణ్యభూమౌ, మేరోః దక్షిణ దిగ్భాగే శ్రీశైలస్య....**

పరమేశ్వరునిచే రచింపబడిన ఈ సృష్టిలో ప్రస్తుతం ద్వితీయ ప్రహర ఉత్తరార్థంలో సప్తమ వైవస్వతమన్వంతరం జరుగుతోంది. అందులోనూ 27 చతుర్యుగాలు గడచిపోయాయి. 28వ చతుర్యుగంలోని కలియుగం జరుగుతోంది. అట్టి సమయంలో మనం జంబూద్వీపంలోని భరతఖండంలో ఉన్నాం. అందులోనూ భారతవర్షంలో (భారతదేశంలో) ఉన్నాం. దీనినే ఆర్యావర్తమని పూర్వం చెప్పుకునేవారు. ఈ దేశం మేరు పర్వతానికి దక్షిణంగా ఉంది. మేరుపర్వతం మనకు చాలా దూరంగా ఉంది కనుక మనకు దగ్గరలో ఉన్న శ్రీశైలపర్వతానికి ఏ దిశలో ఉన్నామో

చెప్పుకోవడం జరుగుతోంది. అనంతరం ఏ నదులమధ్య ఏ ప్రదేశంలో ఉన్నామో ఏ తిథి వార నక్షత్ర యోగ కరణాదులుగల దినం ఆ కర్మచేయుచున్నామో, ఎందుకొరకు చేయుచున్నామో చెప్పుకుంటారు. దీనినే సంకల్పం (వ్రతదీక్ష) అంటారు.

ఈ సంకంల్పంలోని జంబూద్వీప భరతఖండ భారతవర్ష ఆర్యావర్తాలు ఎక్కడ ఉన్నాయి? మేరు పర్వతం ఎక్కడ ఉంది? హిమాలయాలు, మేరు పర్వతం ఒక్కటేనా? వేరు వేరా? అనేవి ఆలోచించవలసిన విషయాలు. వీటిని గురించి పలువురకు పలురకాల అభిప్రాయాలున్నాయి.

జంబూద్వీపాన్ని నవ వర్షాలుగా చేసి స్వాయంభువమనువు కుమారుడైన ప్రియవ్రతుడు తన కుమారులకు పంచియిచ్చినట్లు మన గ్రంథాలలో కనబడుతుంది. అందుచే భారతవర్షం జంబూద్వీపంలో తొమ్మిదవ భాగమై యున్నదని కొందరంటారు. కొందరు జంబూద్వీపం అంటే భారతవర్షంలోని ఉత్తర భాగమని కొందరు, దక్షిణభాగమని కొందరు, మొత్తం భారతదేశమని కొందరు చెప్తారు. మరికొందరు ఆసియా ఖండాన్ని జంబూద్వీపంగా భావించి దానిని నవ వర్షాలుగా విభజించ ప్రయత్నించారు. ఇట్టివే మరెన్నో అభిప్రాయాలు చరిత్రకారులలో ఉన్నాయి. వీటన్నిటిని పరిశీలించి శ్రీ కోట వెంకటాచలం అనే పండితులు "జంబూద్వీపము-దాని భాగములు" అను పేరుతో ఒక చక్కటి పరిశోధనాగ్రంథం వ్రాసారు. అది యుక్తిసంగతంగా ప్రాచీన శాస్త్రాల కనుగుణంగా ఉంది. ఇదేకాక, వీరు "బ్రహ్మాండ సృష్టి విజ్ఞానం' 'ఆర్యుల సర్వతోముఖ విజ్ఞానం' 'కలిశక విజ్ఞానం' మొదలగు గ్రంథాలను వ్రాసారు. ఇవన్నీ పరిశోధనా గ్రంథాలే. వైదిక సిద్ధాంతాలకుచాలా దగ్గరగా ఉన్నాయి. (ఈ గ్రంథాలు ప్రస్తుతం లభించటం లేదు. కామారెడ్డి

ఆర్షగురుకుల గ్రంథాలయంలో కొన్ని ఉన్నాయి.

జంబూద్వీపాన్ని గురించి శ్రీ వెంకటాచలంగారు వారి గ్రంథంలో అనేక కోణాలలో విశ్లేషించారు. వాటి సారాంశం సంక్షిప్తంగా యిక్కడ వ్రాస్తున్నాను.

పూర్వం ఈ భూమిని రెండు భాగాలుగా చేసి వ్యవహరించేవారు. 1. భూగోళం, 2. మహాభూమి.

ప్రాచీనులు భూమికి సమమధ్యప్రదేశంగుండా చుట్టూ ఒక రేఖగీసి దానికి విషువన్మండలరేఖ (లేక నిరక్షరేఖ) అని పేరు పెట్టారు. దానిని మనం ఇప్పుడు భూమధ్యరేఖ (ఈక్వేటర్) అంటున్నాం. అట్టి నిరక్షరేఖ నుండి పై ఉత్తరధృవం వరకు ఉన్న భూభాగాన్ని దేవభాగం లేదా జంబూద్వీపం అన్నారు. నిరక్షరేఖ నుండి (భూమధ్యరేఖ నుండి) దక్షిణ ధృవం వరకు గల భూబాగానికి అసురభాగం అని పేరు పెట్టారు. ఈ విషయాన్ని గురించి శ్రీభాస్కరాచార్యులవారు తమ 'సిద్ధాంత శిరోమణి' అనే గ్రంథంలో –

**భూమేరర్ధం క్షారసింధో రుదక్స్థం జంబూద్వీపం ప్రాహురాచార్యవర్యాః।**
**అన్యేర్ధేస్మిన్ ద్వీపషట్కస్యయామ్యే క్షార క్షీరాద్యంబుధీనాం నివేశః ॥**

భావార్థం : లవణ సముద్రానికి ఉత్తరాన గల (పైనగల) భూగోళం యొక్క అర్ధభాగాన్ని జంబూద్వీపమని ఆచార్యులన్నారు. దక్షిణార్ధభాగంలో లవణ క్షీరాది నామాలుగల సప్త సముద్రాలు, ఆరు ద్వీపాలు ఉన్నాయి.

ఆదిలో ఉత్తరార్ధ గోళం అంతా అఖండ భూభాగంగా ఉండేది. సముద్రాలు ఏవీ ఉండేవికావు. దానిచుట్టూ క్రిందివైపు సముద్రం ఉండేది. అందుచేత ఆ పెద్ద భూభాగాన్నంతా (పై సగం భూమిని)

జంబూద్వీప మన్నారు. క్రింది దక్షిణార్ధ గోళంలో ఆరు ద్వీపాలుండేవి. వాటిమధ్య ఉండే సముద్రాలను లవణ సముద్రం క్షీరసముద్రం మొదలైన పేర్లతో వ్యవహరించేవారు.

కాలాంతరంలో భూమిలో చాలా మార్పులు వచ్చాయి. చాలా భూభాగం సముద్రంలో మునిగిపోయింది. పూర్వం జంబూద్వీపానికి చివరిభాగంగా భూమధ్యరేఖకు తగులుతూ 'లంక' అనే నగరం ఉండేది. (సింహళం పూర్వం భారతవర్షంతో కలిసి ఏక ఖండంగా ఉండేది) మన పూర్వులు భూమధ్యరేఖవద్దనున్న లంకా నగరంవద్ద '0' మెరిడియన్‌గా పెట్టుకుని భూమధ్యరేఖ మీదుగా అడ్డంగా భూమినంతా 360 డిగ్రీలుగా భాగించి వ్యవహరించేవారు. ఆధునికులు నేడు గ్రీనిచ్ పట్టణం వద్ద '0' మెరిడియన్ పెట్టుకుని నిలువుగా (తూర్పు పడమరులుగా) భూమినంతా 360 డిగ్రీలుగా విభజించి వ్యవహరిస్తున్నారు. దీనివల్ల కాలగణన అనుకూలంగా ఉంటుందని వారి ఆలోచన. అంటే, ప్రాచీనులు భూమిని ఉత్తరార్ధగోళం, దక్షిణార్ధగోళంగా విభజించివ్యవహరించారు. ఆధునికులు పూర్వార్ధగోళం, పశ్చిమార్ధంగోళంగా (ప్రాచ్య పాశ్చాత్య దేశాలుగా) వ్యవహరిస్తున్నారు.

పూర్వం ఉత్తరార్ధ గోళంలో (జంబూద్వీపంలో) ఆసియా, ఐరోపా, ఆఫ్రికా, ఉత్తర అమెరికా ఖండాలు అఖండంగా (కలిసి) ఉండేవి. కాలాంతరంలో కొంత భూభాగం సముద్రంలో మునిగిపోయింది. మునిగిపోయిన దానిని ఆధునికులు 'లెమూరియా' భూభాగం అంటున్నారు. అయిదుకోట్ల సంవత్సరాలకు పూర్వం సగరచక్రవర్తి కాలంలో ఇది సముద్రగామియైనట్లు మన గ్రంథాలలో కనబడుతున్నది.

నేడు శ్రీలకంగా కనబడుతున్న ద్వీపంకూడా భారతవర్షంతో కలిసి ఉండేది. భూమధ్యరేఖవరకు వ్యాపించి యుండేది. అందులోని

భూమధ్యరేఖకు తగులుతూ వెళ్ళేచోట మెరిడియన్‌వద్ద సున్న డిగ్రీ పెట్టారు. అక్కడ లంకానగరం ఉండేది.

అక్కడనుండి భూమధ్యరేఖ మీదుగా 90 డిగ్రీలు తూర్పుగా వెళ్ళి అక్కడ 'యవకోటి'అనే పట్టణాన్ని గుర్తించారు. అక్కడనుండి మరొక 90 డిగ్రీలు వెళ్ళి 'సిద్ధపురి' అనే పట్టణాన్ని గుర్తించారు. అంటే లంకానగరానికి సరిగా వెనుక (పాదాల క్రింద) 'సిద్ధపురి' ఉంటుంది. ఆ భూమధ్యరేఖపైననే మరొక 90 డిగ్రీలు వెళ్ళి అక్కడ 'రోమకం' అనే పట్టణాన్ని గుర్తించారు. అంటే – లంకకు సరిగా క్రిందుగా (వెనుకవైపు) సిద్ధపురి, యవకోటికి సరిగా క్రిందుగా (వెనుకవైపు) రోమకం ఉన్నాయన్న మాట. ఈ నాలుగు గుర్తులతోబాటు ఉత్తర ధృవం దగ్గర ఉన్న పర్వతానికి 'మేరువు' అనే పేరు పెట్టారు. వీటి ఆధారంతో జంబూద్వీపంలోని ఆ యా వర్షాలను (దేశాలను) ఏదిశలో ఉన్నాయో గుర్తించేవారు.

జంబూద్వీపంలో లంకా నగరాన్నుండి ప్రారంభించి దేశాలను గుర్తిస్తే ఈ విధంగా ఉంటాయి – మొదటి దేశం భారతవర్షం,దానికి ఉత్తరంలో హిమాలయ పర్వతాలున్నాయి. దానికి అంటే హిమాలయాలకు ఉత్తరంలో కింపురుషవర్షం ఉంది. దానికి ఉత్తరంలో హేమకూట పర్వతం ఉంది. దానికి ఉత్తర దిశలో హరివర్షం, దానికి ఉత్తరంలో నిషధ పర్వతం, దానికి ఉత్తరంలో ఇలావృతవర్షం ఉన్నాయి. ఈ ఇలావృతవర్షంలోనే (దేశంలోనే) మధ్యలో మేరుపర్వతం ఉంది. అంటే, లంకానగరాన్నుండి 90 డిగ్రీల యమోత్తరేఖ (లాంగిట్యూడు) వద్ద (మేరు పర్వతం) ఉంది. ఇలావృతవర్షానికి ఉత్తరాన నీలపర్వతం ఉంది. ఇది ఇప్పుడు ఉత్తర అమెరికాలో ఉంది. ఆ నీలపర్వతానికి ఉత్తరంలో రమ్యకవర్షం, దానికి ఉత్తరంలో శ్వేతపర్వతం ఉండేవి. శ్వేతపర్వతానికి ఉత్తరంలో హిరణ్యకవర్షం ఉండేది. దానికి ఉత్తరంలో శృంగవాన్‌పర్వతం,

ఆ పర్వతానికి ఉత్తరంగా కురువర్షం ఉండేవి. ఆ కురువర్ష చివర భాగాన భూమధ్యరేఖపై సిద్ధపురం ఉండేది. అంటే భారతవర్షానికి సరిగా క్రిందుగా వెనుకవైపు కురువర్షం ఉండేది. మేరువుకు చుట్టూగల ఇలావృతవర్షానికి కుడివైపు భద్రాశ్వవర్షం, ఎడమవైపు కేతుమూలవర్షం ఉండేవి. ఈ విధంగా ఉత్తరార్ధగోళంలో (జంబూద్వీపంలో) నవవర్షాలు ఉండేవి.

ఈ వివరణను దృష్టిలో పెట్టుకుని మన ప్రాచీన గ్రంథాలలోని ఇతిహాసం చదివితే ఏ ఏ వర్షాలు (దేశాలు) ఎక్కడెక్కడ ఉన్నాయో స్పష్టమౌతుంది. గ్రంథాలలో పరస్పర విరోధం ఉందనేభావం తొలగి పోతుంది. మరొక విషయం గుర్తుపెట్టుకోవాలి - మేరు పర్వతం (ఉత్తరధృవం) ఇలావృతవర్ష మధ్యభాగంలో ఉంది. ఆ ఇలావృతవర్షానికి చుట్టూ ఈ ఏడు దేశాలు అంటే 1 భారత, 2. కింపురుష, 3. హరి 4. ఇలావృత 5. రమ్యక 6. హిరణ్యక, 7. కురువర్షాలు విస్తరించి ఉన్నాయి. ఇవేగాక మరిరెండు దేశాలు సముద్రంలో మునిగిపోయాయి.

**ప్రాచీన జంబూద్వీపం (ఉత్తరార్ధగోళం) (ఊహా చిత్రం)**



8. భద్రాశ్వవర్షం ఇది యిప్పుడు పసిఫిక్ సముద్రంగా ఉంది. ఆధునిక విజ్ఞానవేత్తలు దీనిని సముద్రంలో మునిగిన 'లెమూరియా' భూభాగమంటున్నారు. 9. కేతుమూలవర్షం ఇప్పుడు అట్లాంటిక్ సముద్రంగా ఉంది. దీనిని ఆధునికులు మునిగిపోయిన 'అట్లాంటిస్' భూఖండ మంటున్నారు. భారతవర్షంలోని కొంత భూభాగం అయిదుకోట్ల సంవత్సరాలకు పూర్వం హిందూమహాసముద్రంలో మునిగిపోయింది. ఆధునికులు దీనిని 'గాండ్వానా ల్యాండు' అంటున్నారు. ఇది భారత ఆఫ్రికా ఖండాల మధ్య ఉండేదంటున్నారు.

పై విషయాలను దృష్టిలో పెట్టుకుంటే జంబూద్వీప వైశాల్యం ఈ విధంగా ఉంటుంది. నేడు మనం ఆసియా, ఆఫ్రికా, ఐరోపా, ఉత్తర అమెరికా అనే 4 ఖండాలు మరియు పసిఫిక్ అట్లాంటిక్ సముద్రాలు, హిందూమహాసముద్రంలో మునిగిన కొంతభాగం ఇవన్నీ కలిసి జంబూద్వీపంగా ఒకే భూభాగంగా ఉండేవి. ఆదిమానవసృష్టి మన భారత వర్షంలోనే జరిగింది. ఇక్కడనుండే ఆర్యులు జంబూద్వీపమంతా వ్యాపించి నివసించారు. ఆర్యులకన్న పూర్వం ఆ యా ప్రాంతాలలో వేరే మానవులు లేకుండిరి.

ఈ జంబూద్వీపాన్నంతా భారతీయ ఆర్య చక్రవర్తులే పాలించేవారు. స్వాయంభువమనువు యొక్క పుత్రుడు ప్రియవ్రతుడు తన తొమ్మండుగురు కుమారులకు జంబూద్వీపాన్ని నవవర్షములుగా (9 దేశాలుగా) చేసి పంచియిచ్చినట్లు మన చరిత్రలో కనబడుతుంది.

ఇక భరతఖండ మంటే నేటి ఆసియాఖండమని భావించవచ్చును. భరతమహారాజు ఈ ఖండాన్నంతా పాలించానరని చెబుతారు. ఇప్పుడు మనం ఉన్న భారతదేశానికే ప్రాచీన నామం భారతవర్షం. ఈ భూమిపై

ఆర్యులైన ఋషులు, యోగులు, తపస్వులు, మహారాజులు, వీరులు, ధీరులు, కళాకారులు, విజ్ఞానవేత్తలు మేధావులు, ధర్మాత్ములు అయిన స్త్రీ పురుషులంతా నడయాడినారు కనుక దీనిని అందరూ ఆర్యావర్త మన్నారు. ఈ దేశంనుండే విద్యావిజ్ఞానాలు ప్రపంచమంతా వ్యాపించాయి. సదాచారం, సంస్కృతి, సభ్యత ప్రసరించాయి. కనుకనే మను మహర్షి

ఏతద్దేశ ప్రసూతస్య సకాశా దగ్ర జన్మనః ।
స్వం స్వం చరిత్రం శిక్షేరన్ పృథివ్యాం సర్వమానవాః ॥

"ఈ దేశ అగ్రజన్ములైన విద్వాంసులవద్ద ప్రపంచ మానవులంతా విద్యా సుశిక్షలను పొందండి. వీరిని ఆదర్శంగా తీసుకుని మీ మీ చరిత్రలను నిర్మించుకోండి" అని హితువు పలికారు.

సృష్ట్యాదిలో పైవిధంగా భూమియొక్క ఉత్తరార్ధగోళం అంతా జంబూద్వీపంకాగా, దక్షిణార్ధగోళంలో 6 ద్వీపాలుండేవని మన ఇతిహాసం చెబుతుంది. వాటి ప్రాచీన నామములు - 1. ప్లక్ష ద్వీపం, 2. కుశద్వీపం, 3. క్రౌంచద్వీపం, 4. శాల్మద్వీపం, 5. శాకద్వీపం, 6. పుష్కరద్వీపం . ఈ 6 ద్వీపాలు మరియు ఉత్తరార్ధగోళంలోని అతి పెద్దదైన జంబూద్వీపం కలిసి మొత్తం భూమిపై సప్త ద్వీపాలుండేవి. "సప్తద్వీపా పృథివీ' అనే వర్ణనలు చరిత్రలో అక్కడక్కడ కనబతాయి.

ఈ సప్తద్వీపాల మధ్య సప్త సముద్రా లుండేవి. వాటి ప్రాచీన నామములు - 1. లవణసముద్రం, 2. ఇక్షుసముద్రం, 3. సురాసముద్రం 4. సర్పిసముద్రం, 5. క్షీరసముద్రం, 6. దధిసముద్రం, 7. జలసముద్రం (బహుశః వాటి వాటి రంగులను బట్టి వాటికి ఆయా పేర్లు పెట్టి ఉండవచ్చు. నేడు రెడ్‌సీ, బ్లాక్‌సీ, బ్లూసీ అన్నట్లు).

పై సప్త ద్వీపాలేకాక సప్త పాతాళాలుకూడా ఉండేవని కొందరు చెబుతారు. వారిచ్చే వివరణ ఈవిధంగా ఉంటుంది. 1. అతల (నేటి

సుమిత్రా) 2. వితల (బోర్నియా) 3 నితల (జావా) 4. గభస్తల (సిలిబోస్సు) 5. మహాతల (ఆస్ట్రేలియా) 6. సుతల (న్యూగినీ) 7. పాతాళ (న్యూజిలాండ్)

నేటి అమెరికా ఖండాన్నే పాతాళ మనే పేరుతో వ్యవహరించే వారని పెక్కురంటారు. ఈ విషయం పరిశోధించవలసి ఉంది. పం. వ్రతపాల్ ఆర్యగారు నలభై సంవత్సరాలుగా సృష్టి విజ్ఞానం గురించి పరిశోధిస్తున్నారు. వారు వ్రాసిన "వైదిక సృష్టి - విజ్ఞాన్' కూడా చదువతగినది.

'మన ఇతిహాసం' - మార్గదర్శకుడు



వైదిక ధర్మ పునరుద్ధారకుడు

**మహర్షి దయానంద సరస్వతి**

# యయాతి

మన ప్రాచీన చరిత్రను పరిశీలిస్తే నహుషుడు, యయాతి అనే పేర్లుగల యిద్దరు వ్యక్తులు చంద్రవంశంలోను, సూర్యవంశంలోను కూడా కనబడతారు. అయితే సూర్యవంశంలో జన్మించిన నహుష యయాతులు చారిత్రిక పురుషులు కాలేకపోయారు. ఇక చంద్రవంశంలో ఉద్భవించిన నహుష యయాతులు చక్రవర్తులుగా ప్రసిద్ధిని పొందటమేగాక వంశావళులను నిర్మించి భారతీయ ఇతిహాసంలో శాశ్వతంగా నిలిచిపోయారు.

మహాభారతంలో మహర్షి కృష్ణద్వైపాయనుడు వివరించిన మను వంశావళిలో నహుష యయాతులు 5, 6 తరములలోనివారు (మనువు ఇలా–పూరూరవ–ఆయువు – నహుషుడు – యయాతి) వీరిలో నహుషుడు దేవలోకాన్ని పరిపాలించిన మొదటి మానవ రాజు. అతడు దేవలోకంపై యుద్ధాన్ని ప్రకటించి ఇంద్రుని ఓడించి బందీగా పట్టుకున్న గొప్ప వీరుడు. కాని, ఇతనిలో కొంత దుష్టత ఉండేది. దేవలోకంలో ఋషుల నుండి కూడా పన్నులు వసూలు చేసినట్లు చరిత్రలో కనబడుతుంది. నహుషునకు ఆరుగురు పుత్రులు. వారి పేర్లు – యతి, యయాతి,సంయాతి, ఆయాతి మరియు ధృవుడు. వీరిలో యతి రాజ్యభారాన్ని స్వీకరించడానికి యిష్టపడలేదు. యోగసాధనలో గడుపుతానన్నాడు. అందుచే రెండవ కుమారుడైన యయాతికి రాజ్యం లభించింది.

యయాతి గొప్పవీరుడు. ఏ యుద్ధంలోను అతడు పరాజయాన్ని పొందలేదు. ఇంతేగాక, యయాతి అనేక యజ్ఞాలను చేసి ప్రజల మన్ననలను పొందినట్లుగా చరిత్రలో కనబడుతుంది. ఇతడు దానవ వంశానికి పురోహితుడుగా ఉండే శుక్రాచార్యుని కుమార్తెను వివాహం

చేసుకోవడానికి యిష్టపడ్డాడు. ఈ యిద్దరి కలయిక విచిత్రంగా జరిగినట్లు వర్ణింపబడింది.

శుక్రాచార్యుడు దానవరాజైన వృషపర్వునికి రాజపురోహితునిగా ఉండేవాడు. అతని రాజధానిలోనే ఉండేవాడు. శుక్రాచార్యుని కుమార్తె దేవయాని, వృషపర్వుని కుమార్తెయైన శర్మిష్ఠ యిద్దరు మంచి స్నేహితులుగా ఉండేవారు. విద్యాభ్యాసంలోను ఆటపాటలలోను కలిసి ఆనందంగా గడిపేవారు. అయినా వారిద్దరిలోను అంతర్గతంగా అభిమానం ఉండేది. దేవయానికి తాను సంజీవనీవిద్య తెలిసిన రాజపురోహితుని కుమార్తెననీ, తన తండ్రివలననే దానవవంశం జీవించగలుగుతోందనీ ఆమె అభిమానం.

(ఆ కాలంలో శుక్రాచార్యుల వారివద్ద మృతసంజీవనీవిద్య ఉండేదట. దానితో అతడు దేవాసుర సంగ్రామాలలో చనిపోయిన దానవులను తిరిగి బ్రతికించేవాడట. అందుచే తరచు దేవతలు పరాజయం పొందేవారట. ఈ మృతసంజీవనీవిద్య ఏమిటో మనకు బోధపడటం లేదు)

ఇక దానవరాజైన వృషపర్వుని కుమార్తె శర్మిష్ఠకు తాను రాజకుమారి ననీ, శుక్రాచార్య దేవయానులను తన తండ్రే పోషిస్తున్నాడనీ అభిమానం ఉండేది. అయినా వీరిద్దరు స్నేహితులుగానే ఉండేవారు.

దానవులు ఆచార్య శుక్రుని వల్లనే జయాన్ని పొందుతున్నారనే విషయం దేవతల రాజైన ఇంద్రునికి తెలుసు. ఏదైన ఉపాయం పన్ని శుక్రాచార్యుల వారిని దానవరాజునుండి వేరుచేసి తనవద్ద పెట్టుకోవాలని అతని అభిలాష. తగిన సమయంకోసం ఎదురుచూస్తూ ఉండేవాడు. ఒక రోజు అతనికి అట్టి అవకాశం లభించింది – ఇంద్రుడు వనవిహారం చేయడనికి అడవిలో సంచరిస్తున్నాడు. ఆ సమయంలో శర్మిష్ఠ తన సఖులతో

కలసి ఆ వనంలో జలక్రీడలు ఆడుతూ ఉండటం గమనించాడు. శర్మిష్ఠ తన పైవస్త్రాలను చెరువు గట్టుపై ఒక పొదవద్ద విడిచి చెరువులో దిగింది. దేవయాని కూడా తన పైవస్త్రాలను మరొక పొదవద్ద విడచి చెరువులో దిగింది. ఇద్దరూ ఆటపాటలలో మైమరచిపోయారు. ఇంతలో ఇంద్రుడు శర్మిష్ఠ వస్త్రాలను దేవయాని విడిచినచోట, దేవయాని వస్త్రాలను శర్మిష్ఠ వస్త్రాలను విడిచినచోట పెట్టి ఎవరికీ తెలియకుండా వెళ్ళిపోయాడు. శర్మిష్ఠా దేవయానులు చీకటి పడేవరకు జలక్రీడలలో గడిపి అలసిసొలసి చెరువుకట్టపైకి వచ్చారు. వారు తమ వస్త్రాలను పెట్టుకున్న పొదలవైపు వెళ్ళి చీకటిలోనే వస్త్రాలను ధరించసాగారు.

శర్మిష్ఠ రాజకుమారి కనుక ఖరీదైన జరీ పట్టువస్త్రాలు ధరించేది. శర్మిష్ఠ చీకటిలోనే వస్త్రాలను ధరిస్తూ అవి తనవి కావని గుర్తుపట్టింది. తన వస్త్రాలను ఎవరు ధరిస్తున్నారా? అని పరిశీలించసాగింది. దేవయాని తన వస్త్రాలను ధరిస్తూఉండటం చూసింది. శర్మిష్ఠకు కోపం వచ్చింది. “నీకు కళ్ళు కనబడటం లేదా ? ఇంత ఖరీదైన వస్త్రాలు నీవంటి పేద బ్రాహ్మణ కన్యకు ఎలా లభిస్తాయి? సిగ్గులేదా?” అని నిందించింది. దేవయాని తన తప్పును ఒప్పుకొని క్షమించమని కోరింది. అయినా శర్మిష్ఠ విడవకుండా నిందిస్తూనే ఉంది. దానితో దేవయానికి కూడా కోపం తలకెక్కింది. “నా తండ్రి పేదవాడే. సందేహం లేదు. కాని, మీ దానవులకు ప్రాణభిక్షపెడుతున్నది మా నాయనే. ఒకవేళ నా తండ్రి మీ తండ్రిని వదలిపెట్టి వెళ్ళిపోతే మీ దానవులలో ఒక్కరుకూడా బ్రతికి బయటపడరు. జాగ్రత్త” అని హెచ్చరించింది.

దానితో యిద్దరి మధ్య వాగ్వివాదం పెరిగిపోయి క్రోధంగా మారిపోయింది. అంత శర్మిష్ఠ తన చెలికత్తెలతో కలిసి దేవయానిని ఒక

బావిలోకి త్రోసివేసి అంతఃపురానికి వెళ్ళిపోయింది. దేవయాని ఎంత ప్రయత్నించినా ఆ బావి గోడలుపట్టుకుని పైకిరాలేక శోకించసాగింది. ఆ సమయంలో యయాతి వనవిహారం చేస్తూ ఆ ప్రాంతానికి రావటం జరిగింది. బావిని చూసి నీళ్ళు త్రాగగోరి నీళ్ళు తోడటానికి ప్రయత్నిస్తాడు. అంత దేవయాని ఎవరో నీళ్ళు తోడుతున్నట్లు గుర్తించి 'నన్నుకూడా పైకిలాగి రక్షించండి' అని దీనంగా మొరపెట్టుకుంది. ఆ ఆర్తనాదం విని యయాతికి జాలి కలిగింది. ఆమె చేతిని పట్టుకుని బావిబైటకులాగి రక్షిస్తాడు. ఆ చీకటిలోనే ఒకరినొకరు పరిచయం చేసుకున్నారు. అంత దేవయాని 'ఆర్యపుత్ర' మీరు నా చేతిని పట్టుకుని నన్ను బయటికి తీసుకువచ్చి కాపాడారు. కనుక మిమ్ము నా పతిగా చేసుకోగోరుచున్నాను' అని విన్నవించుకొంది.

చాలా చీకటిగా ఉండటంవల్ల యయాతి దేవయాని రూప లావణ్యాలను చూడలేదు. అందుచే 'మీ తండ్రి నాకు గురువు కనుక నేను గురుకన్యను వివాహమాడలే' నని చెప్పి ఆ సమస్యనుండి బయటపడి రాజధానికి వెళ్ళిపోయాడు. దేవయాని విలపిస్తూ యింటికి వెళ్ళి జరిగిన వృత్తాంతమంతా తండ్రికి చెప్పింది. శర్మిష్ఠ దుష్టతను శుక్రాచార్యుడు సహించలేకపోయాడు. వెంటనే దానవరాజు వృషపర్వుని దగ్గరకు వెళ్ళి శర్మిష్ఠ చేసిన దుశ్చర్య తెలిపి నేను మీ రాజ్యం వదిలి ఇప్పుడే ఇంద్రుని వద్దకు వెళ్ళిపోతున్నానని బయలుదేరాడు. వృషపర్వుడు పెద్ద సంకటంలో పడ్డాడు. అతడు వెళ్ళిపోతే దానవజాతికే ముప్పు ఏర్పడుతుందని భయపడ్డాడు. శుక్రాచార్యుని సముదాయించ ప్రయత్నించాడు. ఎంత ప్రయత్నించినా శుక్రాచార్యుని కోపం తగ్గలేదు. చివరకు విధిలేక వివశుడై నా కూతురు తప్పుచేసింది. కనుక ఈ నాటి నుండి శర్మిష్ఠ దేవయానికి

దాసిగా ఉంటుంది. దయచేసి మమ్ము వదలి పోవద్దని వృషపర్వుడు బ్రతిమలాడాడు. దానితో శుక్రాచార్యుని క్రోధం శాంతించింది. అప్పటినుండి శర్మిష్ఠ దేవయానికి దాసిగా ఉండవలసి వచ్చింది.

అనంతరం కొంతకాలం తరువాత దేవయాని తన దాసియైన శర్మిష్ఠను తీసుకుని వనవిహారానికి వెళ్ళింది. ఆ సమయంలోనే యయాతి కూడా వన విహారానికి రావటం జరిగింది. అప్పుడు యయాతి పగటి వెలుగులో దేవయానియొక్క రూపలావణ్యాలను చూసి మోహితుడయ్యాడు. ఈసారి పరస్పరం పరిచయం చేసుకున్నపుడు దేవయాని తను బావిలో పడినప్పుడు జరిగిన పూర్వ పరిచయాన్ని గుర్తుచేసింది. అప్పుడు చాలా చీకటిగా ఉండటంవల్ల దేవయాని రూపలావణ్యాలను చూడలేకపోయాడు. ఇప్పుడు పగటి ప్రకాశంలో చూడటం వల్ల ఆమెపట్ల బాగా ఆకర్షితు డయ్యాడు. ఎలాగైనా ఆమెను తన భార్యగా చేసుకోవా లనుకున్నాడు. ఆమెను నేరుగా అడిగితే నేను బ్రాహ్మణకన్యను కదా ! అంటుందేమోనని శుక్రాచార్యులవారి వద్దకు వెళ్ళి తన కోరికను తెలిపాడు. శుక్రాచార్యులు ఒక షరతుపైన దేవయానిని యివ్వడానికి అంగీకరించాడు. భవిష్యత్‌లో ఎప్పటికీ రాకుమారి శర్మిష్ఠను వివాహం చేసుకోకూడదనేదే ఆ షరతు.

యయాతి దేవయానిని వివాహం చేసుకొని దాసీలతో సహా అందరిని తన రాజధాని ప్రతిష్ఠానపురానికి తీసుకు వెళ్ళిపోయాడు. అక్కడ తన రాణి దేవయానితో సుఖంగా గడపసాగాడు. దేవయానికి ఒక పుత్రుడు కలిగిన తదుపరి అతని దృష్టి శర్మిష్ఠపై పడింది. అప్పటినుండి అతనికి దేవయానికన్న శర్మిష్ఠయే అందంగా కనబడసాగింది. క్రమంగా రహస్యంగా వీరిద్దరు కలవటం, శర్మిష్ఠకు కూడా ఒక పుత్రుడు కలగటం జరిగింది. దేవయాని నిలదీసి అడుగగా వనంలో ఒక తపస్వివల్ల ఈ

సంతానం కలిగిందని శర్మిష్ఠ అబద్ధంచెప్పి తాత్కాలికంగా తప్పించుకుంది. కాలక్రమంలో దేవయానికి యిద్దరు పుత్రులు కలుగగా శర్మిష్ఠకు ముగ్గురు పుత్రులు కలిగారు. ఒక రోజు రహస్యం బయటపడగా దేవయాని క్రోధితయై తండ్రిదగ్గరకు వెళ్ళి నా పతి మాట తప్పాడని జరిగిన వృత్తాంతమంతా తెలిపి రోదించింది. శుక్రాచార్యునికి కూడా క్రోధం తలకెక్కింది. యయాతిని 'వెంటనే వృద్ధుడవైపోవుదువుగాక' అని శపించాడు. ఫలితంగా యయాతి వృద్ధుడైపోయాడు.

అకస్మాత్తుగా తనకు కలిగిన వృద్ధాప్యానికి యయాతి భయపడిపోయాడు. శుక్రాచార్యుని శాపమే తన ఈ దుస్థితికి కారణమని తెలిసి–ఆచార్యుని చేరి క్షమించమని ప్రాధేయపడ్డాడు. చివరికి యయాతి చెప్పిన ఒక యుక్తి శుక్రాచార్యుని శాంతపరచింది. ఆ యుక్తి ఏమంటే - 'అతని కూతురు దేవయానికూడా యిప్పుడు యువతే కనుక ఆమెను చూసియైనా శాపవిముక్తిని కలిగించు'మని. 'నీ కుమారు లెవరైనా నీ వృద్ధాప్యాన్ని స్వీకరించి వారి యౌవ్వనాన్ని నీకిస్తే నీ బాధ నివారణ అవుతుందని శుక్రాచార్యుడు శాపవిముక్తికి పరిష్కారం సూచించాడు. యయాతి దేవయానికి జన్మించిన తన కుమారు లిరువురిని అడిగి చూసాడు. వారు తమ యవ్వనాన్ని యివ్వటానికి యిష్టపడలేదు. శర్మిష్ఠ కుమారులలోకూడా 'పురు' అనే పేరుగల పుత్రుడే తన యౌవనాన్ని తండ్రికి యిచ్చి వృద్ధాప్యాన్ని స్వీకరించడానికి అంగీకరించాడు. యయాతి పురుని యౌవ్వనాన్ని స్వీకరించి చాలాకాలం భోగవిలాసాలలో లిప్తుడై పోయాడు. అయినా విరివిగా దానధర్మాలు, యజ్ఞయాగాదులు, ప్రజాహితకర్యాలు చేసి ప్రజల మన్ననలను పొందాడు.

అనేక సంవత్సరాలు భోగవిలాసాలలో గడపినా యయాతికి

తృప్తి కలుగలేదు. అతడు వివేకవంతుడు కూడా కావటంవల్ల విషయ సుఖాలను అనుభవిస్తూ ఉంటే తృష్ణ పెరుగుతుందేకాని తగ్గదని అనుభవపూర్వకంగా గ్రహించాడు. విరక్తి కలిగింది. అందుచే తన యౌవ్వనాన్ని యిచ్చిన పురునకు తిరిగి యవ్వనాన్ని యిచ్చివేసి, అతనికే రాజ్యాన్ని కూడా అప్పగించి తపస్సు చేసుకోవడానికి వనాలకు వెళ్ళిపోయాడు. అనేక సంవత్సరాలు తపస్సుచేసి ఇంద్రుని రాజ్యమైన స్వర్గంలో స్థానం సంపాదించాడు. కాని, తన పుణ్యకర్మలవల్లనే తనకు స్వర్గవాసం లభించిందనీ, తానే గొప్ప పుణ్యాత్ముడననీ గర్వించసాగాడు. దీనిని గుర్తించిన యింద్రుడు అభిమానం గల నీవు దేవలోకంలో ఉండటానికి తగవని తిరిగి మానవలోకానికి పంపివేసాడు.

ఈ కథలో చరిత్రతోబాటు కొన్ని అతిశయోక్తులుకూడా ఉండటం వల్ల కల్పిత కథయేమో అనిపిస్తున్నది. కాని, యిది పూర్తిగా కల్పించిన కథ కాదు. నహుష యయాతుల అనంతరం వీరి వంశావళిలోనే యదుకుల, పురువంశాలు ప్రారంభమయ్యాయి. సత్యయుగంలో ప్రారంభమైన వీరి వంశావళి ద్వాపరయుగాంతంవరకు (మహాభారత యుద్ధంవరకు) కొనసాగింది. కనుక యిది చారిత్రిక కథయే.

ఇక అతిశయోక్తులు–మృతసంజీవనీ విద్య, యౌవ్వనాన్ని మార్పిడి చేసుకోవడం, స్వర్గలోకం. బహుశః దేవతలు మూర్ఛితులను చేసే అస్త్రం ఏదో కనిపెట్టి ప్రయోగించి ఉంటారు. దానికి విరుగుడు అస్త్రం దానవులవద్ద లేకుండవచ్చును. అట్టి మూర్ఛితులను శుక్రాచార్యులవారు మూలికలతో లేదా అట్టి చికిత్సాయజ్ఞాలతో వారిని స్పృహలోకి తీసుకు వచ్చి ఉండ వచ్చును. (రామరావణ యుద్ధంలో లక్ష్మణుడు మూర్ఛపోతే ఆంజనేయుడు సంజీవనీ మూలికను తెచ్చి కాపాడినట్లు). రెండవది – శుక్రా

చార్యుని శాపం. ఇది ఒకరకమైన సమ్మోహన విద్య (హిప్నాటిజమ్) కావచ్చు. తపస్సంపన్నుల వాక్కుల ప్రభావం సామాన్య వ్యక్తుల అర్ధచేతన మనస్సులపై తమ ప్రభావాన్ని చూపిస్తాయి. తాత్కాలికంగా శరీరంలో నంపుంసకత్వం, బలహీనత,వణుకు, భయం మొదలైనవి కలిగించవచ్చు. ఇక స్వర్గలోకం, దేవలోకం అనేవి మన భారతదేశంలోనే హిమవత్‌పర్వత ప్రాంతనికి పేర్లు. దేవతలు, అప్సరసలు, గంధర్వులు, నరులు, దానవులు అనేవి మానవులలోనే ఆయా తెగలకు పేర్లు.

యయాతి చరిత్రనుండి మనం గ్రహించవలసిన మరొక పాఠం - విషయభోగాలు (ముఖ్యంగా కామం) అనుభవిస్తే తృప్తిచెంది శాంతించదనేది. అగ్నిలో ఆజ్యంపోస్తే మంట మరింత పెరుగుతుందేకాని శాంతించదు. అట్లే కామం కూడా. యయాతి మనస్సు దేవయానినుండి మరలి శర్మిష్ఠవైపు పరుగులు తీసింది. ఆమెతోకూడా శాంతించలేదు. విశ్వాచీ అనే అప్సరసతో సంబంధం ఏర్పరచుకున్నాడు. ఒక ప్రక్క యజ్ఞయాగాదులు, దానధర్మాలు చేసి పుణ్యాన్ని ఆర్జించినా విషయవాసన పోలేదు. కామం వెంట క్రోధ లోభ మోహ అహంకారాలు పెరిగి పెద్దవయ్యాయి. ఫలితంగా దేవలోక పౌరసత్వాన్ని పోగొట్టుకుని మానవ లోకానికి తిరిగి రావలసివచ్చింది. నహుషుని చరిత్రకూడా యిట్టిదే. తన పరాక్రమంతో దేవలోకాన్ని జయించగలిగాడేకాని తనలోని అరిషడ్వర్గాలను జయించలేకపోయాడు. ఋషులనుండి పన్నులను వసూలు చేయటమే కాకుండా వారిచే తన పల్లకీ మోయించుకున్నాడు. ఇంద్రుని చెరపట్టి అతని పత్ని శచీదేవిని లొంగతీసుకోవడానికి యత్నించాడు. చివరికి ఋషుల ఆగ్రహానికి గురియై వారి శాపానికి గురియై నశించిపోయాడు.

ఇదంతా సత్యయుగానికి చెందిన చరిత్ర. అప్పటికి యింకా దేశం విదేశీ ఆక్రమణలకు గురికాలేదు. ఒక్క వైదిక ధర్మం తప్ప వేరే మతాలుకూడా లేవు. అట్టి శాంతమయ వాతావరణంలోకూడా అంతః శత్రువులైన కామ క్రోధ లోభ మెహ మద మాత్సర్యాలు విలయ తాండవం చేసాయి.

సత్యయుగానికి చెందినదే మరొక ముఖ్య ఘటన. గంగావతరణ– ఇదికూడ ఆసక్తిని కలిగించే చారిత్రిక కథనే.

## గంగావతరణ

భారతీయ సాహిత్యంలో గంగను గురించిన రెండు వర్ణనలు కనబడతాయి. ఒకటి గిరిరాజ పుత్రికయైన గంగ. ఈమె శివునికి రెండవ పత్ని. పార్వతికి సవతి. రెండవది–హిమాలయాలలో నుండి ప్రవహిస్తూ వస్తున్న గంగానది. ఈ గంగానదిని గూర్చికూడా రెండు కథలు చాలా ప్రాచీనకాలంనుండి ప్రచారంలో ఉన్నాయి. అందులో ఒకటి వాల్మీకి రామాయణంలో విశ్వామిత్రుడు శ్రీరామునకు వినిపించినది. ఇది ఒక ఆలంకారిక కథ.

"ఓ రామ ! హిమవంతుడు అనే పేరుగల ఒక పర్వతం ఉంది. అది సమస్త పర్వతాలకు రాజుగా, సర్వధాతువులకు ఖజానాగా ఉండేది. దానికి మేరు పర్వత పుత్రికయైన మైనాతో వివాహం జరిగింది. ఈ మైనా హిమవంతులకు ఇద్దరు కన్యలు జన్మించారు. ఒకరు గంగ. మరొకరు ఉమ. గంగ హిమవంతుని జ్యేష్ఠపుత్రి. కొంతకాలం జరిగిన తదుపరి దేవలోకంలో ఉండే దేవతలంతా హిమవంతుని సమీపించి మా దేవకార్యాలకోసం మీ ప్రథమ పుత్రి గంగను మాకు ప్రసాదించమని కోరారు. అందుకు హిమవంతుడు అంగీకరించి త్రిభువనముల హితం

కోరి గంగను వారికిచ్చాడు. దేవతలు కృతార్థులయ్యారు. ఆ నదియే కొంతదూరం వెళ్ళి త్రిపథ నదిగా మారింది.

ఓ రఘునందన ! శ్రీరామ ! హిమవంతుని రెండవ పుత్రి ఉమ. కఠోరమైన వ్రతనియమాలను పాటిస్తూ ఘోరమైన తపస్సు చేసి తపోధని అయ్యింది. గిరిరాజు ఆ తపస్వినీ కన్యను భగవాన్ రుద్రున కిచ్చి వివాహం గావించాడు. ఈ విధంగా హిమవంతుని ఇద్దరు పుత్రికలు - గంగా ఉమలు లోకపావను లయ్యారు. అందుచే సమస్త ప్రజలు ఆ లోక పావనులకు నతమస్తకులౌతారు."

ఈ పై కథ సాధారణ బుద్ధితో చూస్తే తల తోకలేని కట్టు కథలా కనబడుతుంది. కాని, ప్రాచీన ఇతిహాస కావ్యసరళి ననుసరించి యిది చారిత్రిక కథయే.

బహుశః జలప్లావనం జరిగిన తదుపరి దేవతలు త్రివిష్ఠప పీఠభూమిపై (టిబెట్ ప్రాంతంలో) నివసించి యుంటారు. అప్పుడు వారికి నీటికి చాలా కష్టం కలిగి ఉంటుంది. హిమాలయాలలో పుట్టిన నదులన్నీ సాధారణంగా దక్షిణం వైపుగా ప్రవహించేవి. టిబెట్ ప్రాంతానికి పోయేవి కావు. వర్షాలవల్ల చిన్న చిన్న నదులు కొన్ని ఆ దేశంలో ఏర్పడినా ఆ నీరు వారికి సరిపోకుండవచ్చు. అప్పుడు దేవతల ప్రతినిధి బృందం హిమాలయ ప్రాంతపు రాజు వద్దకు వెళ్ళి తమ కష్టాలను చెప్పుకొని గంగను తమ దేశంలోకి తీసుకువెళ్ళటానికి అనుమతి కోరారు. అంత గిరిరాజు -

**దదౌ ధర్మేణ హిమవాంస్తనయాం లోకపావనీమ్ ।**
**స్వచ్ఛన్దపథగాం గంగాం త్రైలోక్యహిత కామ్యాయ్ ॥**
**(వాల్మీకి రామాయణం. 35-18)**

స్వచ్ఛందంగా ప్రవహిస్తున్న లోకపావనియైన గంగను మూడులోకాల హితాన్ని కోరుతూ గిరిరాజు దేవలోకానికి తీసుకు వెళ్ళటానికి ధర్మపూర్వకంగా అనుమతి నిచ్చాడు.

అంత, దేవతలు ఒక పర్వతాన్ని ఛేదించి గంగను వారి రాజ్యంవైపు మరలించారు. గంగ దేవలోకానికి చేరి మూడు పాయలుగా విడి త్రిపథగా అయ్యింది. ఒక పాయ ఎత్తుగా పర్వతాలపై ప్రవహించింది. రెండవ పాయ దేవలోకంలో ప్రవహించి దేవనదిగా ప్రసిద్ధిని పొందింది.

మూడవపాయ భూమిలోని ఒక పెద్ద బిలంలోనికి వెళ్ళి పోయింది.

ఈ చారిత్రిక కథనే ఆలంకారిక కథగా కల్పించి కావ్యశైలిలో వ్రాయటం జరిగింది. గంగయొక్క కథ యింతటితో ఆగిపోలేదు. దానిని భారతదేశంలోకి తీసుకురావటం జరిగింది. ఆ కథను మహాభారతం ఈ విధంగా వివరిస్తుంది.

ఇక్ష్వాకువంశంలో 'సగరు'డనే పేరుగల రాజు ఉద్భవించాడు. అతడు వింధ్యాహిమాలయాల మధ్య ప్రదేశంలో అత్యంత వైభవంగా అశ్వమేధయజ్ఞాన్ని అనుష్ఠించసాగాడు.

సగరునకు ఇద్దరు మహారాణులు. పెద్దభార్య పేరు కేశిని. రెండవ భార్య పేరు సుమతి. చాలాకాలం వరకు ఈ యిద్దరు రాణులకు పిల్లలు కలుగలేదు. ఈ లోటును తీర్చుకోవడానికి సగరుడు తన యిద్దరు రాణులను తీసుకుని భృగు మహర్షి ఆశ్రమానికి వెళ్ళి తపస్సుచేయ ప్రారంభించాడు. కొంతకాలానికి మహర్షి ప్రసన్నుడై వారి కోరికలు తీరునట్లు వరమిచ్చాడు. "ఓ రాజా! నీ యింట చాలామంది పుత్రులు పుడతారు. మీ కీర్తిని జగద్విఖ్యాతం చేస్తారు" అని ఆశీర్వదించాడు. అంతట సగరుడు –

"ఎవరికి ఎంత మంది సంతానం కలుగుతారు? మునిశ్రేష్ఠ !" అని వినయంగా అడుగుతాడు. అందుకు "మీ భార్యలనే అడుగు. ఎవరికి ఎంతమంది కావాలంటే అంతమంది' అని సమాధానమిచ్చాడు. దానికి కేశిని నాకు ఒక పుత్రుడు చాలునన్నది. సుమతి నాకు చాలామంది సంతానం కావాలి. అరవైవేల మంది కావాలని కోరింది.

ఇద్దరి కోరికలు నెరవేరాయి. కేశినికి ఒక పుత్రుడు కలిగాడు. అతనికి 'అసమంజ' అని పేరు పెట్టారు. ఇతడు పెరిగి పెద్దవాడై చాలా దుష్టుడయ్యాడు. ప్రజలను చాలా బాధించేవాడు. తల్లిదండ్రులు, పెద్దలు ఎంత చెప్పినా అతనిలో మార్పు రాలేదు. చివరకు విసిగిపోయి మహారాజు అతనిని దేశబహిష్కారం చేసాడు. అప్పటికే అతనికి ఒక పుత్రుడు కలిగాడు. అతనిపేరు 'అంశుమానుడు'. అతడు పెరిగి పెద్దవాడైన పిమ్మటనే సగరుడు అశ్వమేధయజ్ఞం చేయటం జరిగింది.

అశ్వమేధయజ్ఞంలో భాగంగా జవసత్వాలు గల ఒక అందమైన అశ్వాన్ని రాజలాంఛనాలతో అలంకరించి స్వచ్ఛందంగా తిరిగిరావడానికి వదలిపెడతారు. అది దానికి యిష్టమైన ప్రదేశాలలో సంచరించి కొద్ది రోజుల తరువాత యజ్ఞశాలకు వస్తుంది. అప్పుడు పూర్ణాహుతి గావించి యజ్ఞాన్ని సంపూర్ణం చేస్తారు. యజ్ఞాశ్వం స్వచ్ఛందంగా తిరిగేటప్పుడు దాని రక్షణకొరకు కొందరు వీరులను దానివెంట పంపుతారు. సగరుడు చేసిన అశ్వమేధయజ్ఞంలో యజ్ఞాశ్వ రక్షణకు తన మనుమడైన అంశుమానుని నియుక్తం చేసాడు.

దేవలోకాధిపతియైన యింద్రుడు యజ్ఞయాగాదులు చేయటం వలన వృద్ధిపొందుతున్న సగరుని కీర్తి ప్రతిష్ఠలు చూసి సహించలేక పోయాడు. ఎట్టైనా యజ్ఞానికి విఘ్నం కలిగించాలనుకొన్నాడు.

తన వేషం మార్చుకొని ఎవరికీ తెలియకుండా యజ్ఞాశ్వాన్ని అపహరించుకొని పోయి పాతాళదేశంలోని కపిల మహర్షి ఆశ్రమ సమీపంలో వదలిపెట్టి వెళ్ళిపోయాడు. అశ్వరక్షణకు వచ్చిన అంశుమానుడు, సైనికులు దీనిని గుర్తించలేకపోయారు. ఎంతవెతికినా వారికి అశ్వం కనబడలేదు. దానిని అపశకునంగా భావించి అందరూ తీవ్ర మనస్తాపానికి గురిఅయ్యారు. అంతట సగరుడు ఎట్టైనా అశ్వాన్ని వెదికి తీసుకురమ్మని తన 60,000 మంది పుత్రులను నియుక్తుల చేసాడు.

యజ్ఞాశ్వాన్ని వెతకటానికి బయలుదేరిన సగరుని 60,000 మంది పుత్రులు ప్రజలను అష్టకష్టాల పాలుచేసారు. కనబడిన ప్రతి వ్యక్తినీ పట్టుకొని అశ్వం ఎక్కడ ఉంది? అని అడిగేవారు. వారినుండి సంతృప్తి కరమైన సమాధానం రాకపోతే వారిని నానాహింసలు పెట్టేవారు. వారి స్త్రీలను అవమానపరచి, వారి ఆస్తులను దోచుకొనేవారు. ప్రజల ఆర్తనాదాలు మిన్నంటాయి. కాని, భూలోకంలో ఎంత వెతికినా అశ్వం కనబడలేదు. ఇట్లు కొన్ని సంవత్సరాలు గడచిపోయింది. అశ్వం భూలోకంలో లేదని నిర్ధారణ చేసుకొని పాతాళదేశంలో వెదకటానికి బయలుదేరారు. అక్కడకూడా పై విధంగానే ప్రజలను నానా అగచాట్లకు గురిచేసారు. ప్రజలంతా వివశులై సకల విద్యావిశారదుడైన బ్రహ్మ దగ్గరకు వెళ్ళి తమ కష్టాలను చెప్పుకొన్నారు. బ్రహ్మ దూరదర్శి కావటం వల్ల ప్రజలను శాంతపరచి ఈ దుష్టులకు త్వరలోనే కీడు రాగలదని చెప్పి పంపించివేసాడు.

అశ్వం దొరకటంలో ఎంతెంత ఆలస్యమవుతూ వచ్చిందో ంతంతగా సగరపుత్రుల క్రోధం పెరగసాగింది. అత్యాచారాలు ెరగసాగాయి. అట్టి స్థితిలో కపిలమహర్షి ఆశ్రమ సమీపంలో యజ్ఞాశ్వం

స్వచ్ఛందంగా విహరిస్తూ కనబడింది. కపిలమహర్షి యోగసాధనలలో నిమగ్నమై తన ఆశ్రమ ప్రాంతంలో క్రొత్తగా వచ్చిన అశ్వాన్ని గుర్తించనే లేదు. అందుచే ఆయనకు అశ్వ విషయం పూర్తిగా తెలియనే తెలియదు.

సగరపుత్రులు కపిలమహర్షియే యజ్ఞాశ్వాన్ని దొంగిలించాడని భావించి దుర్భాషలాడుతూ ఆయనను అనేక విధాల అవమానించారు. కపిలమహర్షి యజ్ఞాశ్వ విషయం తనకు ఎంతమాత్రం తెలియదని ఎంత చెప్పినా వారు వినిపించుకోలేదు. అనేక విధాల బాధించసాగారు. దానితో క్రోధితుడైన కపిలమహర్షి వారిని శపించి భస్మంచేసివేసాడు. వారి శరీరాలు భస్మంకాగా మిగిలిన ఎముకలు పెద్దగుట్టగా తయారయ్యాయి.

యజ్ఞాశ్వం వెతకటానికి వెళ్ళిన తమ కుమారులు ఎంతకీ తిరిగి రాకపోయేటప్పటికి సగరుడు ఆందోళన చెందాడు. వారి సమాచారం తెలుసుకు రమ్మని మనుమడు అంశుమానుని పంపాడు. అంశుమానుడు తన పినతండ్రులు పాతాళలోకానికి వెళ్ళారని తెలుసుకొని పాతాళానికి వెళ్ళి వెతకసాగాడు. వెతుకుతూ వెతుకుతూ కపిలమహర్షి ఆశ్రమంవద్ద ఉన్న పెద్ద ఎముకల గుట్టను చూసి విషయం అర్థంచేసుకున్నాడు. మహర్షిని సమీపించి వినయంగా నమస్కరించి వినమ్రవాణితో ఆ అస్తికలగుట్ట రహస్యమేమని అడిగాడు. కపిలముని జరిగిన వృత్తాంతమంతా చెప్పాడు. అప్పుడు అంశుమానుడు తనను తాను పరిచయం చేసుకొని తన పితనండ్రులు చేసిన దుష్టతకు క్షమాపణ చెప్పుకొన్నాడు. దయచేసి అస్తికలను తీసుకు వెళ్ళటానికి అనుమతినిమ్మని కోరాడు. దానితోబాటు యజ్ఞాశ్వం కూడా యివ్వమని ప్రార్థించాడు. మహర్షి యజ్ఞాశ్వం గురించి నాకు ఏమీ తెలియదని తన నిస్సహాయతను ప్రకటించాడు. నిజంగా మహర్షికి ఆ విషయం తెలియదు.

కాని, ఆశ్రమ ప్రాంతంలో వెతుకగా యజ్ఞాశ్వం కనబడింది. అప్పుడు మహర్షికి పశ్చాత్తాపం కలిగి తన శాపాగ్నికి భస్మమైపోయిన వారికి సద్గతి కలిగే ఉపాయం చెబుతాడు.

స్వర్గలోకంలో ఉన్న గంగానదిని ఆర్యావర్తానికి తీసుకువచ్చి ఆ పుణ్యనదిలో ఈ అస్తికలు కలిపితే వారికి సద్గతి కలుగగలదని చెబుతాడు. వీరు యజ్ఞాశ్వం కొరకు అనేక విధాలుగా ప్రజలను పీడించారు. కనుక తరతరాలకు పాడిపంటలను సుఖశాంతులను ప్రసాదించే ఆ పుణ్యనదిని తీసుకురావడమొకటే తరుణోపాయం అని చెబుతాడు. అంశుమానుడు సరేనని చెప్పి, భక్తి శ్రద్ధలతో నమస్కరించి యజ్ఞాశ్వాన్ని తీసుకొని రాజధానికి వస్తాడు. ప్రారంభించిన యజ్ఞం పూర్ణాహుతితో పూర్తవుతుంది. కాని, తన కుమారులకు సద్గతి ఎట్లు కలిగించాలా? అనే చింత మిగులుతుంది. సగరుడు చాలాకాలం రాజ్యపాలన గావించాడు. కాని, గంగానదిని ఆర్యావర్తానికి తీసుకురాలేకపోయాడు.

ఆనాడు స్వర్గలోకంగా వ్యవహరింపబడే ఎత్తైన హిమాలయ పర్వత ప్రాంతంలో ప్రవహించే గంగానదిని ఆర్యావర్తానికి తీసుకు రావటానికి చాలా యిబ్బందులుండేవి. కొన్ని పర్వతాలను ఛేదించి దారి చేయవలసి ఉంది. ఇంతేగాక, స్వర్గలోకానికి రాజైన బ్రహ్మ యొక్క అనుమతి, దేవలోకానికి రాజైన ఇంద్రుని అనుమతి, హిమాలయ పర్వత ప్రాంతపు రాజుల అనుమతి కావలసియుండేది. వీటితోబాటు అభియంతల (ఇంజనీయర్ల) అవసరముండేది. మహారాజు సగరుడు తను జీవించినంత కాలం వీటికొరకు ప్రయత్నం చేస్తూనేఉన్నాడు. కాని, అతని ప్రయత్నం అతడు జీవించి ఉన్నపుడు ఫలించలేదు.

సగరుని అనంతరం అంశుమానుడు తీవ్ర ప్రయత్నం చేసాడు.

కాని, కార్యరూపం ధరించలేదు. అనంతరం దిలీపుడు చాలా ప్రయత్నం చేసాడు. అయినా నెరవేరలేదు. దిలీపుని అనంతరం అతని పుత్రుడు భగీరథుడు రాజయ్యాడు. అతని తీవ్ర తపస్సు ప్రయత్నాలవల్ల బ్రహ్మను, ఇంద్రుని, హిమాలయాధీసులను ఒప్పించగలిగాడు. ముఖ్యంగా కైలాసదేశాధినేత శివుని సహకారంవల్ల భగీరథుడు వారందరి అనుమతిని పొందగలిగాడు. వీరందరి కృషి ఫలితంగా హిమాలయ పర్వత పంక్తిని ఛేదించి స్వర్గలోకంలో ప్రవహిస్తున్న గంగానదిని దారి మరలించి ఆర్యావర్తమైదాన ప్రాంతానికి తీసుకురాగలిగాడు. అందుచే గంగానదికి 'భగీరథి' అనే మరొక పేరు వచ్చింది. అంటే భగీరథుని తపః ఫలంగా (కృషి ఫలంగా) లభించిన నది.

దీనితోబాటు గంగావతరణ గురించి మరికొన్ని విషయాలు చెప్పబడ్డాయి. గంగ ఆకాశంనుండి ముందుగా కైలాస పర్వతంపైకి చేరి మానస సరోవరంలో కలిసిపోయింది. అక్కడనుండి అది భూమ్యాంతర్గత మార్గం ద్వారా బిందు సరోవరంలో ప్రవేశించింది. అక్కడనుండి మూడు పాయలు (ధారలు) తూర్పువైపునకు, మూడు ధారలు పడమటవైపునకు ప్రవహిస్తూ వెళ్ళాయి.ఏడవధార భగీరథ మహారాజు యొక్క రథము వెంట ప్రవహిస్తూ భారతదేశానికి వచ్చింది.

పై కథ చారిత్రిక కథ అయినప్పటికి కొన్ని అతిశయోక్తులు చేర్చి వ్రాయబడుటచే కల్పించి వ్రాసిన కట్టుకథవలె కనబడుతున్నది. సగరుని రెండవ భార్య సుమతికి అరవైవేలమంది పుత్రులు కలగడం, వారంతా కపిల మహర్షి శాపంతో భస్మమై పోవటంమొదలైనవి వింతగా కనబడతాయి. బహుశః ఏవో ఆధ్యాత్మికార్థాలు తెలపటానికి ఈ కథలో జోడించి ఉంటారు. ఇట్టి విషయాలను తొలగించి చూస్తే గంగానదిని

ఆర్యావర్తానికి తీసుకురావడానికి మన పూర్వులు చాలా తపస్సు (ప్రయత్నం) చేసినట్లు కనబడుతుంది.

గంగావతరణ గురించి మరికొన్ని కథలు ప్రచారంలో ఉన్నాయి. గంగ దివినుండి భువికి దిగివచ్చిందని చెబుతారు. - విష్ణుపాదాల నుండి గంగ పుట్టిందట. అది భూమిపైకి తీసుకు వచ్చేటప్పుడు అంతటి జలపాతాన్ని ధరించగల శక్తిశాలి అవసరమయ్యాడట. ఆనాడు అంతటి శక్తిశాలి శివుడేనట. అతనిని ప్రార్థించి, అతని సహకారంతో గంగను భూమిపైకి తీసుకువచ్చారట.

అంతరిక్షంలో మేఘాలరూపంలో ఉన్న శుద్ధ జలాన్నే గంగ అంటారు. అది పర్వతాలపైన ఎక్కువగా వర్షిస్తుంది. మేఘాలలో ఏర్పడే మెరుపులు మేఘాలు వర్షించటానికి తోడ్పడతాయి. అట్టి మెరుపులను ఆకాశీయ విద్యుత్ అంటారు. విద్యుత్‌నే వేదాలు శివుడు అని వర్ణిస్తాయి. ఇది ఆధ్యాత్మిక విషయం. అందుచే ఈ ఇతిహాసంలో చేర్చటం లేదు. తెలుసుకోగోరేవారు మాచే ప్రచురింపబడిన 'గంగాధర శివుడు' అనే పుస్తకం చదువగోరుచున్నాము.

ఇవేగాక సత్యయుగానికి చెందిన మరెన్నో ముఖ్య ఘటనలు ఉండి ఉంటాయి. వాటిని గూర్చిన ఇతిహాసం కాలగర్భంలో కలిసిపోయింది. ఈ కొన్ని ఘటనలే ఆలంకారిక కథలుగా ప్రజలలో వ్యాపించటంవల్ల సుమారు 30 కోట్ల సంవత్సరాలు గడచిపోయినా నిలిచిఉన్నాయి. మధ్యలో ఎన్నో పాక్షిక ప్రళయాలు జరిగినా నశించి పోకుండా నిలబడి ఉన్నాయి. కొందరి చరిత్రకారుల అభిప్రాయమేమంటే నేటి చరిత్ర గ్రంథాలవలె పేర్లు, తేదీలతో ఘటనలు పేర్కొంటే ఇంత సుదీర్ఘకాలం చరిత్ర ఉండేదికాదంటారు. చరిత్రను ఆలంకారిక కథలుగా

వర్ణించటంవల్ల అవి సామాన్య ప్రజలలో వ్యాపించిపోయి తరాలు గడచినా నిలిచిఉన్నాయంటారు. మరికొందరు ఈ అలంకారిక కథలవల్లనే మూఢనమ్మకాలు వ్యాపించాయంటారు.

## త్రేతాయుగం
## విశ్వామిత్ర వశిష్ఠ సంఘర్షణ

ఇప్పుడు మనకు లభిస్తున్న త్రేతాయుగ చరిత్రలో మొదటి ఘటన (కథ) విశ్వామిత్ర వశిష్ఠుల సంఘర్షణ. దీనిలో కొన్ని అతిశయోక్తులు చేర్చబడ్డాయి. ఈ యిద్దరు మహర్షుల మధ్య జరిగిన సంఘర్షణ బ్రాహ్మణత్వ - క్షత్రియత్వముల మధ్య జరిగిన సంఘర్షణగా తలంచ బడుతుంది. కథ ఈ విధంగా ఉంది -

త్రేతాయుగంలో 'కుశ' అనే పేరుగల ఒక రాజు ఉండేవాడు. అతని అనంతరం అతని పుత్రుడు కుశనాభుడు రాజయ్యాడు. ఆ కుశనాభుని పుత్రుడు గాధి. గాధి యొక్క కుమారుడే విశ్వామిత్రుడు.

విశ్వామిత్రుడు పట్టాభిషిక్తుడైన తదుపరి ఒక అక్షౌహిణి సైన్యాన్ని తీసుకొని రాజ్యంలో జైత్రయాత చేయసాగాడు. అతడు ఆ విధంగా దేశసంచారం చేస్తూ వశిష్ఠమహర్షి ఆశ్రమానికి చేరుకొన్నాడు. వశిష్ఠ మహర్షి ఆశ్రమం సువిశాలంగా సుందరంగా సువ్యవస్థతతో అత్యంత మనోహరంగా ఉంది. ఫలపుష్ప భరిత వృక్షాలతో, అందమైన పక్షులతో, విలాసంగా తిరుగుతున్న వన్యప్రాణులతో చూడముచ్చటగా ఉంది. దేవతలు, దానవులు, గంధర్వులు, కిన్నెరలు ఆ ఆశ్రమానికి వచ్చి మహర్షికి నమస్కరించి వెడుతున్నారు. మహాత్ములు, తపస్వినులు, సిద్ధపురుషులు కూడ ఆశ్రమాన్ని సందర్శించి వెడుతున్నారు. అందుచే ఆ వశిష్ఠాశ్రమం

బ్రహ్మలోకంవలె భాసిస్తూ ఉంది. అది చూసి విశ్వామిత్రుడు మహర్షి దర్శనం చేసుకోవాలని ఆశ్రమంలో ప్రవేశించాడు.

ఆశ్రమవాసులు విశ్వామిత్రుని యథోచితంగా సత్కరించి స్వాగతం పలికారు. విశ్వామిత్రుడు బ్రహ్మతేజస్సుతో వెలిగిపోతున్న వశిష్ఠమహర్షిని దర్శించి ప్రసన్నుడయ్యాడు. అత్యంత వినయంగా పాదాభివందనం చేసాడు. మహాత్మా వశిష్ఠుడు కూడా మహారాజు విశ్వామిత్రునికి సత్కారపూర్వకంగా స్వాగతం పలికాడు. ఉచిత ఆసనంపై ఆశీనుని చేసి కుశల ప్రశ్నలడిగాడు. ఫలపుష్పాదులతో అతిథి సత్కారం చేసాడు. వార్తాలాపానంతరం విశ్వామిత్రుడు సెలవు కోరాడు. అంతట వశిష్ఠుడు మీకు, మీ సేనకంతకి పూర్ణ అతిథ్య మివ్వగోరుచున్నాను స్వీకరించి వెళ్ళమని కోరాడు. దానికి విశ్వామిత్రుడు సంకోచించాడు. తనసేనకంతకీ ఆతిథ్యమివ్వటం మునికి భారం అవుతందని అతని సంకోచం. దీనిని గ్రహించిన మహర్షి మీరేమీ సంకోచించవద్దు తగిన వ్యవస్థ ఉందని చెప్పి ఆతిథ్యం స్వీకరించ బలవంతం చేసాడు. వివశుడై విశ్వామిత్రు డంగీకరించాడు.

వెంటనే వశిష్ఠుడు తన కామధేనువు శబలను రప్పించి మహారాజుకు, సేనకు సంతృప్తికరమైన భోజనాన్ని సిద్ధం చేయమన్నాడు. క్షణాల్లో కామధేనువు పంచభక్ష్యపరమాన్నాదులను సిద్ధంచేసి స్వీకరించుమని ప్రార్థించింది. మహారాజు, రాణులు, సేన అంతా ఆ స్వాదిష్ట పదార్థాల నారగించి పరవశులయ్యారు. ఇంతకుముందెన్నడు అనుభవించని తృప్తిని వారు పొందారు. శబలయొక్క కౌశలానికి అంతా విస్మయులయ్యారు.

విశ్వామిత్రుడు మహర్షికి ధన్యవాదాలు తెలిపి సెలవు తీసుకుంటూ – "ఓ మునిశ్రేష్ఠా ! మీ ఆతిథ్యం వల్ల మేమంతా చాలా

సంతృప్తి చెందాము. మీ వద్ద ఉన్న కామధేనువు శబల మావంటి మహారాజుల గోశాలలో ఉండతగినది. దీనికి బదులుగా హృష్టపుష్టము లైన పెక్కు గోవుల నివ్వగలను. దయచేసి మీ కామధేనువును మా కివ్వం"డని ప్రార్థించాడు. మహర్షి ఈ కోరికను మన్నించలేదు. కోట్ల గోవుల నిచ్చినా, ధన కనక రత్న రాశుల నిచ్చినా నా శబలను వదలలేనన్నాడు. మా ఆశ్రమవాసుల జీవతమంతా ఈ ధేనువుపైననే ఆధారపడి యున్నది. అది కూడా మమ్ము వదలిపెట్టి పోలేదు. కనుక ఈ విషయంలో మమ్ము బలవంత పెట్టవద్దని విన్నవించాడు.

దానితో విశ్వామిత్రుని అహం దెబ్బతింది. మహారాజునైన నా ప్రార్ధనను కూడా అంగీకరించటం లేదేమని క్రోధితుడయ్యాడు. తన క్రోధాన్ని కప్పి పెడుతూ మహర్షికి మరెన్నో ప్రలోభాలు చూప యత్నించాడు. అయినా వశిష్ఠుడు అంగీకరించలేదు. అంత - విశ్వామిత్రుడు శబలను బలవంతంగా తీసుకుపోవడానికి యత్నించాడు. అది విదిలించుకొని వశిష్ఠుని వద్దకు వెళ్ళిపోయి దీనంగా అతని వెనుక దాగింది. నన్ను రక్షించమంటూ జాలికలిగేటట్టు ప్రార్థించింది.

"మహర్షీ ! నన్ను విశ్వామిత్రునకు ఇచ్చివేస్తున్నారా?' అని అడిగింది. దానికి మహర్షి "లేదు శబలా ! నేను నిన్ను యివ్వటం లేదు. అతడే నిన్ను బలాత్కారంగా తీసుకుపోతున్నా"డన్నాడు.

దానికి శబల – 'ఓ మహర్షీ ! బ్రాహ్మణ బలంకంటె క్షత్రియ బలం ఎక్కువ కాదు. అందునా మీ బ్రహ్మ తేజస్సుముందు ఎంతటి క్షాత్రబలమైనా నిలబడలేదు. ఓ మునివర్యా ! నన్ను ఆజ్ఞాపించండి. దుష్టుడైన ఈ రాజు అభిమానాన్ని చూర్ణంచేసి చూపిస్తా' నంది. మహాముని వశిష్ఠుడు ఆజ్ఞాపించాడు.

అంత, కామధేనువు అపారమైన సైన్యాన్ని సృష్టించింది. ముందుగా పహ్లవజాతి సేన వశిష్ఠుని, కామధేనువును రక్షించడానికి ముందుకు వచ్చింది. రెండు సైన్యాలకి పెద్ద యుద్ధమే జరిగింది. మహారాజు విశ్వామిత్రుడు ఉన్నతకోటికి చెందిన యోధుడు. అనేక శస్త్రాస్త్రములను ప్రయోగించగల నేర్పరి. అందుచే పహ్లవసేన పరాజయాన్ని పొందింది. వెంటనే యవనశాకకు చెందిన సేన వశిష్ఠుని రక్షణకై ముందుకు వచ్చింది. దానిని కూడా విశ్వామిత్రుడు నిరోధించాడు. అతని ధాటికి ఆగలేక యవనశాక వెనుతిరిగింది. అనంతరం బర్బరసేన ముందుకు వచ్చింది. అదికూడా పరాజయాన్ని చవిచూచింది. అంతట మ్లేచ్ఛ, హారీత సేనలు ఒక్కసారిగా తలపడ్డాయి. వాటితో మిగిలిన సేనలన్నీ కలిసి విశ్వామిత్రునిపై విజృంభించాయి. ఫలితంగా విశ్వామిత్రుని సైన్యమంతా సమాప్తమయ్యింది.

దానితో విశ్వామిత్రుని పుత్రులకు రోషం వచ్చింది. వారంతా శస్త్రాస్త్రాలు తీసుకుని వశిష్ఠుని ఒక్కసారిగా ముట్టడించారు. అంతట వశిష్ఠుడు వారిని తేరిపార చూసాడు. అతని క్రోధాగ్నికి వారంతా భస్మమైపోయారు.

తన సేనంతా నష్టమైపోవుటయేగాక తన కుమారులు భస్మమై పోవడం చూసి విశ్వామిత్రుడు దిగ్భ్రాంతి చెందాడు. చేసేదిలేక విశ్వామిత్రుడు వెనుతిరిగిపోయాడు. చింతాగ్రస్థుడయ్యాడు. భస్మముకాగా మిగిలిన ఏకైక పుత్రునకు రాజ్యాన్ని అప్పగించి, తపస్సుచేసి దివ్యశక్తులను పొందడానికి వనాలకు వెళ్ళిపోయాడు. హిమాలయ పర్వతాలను దాటి కైలాస పర్వతాన్నిచేరి శివుని అనుగ్రహంకోసం తపస్సు చేయసాగాడు.

కొంతకాలం తపస్సుచేయగా శివుడు సంతుష్టుడై నీకేమి కావాలని అడిగాడు. అంతట విశ్వామిత్రుడు దేవ దానవ గంధర్వ యక్ష రాక్షసాదులందరి శస్త్రాస్త్రాలు నాకు ప్రసాదించమన్నాడు. మహాదేవుడు తన వద్ద ఉన్న శస్త్రాస్త్రాల నన్నిటిని అతని కిచ్చివేసాడు. విశ్వామిత్రుడు వాటినన్నిటిని గ్రహించి అభిమానవంతుడై వశిష్ఠమహర్షిపై యుద్ధానికి బయలుదేరాడు. అతనికి లభించిన ఆ దివ్యాస్త్రాలతో వశిష్ఠమహర్షి ఆశ్రమం చుట్టూ ఉండే అరణ్యాన్ని దగ్ధంచేయ ప్రారంభించాడు. దానితో అందలి ప్రాణులన్నీ హాహాకారాలు చేస్తూ పరుగులు తీసాయి.

ఆ హృదయ విదారక దృశ్యం చూసి మహర్షి హృదయం చలించిపోయింది. వెంటనే తన బ్రహ్మదండం తీసుకొని విశ్వామిత్రుని ఎదుటకు వచ్చాడు. అతని బ్రహ్మదండ తేజస్సుకు విశ్వామిత్రుని దివ్యాస్త్రాలన్నీ దగ్ధమై పోయాయి. చివరి ప్రయత్నంగా విశ్వామిత్రుడు తన బ్రహ్మాస్త్రాన్ని ప్రయోగించాడు. అదికూడా వశిష్ఠుని బ్రహ్మదండం ముందు చల్లబడిపోయింది. దానితో విశ్వామిత్రునికి జ్ఞానోదయ మయ్యింది. క్షాత్రశక్తికన్న బ్రాహ్మీశక్తియే గొప్పదని గ్రహించాడు. నేను కూడా వశిష్ఠుని వంటి బ్రహ్మఋషిని కావాలనే సంకల్పం కలిగింది. తపస్సు చేయడానికి వనాలకు వెళ్ళిపోయాడు.

అనేక సంవత్సరాలు తీవ్రమైన తపస్సు చేయగా చేయగా బ్రహ్మవిద్యను పొందగలిగాడు. ఆత్మ పరమాత్మల జ్ఞానం పొంది శాంతుడయ్యాడు.

ఈ చారిత్రిక కథలో రెండు అతిశయోక్తులు చేర్చబడ్డాయి. అందుచే ఇది కల్పిత కథవలె కనబడుతున్నది. అందులో మొదటిది కామధేనువు. మన గ్రంథాలలో అచ్చటచ్చట కామధేను కల్పతరువుల

ప్రసక్తి కనబడుతుంది. ఈ రెండూ మన కోరికల నన్నిటిని నెరవేరుస్తాయనే భావం ప్రజలలో ఉంది. బహుశః గోవు మరియు వృక్షం బహుళ ప్రయోజనకారులు కావటం వల్ల వాటికి 'మన కోరికల నన్నిటిని నెరవేర్చేవి' అనే అర్థంవచ్చే విశేషణాలు జోడించి ఉండవచ్చు.

ఈ కథలోని శబలాకామధేనువు మధురమైన పుష్టికరమైన క్షీరాన్ని సమృద్ధిగా నిచ్చి సంతోషపెట్టే గోవు కావచ్చు. లేదా ఒక నేర్పరియైన కార్యకర్త్రి కావచ్చు. ఆమె అతి చాకచక్యంగా క్షణాల్లో అన్నిటిని సమకూర్చగల నేర్పరి కావచ్చు. వశిష్ఠ మహర్షి ఆశ్రమంలో ఆశ్రమ సేవకు అంకితమై పనిచేస్తూ ఉండవచ్చు. ఆమె నేర్పరితనాన్ని స్ఫూర్తిని చూసి విశ్వామిత్రుడు తన దర్బారుకు తీసుకువెళ్ళగోరి యుండవచ్చు. దానికి వశిష్ఠుడు అంగీకరించకపోవటం, దాడిని ఎదుర్కోవటం జరిగింది. మహర్షి సర్వజన ప్రియుడు కావటంవల్ల అతనిని రక్షించడానికి అన్ని జాతులవారు ముందుకువచ్చారు.

ఆ రోజులలో దేవతలలో శివుడు శస్త్రాస్త్ర సంపన్నుడు. కుశల సేనాధిపతి. సేనావ్యూహ రచయిత. అందుచే అతనిని మెప్పించి శస్త్రాస్త్రాలను సంపాదించి తిరిగి యుద్ధానికి వచ్చాడు. బ్రహ్మజ్ఞానం గల వశిష్ఠ మహర్షి విశ్వామిత్రుని దాడికి ఎంతమాత్రం భయపడక ఎదిరించాడు. ఆత్మ పరమాత్మల జ్ఞానం గల ఆ మహర్షి ధైర్యానికి విశ్వామిత్రుడు విస్తుపోయి వెనుతిరిగియుండవచ్చు. చరిత్రలో అలగ్జాండరు సార్వభౌమున్ని హిమాలయ పర్వతప్రాంతపు ఒక సంన్యాసి ఎదిరించి మాట్లాడినట్లు ఈ సంఘటన జరిగి ఉండవచ్చు. దానిని కవులు అతిశయోక్తిగా వ్రాసి యుండవచ్చు.

## రాక్షసజాతి ఉత్పత్తి - పరాజయము

భారతీయ పరంపర ననుసరించి దేవ, దానవ, దైత్య, రాక్షస, గంధర్వ, మానవ, యక్ష పేర్లతో వ్యవహరింపబడేవారంతా మానవులే. వారి కా పేర్లు వారి గుణ కర్మ స్వభావాలతో వచ్చినవి కూడా కావు. చరిత్రలో అవి జాతివాచకములే. అనగా ఆయా తెగలకు చెందినవి. కొన్ని పేర్లు ఆయా దేశాలను బట్టి ఏర్పడ్డాయి. కొన్ని పేర్లు ఆయా వంశాలనుబట్టి ఏర్పడ్డాయి. పై జాతులన్నిటిలోను మంచివారూ ఉన్నారు, చెడ్డవారూ ఉన్నారు. అందుచే ఒకే జాతిలో కూడా అంతఃకలహాలు, యుద్ధాలు ఏర్పడేవి. ఉదాహరణకు కశ్యప ప్రజాపతి కుమారుడు హిరణ్యకశిపుడు. హిరణ్యకశిపుని కుమారుడు ప్రహ్లాదుడు (దేవతా గుణాలు కలిగినవానికి రాక్షసుడు. రాక్షసగుణాలు గలవానికి దేవతాగుణాలు కలవాడుపుట్టటం జరిగింది) అయినా వీరి వంశావళి నంతటిని దైత్యులే అన్నారు. ఇది ఒక జాతిగా - తెగగా వ్యవహరించారు.

ఇట్టిదే మరొక ఉదాహరణ సూర్యవంశంలో కనబడుతుంది. రఘుమహారాజుని కుమారుడు ప్రవృద్ధుడు. వీనికే మరొకపేరు కల్మాషపాదుడు. ఇతడు అసురుడయ్యాడు. అట్లే అసుర జాతిలో పుట్టిన రావణుని తమ్ముడు విభీషణుడు దేవతయ్యాడు.

జలప్లావనానంతరం హిమాలయ, టిబెట్ ప్రాంతాలలో నివసించేవారిని దేవత లని వ్యవహరించడం ప్రారంభమయ్యింది. అంతకు పూర్వం వీరంతా పృథివి అంతటా విస్తరించి ఉండేవారు. రాక్షసజాతికూడ బ్రహ్మనుండే ఉత్పన్నమయ్యింది. రాజస తామస ప్రవృత్తి గలవారైన వీరంతా ఆ బ్రహ్మను 'మా రాజ్యమేది?' అని అడిగారు. అంత బ్రహ్మ దక్షిణార్ధగోళంలో సముద్రం నుండి బయటకు వస్తున్న ద్వీపాలను

చూపించి వాటిని మీరు పాలించండి (రక్షించండి) అని చెప్పాడు. అంటే, వాటిని రక్షించే భారం వారి కప్పగించాడు. అప్పటినుండి ఆ ద్వీపవాసులు రాక్షసులుగా - రాక్షసజాతిగా అంటే రాక్షసతెగగా ఏర్పడింది. ఇదంతా జలప్లావనకన్న ముందు జరిగిన విషయమే. అయినా, ప్లావనానంతరం కూడా వీరి సంతానాన్ని రాక్షసులుగానే వ్యవహరించటం జరిగింది. వారు కూడా తమను రాక్షసులుగా (రక్షకులుగా) చెప్పుకొనేవారు.

త్రేతాయుగంలో రాక్షసజాతిలో 'హేతి' అనే పేరుగల ఒక రాజు ఉద్భవించాడు. ఇతడు శారీరక ఆత్మిక బలసంపన్నుడేగాక గొప్ప మేధావి కూడా. గొప్ప రాజుగా ప్రసిద్ధిని పొందాడు. 'కాల' యొక్క సోదరి 'భయ'తో యితనికి వివాహం జరిగింది. వీరికి ఒక పుత్రుడు పుట్టాడు. అతనికి 'విద్యుత్కేశ' అనే పేరు పెట్టారు. ఈ విద్యుత్కేశునకు సంధ్యాయొక్క పుత్రి 'సాలకటంకటా'తో వివాహం జరిగింది. కొద్ది కాలంలోనే సాలకటంకటా గర్భవతి అయ్యింది. ఆమె ఒక పుత్రునికి జన్మనిచ్చింది. కాని, పుత్రుని పాలన పోషణ చేయ యిష్టపడక ఆ బాలుని మంద్రాచల పర్వత ప్రాంతంలో విడిచిపెట్టి తానువెళ్ళి భర్తతో సుఖంగా గడపసాగింది. ఆ శిశువు ఆకలితో రోదించసాగాడు. విమాన విహారం చేస్తున్న శివపార్వతులకు ఆ బాలుని రోదన వినబడింది.

పార్వతికి దయ కలిగి విమానం అక్కడ దింపుమని కోరింది. పతియైన శివుని అనుమతి తీసుకొని బాలుని ఎత్తుకొని తనవెంట తమ కైలాసరాజ్యానికి తీసుకువెళ్ళింది. బాలుని పాలన పోషణలకు ఏర్పాటు చేసింది. 'సుకేశు' డనే పేరుపెట్టి పెంచసాగింది. క్రమంగా పార్వతికి ఆ బాలునిపై మమకారం ఏర్పడింది. ఆ బాలునికి అభయప్రదానం చెయ్యుమని శివుని కోరింది. శివుడు సుకేశునకు అభయమిచ్చుటయే

గాక విహరించటానికి ఒక విమానం కూడా యిచ్చాడు.

క్రమంగా సుకేశునకు యువావస్థ వచ్చింది. శివునకు తెలిసిన గ్రామణీ అనే గంధర్వ స్త్రీ తన పుత్రిక దేవవతిని సుకేశునకిచ్చి వివాహం జరిపించింది. ఈ దంపతులకు మాల్యవాన్, సుమాలీ మరియు మాలీ అనే ముగ్గురు పుత్రులు పుట్టారు. రాక్షస గంధర్వ జాతుల రక్తకలయికతో ఏర్పడిన ఈ మువ్వురు పుత్రులు వీరులు, విద్వాంసులుకూడా అయ్యారు. కాని అత్యంత భయంకర ప్రవృత్తికలవారయ్యారు. వీరు ముప్వురూ తపస్సుచేసి మరింత బలవంతులయ్యారు. దానితో వారి గర్వం పెరిగింది. మా అంత బలవంతులు ఈ భూమిపై మరెవ్వరూ లేరనే అహంకారం ఏర్పడింది. దానితో యితరులను బాధిస్తూ తమ స్వార్థం నెరవేర్చుకోసాగారు. వారు దేవతలనేకాక అసురులనుకూడా వేధించసాగారు. దానితో లోకమంతా హాహాకారాలు చెయ్యటం మొదలయ్యింది.

ఈ ముప్వురు తమకు అత్యంత సుందర భవనాలను నిర్మించి యిమ్మని విశ్వకర్మను ఆదేశించారు. లంకా రాజ్యంలోని త్రికూట పర్వంతపై సుదృఢమైన సుందర భవనాలను నిర్మించుమని నిర్దేశించారు. ఆనాటి వారిలో విశ్వకర్మ గొప్ప శిల్పి (ఇంజనీయరు). ఆ దుష్టుల దుశ్చర్యలకు భయపడి వివశుడై విశ్వకర్మ వారు కోరిన విధంగా మనోహరమైన మూడు భవనాలను నిర్మించియిచ్చాడు. వారు అందులోచేరి సుఖంగా జీవించసాగారు. వారికి అండగా ఉండటానికి వారి అనుచరులను కూడా ఆ నగరంలో చేర్చుకున్నారు.

ఆ ముప్వురు సోదరులు నర్మదా అనే పేరుగల గంధర్వ స్త్రీ యొక్క ముగ్గురు కుమార్తెలను వివాహం చేసుకున్నారు. వారిలో మాల్యవంతుడు సుందరీ అనే పేరుగల కన్యను వివాహమాడాడు.

వీరిరువురికి ఏడుగురు పుత్రులు కలిగారు. రెండవవాడైన సుమాలీ కేతుమతిని చేపట్టాడు. ఈ దంపతులకు పదిమంది పుత్రులు, నలుగురు పుత్రికలు జన్మించారు. మూడవవాడైన మాలీ వివాహం వసుధాతో జరిగింది. వీరికి నలుగరు పుత్రులు కలిగారు.

ఈ ముగ్గురు తమకు తోచిన దానికే - నమ్మిన దానికే ధర్మమని పేరుపెట్టారు. ప్రజలంతా దానిని అనుసరించాలని ఆదేశించారు. ప్రజలను వారి సుఖ సాధనాలుగా వాడుకుంటూ పీడించసాగారు. వీరి బాధలను తట్టుకోలేక ప్రజలంతా మహాదేవుని దగ్గరకువెళ్ళి తమను ఈ రాక్షసజాతి నుండి రక్షించుమని ప్రార్థించారు. అంత మహాదేవుడు - 'ఈ రాక్షసులు ముగ్గురు పార్వతికి అత్యంత ప్రీతిపాత్రుడైన సుకేశుని పుత్రులు. వీరి కిదివరలో నేను అభయమిచ్చియుంటిని. కావున నేనేమియు చేయజాల' నని తన అశక్తతను తెలిపాడు విష్ణు సహాయము కోరుమని సూచించాడు. ప్రజలు అట్లే చేసారు. విష్ణువు వారి కభయమిచ్చాడు.

ఈ విషయం సుకేశునకు, అతని పుత్రులకు తెలిసింది. విష్ణువు తమపై యుద్ధానికి రాకముందే అతనిపై ఆక్రమణ చెయ్యాలనుకున్నారు. రాక్షస బలగాన్నంతా సమాయత్తంచేసి దేవలోకంపై దురాక్రమణ చేయసాగారు. అంత విష్ణువు తన ఆయుధాలన్నిటిని తీసుకుని గరుడ విమానమెక్కి రాక్షససేనపై విజృంభించాడు. విష్ణువు ధాటికి తట్టుకోలేక రాక్షససేన తమ లంకానగరంవైపు పరుగులు తీసింది. వెంటనే సుమాలి జాగరూకుడై రాక్షససేనను ఉత్సాహపరచి విష్ణువుపై తలపడ్డాడు. చాలా భయంకరమైన యుద్ధం జరిగింది. చివరికి విష్ణువు తన సుదర్శన చక్రాన్ని ప్రయోగించి మాలి శిరస్సును ఖండించాడు. దానితో అతని అన్నలు ఇరువురు భయపడి లంకానగరానికి పరుగులు తీసారు. విష్ణువు వారిని

వెంటాడాడు. మరొకసారి వీరి మధ్య ఘోరయుద్ధం జరిగింది. సుదర్శన చక్ర ధాటికి రాక్షసులు నిలువలేకపోయారు. రాక్షసులంతా భయపడి పాతాళదేశానికి పారిపోయారు.

## రావణ జననం - సమర యాత్ర

బ్రహ్మయొక్క మానస పుత్రులలో పులస్త్యుడు ఒకడు. పులస్త్య మహర్షి గురించి మనకు తెలిసింది స్వల్పమే. ఇతడు మేరు పర్వత సమీపంలో రాజర్షి తృణవిన్దు ఆశ్రమమంలో ఉండేవాడు. ఘటనావశాత్తు తృణవిన్దుని కుమార్తె పులస్త్యుని పట్ల ఆకర్షితురాలై గర్భవతి అయ్యింది. అందుచే పెద్దలు వారిద్దరికి వివాహం జరిపించారు. వారికి ఒక పుత్రుడు కలిగాడు. ఆ బాలునికి 'విశ్రవ' అని పేరు పెట్టారు. కుబేరుడు ఈ విశ్రవుని సంతానంలోని వాడే. అందుచే కుబేరునికి వైశ్రవణుడు అనే పేరుకూడా వచ్చింది.

కుబేరుడు గొప్ప తపస్వి. ధర్మాత్ముడు. బలశాలికూడా. అందుచే దేవతలు ఇతనిని 4వ లోకపాలకునిగా ఎన్నుకొన్నారు. ఇంతకు పూర్వమే యముడు, ఇంద్రుడు, వరుణుడు అనే ముగ్గురు లోకపాలకులను ఎన్నుకోవడం జరిగింది. వీరు ముగ్గురు మూడు వైపుల ఉండి దేవలోక భూలోకాలను రక్షించేవారు. అందుచే కుబేరునికి దక్షిణ సముద్రాన్ని రక్షించే భారం అప్పగించారు. అప్పటికి రాక్షసులు ఖాలీచేసి పాతాళానికి వెళ్ళిపోయిన లంకానగరం ఖాళీగా ఉండేది. దానిని కుబేరున కప్పగించారు.

ఒకసారి సుమాలి తన పత్నితో కలిసి మానవలోకానికి వచ్చి విహరిస్తూ ఉండగా ఒక సంఘటన జరిగింది. సరిగా అదే సమయంలో కుబేరుడు ఒక విమానంలో ఆసీనుడై ఏదో పనిమీద దేవలోకంవైపు వెడుతున్నాడు. కుబేరుడు ధనవంతుడు బలవంతుడేకాక సుందరుడుకూడా.

అతనిని చూసిన సుమాలికి ఒక ఆలోచన వచ్చింది. ఈతని ద్వారా తన వంశానికి ఉన్నతిని కలిగించుకోవచ్చు ననుకున్నాడు. ఏదైనా యోజనపన్ని కుబేరుని లంకానగరంనుండి వెళ్ళకొట్టాలనుకున్నాడు.

సుమాలి వెంటనే తన రాజ్యానికి వెళ్ళి తన కుమార్తె కైకసిని పిలిచి బుజ్జగిస్తూ – నీకు యోగ్యమైన ఒక వరుని చూసివచ్చాను. అతనిని నీవు వరించి సేవించి సంతానవతివి కావాలన్నాడు. ఆ వరుడే పులస్త్య మహర్షి యొక్క పుత్రుడు విశ్రవుడు అన్నాడు. కైకసి తన తండ్రి ఆలోచనను గ్రహించింది. తన వంశాన్ని ఉద్ధరించుకోవాలని ఆమెకు కూడా సంకల్పం కలిగింది. వెంటనే విశ్రవుని ఆశ్రమానికి చేరుకుంది. అప్పటికి విశ్రవుడు అగ్నిహోత్రం చేస్తున్నాడు. కైకసి అతని తేజస్వంతమైన రూపాన్ని చూసి మోహిత అయ్యింది. అతని ఎదుట నిలబడి తన హావభావాలను ప్రకటించసాగింది. విశ్రవునిలోకూడా కామేచ్ఛ కలిగింది. ఎవరు నీవని అడిగాడు. ఏ పనిమీద వచ్చావన్నాడు. అంత కైకసి – నేను మాతా పితరుల ఆజ్ఞ తీసుకునే మీ సేవలో గడపాలని వచ్చానన్నది. తన ద్వారా సంతానం కోరుతున్నదని విశ్రవుడు గ్రహించాడు. ఆమె కోరిక నెరవేర్చాడు. ఈ దంపతులకు ముగ్గురు పుత్రులు, ఒక పుత్రిక కలిగారు. మొదటి పుత్రుడు రావణుడు. రెండవవాడు కుంభకర్ణుడు. మూడవవాడు విభీషణుడు. పుత్రిక పేరు శూర్పణఖ.

రావణుడు తల్లి కైకసి యొక్క ప్రేరణతో ఘోరమైన తపస్సు చేసి గొప్ప బలశాలి అయ్యాడు. బ్రహ్మయొక్క ఆశీర్వాదాన్ని పొందాడు. తండ్రి విశ్రవుడుకూడా పుత్రుని చూసి ప్రసన్నుడయ్యాడు. కైకసి మరొకసారి పుత్రుని ప్రేరేపించి లంకానగరాన్ని కోరమని తండ్రివద్దకు పంపింది. రావణుడు తండ్రివద్దకు వెళ్ళి లంకానగరాన్ని తనకు ఇప్పించుమని కోరాడు.

తండ్రి విశ్రవుడు – నాయనా! నీ కోరిక మంచిదికాదు. అది నీ వినాశనానికే దారితీస్తుందని నచ్చచెప్ప ప్రయత్నించాడు. అయినా రావణుడు వినలేదు. నేరుగా లంకానగరానికి పోయి తన అన్న కుబేరుని భయపెట్టాడు. వెంటనే లంకానగరాన్ని ఖాళీచేసి వెళ్ళిపొమ్మన్నాడు. విశ్రవుడు చేసేదిలేక అన్నదమ్ముల మధ్య కలహం మంచిదికాదు' అని పెద్దకుమారుడైన కుబేరునకు నచ్చచెప్పాడు. కుబేరుడు వివశుడై లంకానగరాన్ని ఖాళీచేసి దూరంగా మరొక నగరాన్ని నిర్మించుకొని నివసింపసాగాడు. ఈ విధంగా లంకానగరం రావణుని వశమయ్యింది.

రావణుడు తన సంబంధీకులైన రాక్షసులనందరిని పాతాళం నుండి లంకానగరానికి పిలిపించుకున్నాడు. దృఢమైన సైనికబలాన్ని సమీకరించుకొని రాజ్యాన్ని విస్తరింపజేసాడు. ఉత్తరభారతాన్ని కూడా ఆక్రమించాలనే ఆలోచనలో ఉన్నాడు. మొదటినుండి రాక్షసుల ప్రవృత్తి దేవతల, నరుల ప్రవృత్తులకన్న భిన్నంగా ఉండేది. రాక్షసులలో నాస్తిక భావాలు ఎక్కువగా ఉండేవి. దేవునికన్న స్వశక్తే గొప్పదనే అహంకారం ఉండేది. శక్తే ధర్మమని వారి భావన. మద్యపానం, నరమాంసభక్షణ, వ్యభిచారం వారి వ్యసనాలు. ఈ వ్యవహారం వల్లనే రాక్షసులు అసురులయ్యారు.

రావణుని వివాహం దైత్యరాజైన యముని కుమార్తె మండోదరితో జరిగింది. ఆ దంపతులకు ఒక కుమారుడు కలిగాడు. అతనికి మేఘనాథుడని నామకరణం చేసారు. కుంభకర్ణుని వివాహం బలియొక్క దౌహుత్రి (కుమార్తె యొక్క కుమార్తె) 'వజ్రజ్వాలా'తోను, విభీషణుని వివాహం గంధర్వకన్య 'సరయూ'తోను జరిగాయి.

రావణుడు, అతని అనుచరులు దక్షిణభారతాన్ని తమ వశంలో

పెట్టుకుని తమ అత్యాచారాలతోను, పాపాచారాలతోను ప్రజలను పీడించసాగారు. దండకారణ్యంలో నివసించే వానప్రస్థులను, తపస్వులను వేధించసాగారు. వారి యజ్ఞయాగాదులను అపవిత్రంచేసి అవమానించ సాగారు. కుబేరుడు వీరి దురాగతాలను చూసి సహించలేకపోయాడు. తన తమ్మునికి నచ్చజెప్ప ఒక దూతను రావణుని వద్దకు పంపాడు. దానితో రావణుడు మరింత క్రుద్ధుడై ఆ దూతను చంపివేసాడు. రావణుడు దక్షిణభారతంతోనే సంతృప్తిని చెందలేదు. ఉత్తరభారతాన్ని, దేవలోకాన్ని కూడ ఆక్రమించుకోవాలనే కోరిక కలిగింది. ఇంతలో రావణుని కుమారుడు మేఘనాథుడుకూడా పెరిగి పెద్దవాడయ్యాడు. తపస్సుచేసి బల పరాక్రమాలను పెంచుకున్నాడు. శస్త్రాస్త్రవిద్యలన్నీ నేర్చుకున్నాడు. బ్రహ్మాది దేవతల ఆశీస్సులు పొందాడు.

రావణుడు తన అనుచరులను తీసుకుని దేవలోకంపై దండయాత్రచేసాడు. దేవతలు ఎదుర్కొన్నారు. భయంకరమైన యుద్ధం జరిగింది. చివరకు మేఘనాథుడు దేవరాజైన ఇంద్రుని బందీగా పట్టుకున్నాడు. ఇది తెలిసి బ్రహ్మ అచ్చటకు వచ్చి యిద్దరిమధ్య సంధి కుదిర్చి ఇంద్రుని విడిపించాడు. అందుచేతనే మేఘనాథునకు ఇంద్రజిత్ అనే పేరు వచ్చింది.

దేవలోకంపై విజయాన్ని పొందిన తరువాత రావణుడు ఆర్యావర్తాన్ని తేలికగా జయించవచ్చు ననుకున్నాడు. కాని, మొదటి యుద్ధంలోనే పరాజితుడయ్యాడు. నర్మదానది ప్రాంతాన్ని పాలించే రాజు అర్జునునిపై రావణుడు యుద్ధం ప్రకటించాడు. భీషణసంగ్రామం జరిగింది. పర్యవసానంగా రావణుడు ఓడిపోయాడు. అర్జునుడు రావణుని బందీగా పట్టుకొని తన రాజధానియైన మహిష్మతీ నగరానికి తీసుకుపోయాడు.

రావణుని పితామహుడైన పులస్త్యునకు ఈ విషయం తెలిసింది. వెంటనే అతడు బయలుదేరి వచ్చి అర్జునునకు నచ్చజెప్పి రావణుని విడిపించాడు. దీనితో రావణునకు ఆర్యచక్రవర్తుల పరాక్రమం అవగతమయ్యింది. అప్పటినుండి ఉత్తరభారతంవైపు కన్నెత్తిచూడ సాహసించలేదు. ఇక అతని దృష్టి దక్షిణభారతంవైపు మరలింది.

ఆనాడు దక్షిణంలో వానరరాజు వాలి ఉండేవాడు. అతడు ఆర్యరాజు కాదుకనుక ఆ రాజ్యాన్ని తేలికగా వశం చేసుకోవచ్చు ననుకున్నాడు. అతనిపైకూడా నేరుగా ఆక్రమణ చేయ సాహసించలేదు. వంచనతో వాలిని వశపరచుకోవాలనుకున్నాడు. ఒకరోజు వాలి సాగరతీరంలో సంధ్యోపాసనలో లీనమై ఉండటం రావణుడు చూసాడు. వెనుకనుండి వచ్చి అతనిని పట్టుకోవడానికి ప్రయత్నించాడు. వాలి యిది గ్రహించాడు. చటుక్కున రావణుని తనవైపుకు లాగి తన బాహువులలో బంధించి వాలి తన సంధ్యోపాసనలో లగ్నమయ్యాడు. రావణుడు ఎంత విదిలించుకున్నా వాలి పట్టునుండి విడివడలేదు. తీరికగా వాలి తన పని పూర్తిచేసుకొని రావణుని మరింత బంధించి తన రాజధాని కిష్కిందాపురికి తీసుకుపోయి చెఱశాలలో పెట్టాడు. అయినా యిద్దరి మధ్యా వార్తాలాపాలు జరిగాయి. ఇద్దరు ఒకరికొకరు సహాయంగా ఉంటూ మిత్రులుగా గడపాలనుకున్నారు. అగ్నిహోత్రం చేసి అగ్నిసాక్షిగా మిత్రతాదీక్ష తీసుకున్నారు.

ఈ రెండవ సంఘటనతో రావణుని ఉత్సాహం నిర్వీర్య మయ్యింది. దేవలోకంపై విజయం సాధించి అనేక సంపదలను, సుందరీ మణులను లంకానగరనికి చేర్చగలిగాడేకాని ఆర్యావర్తంపై విజయం సాధించలేకపోయాడు. త్రిలోకాధిపతిని కావాలనే అతని కోరిక కలగానే

ఉండి పోయిందికాని సాకారం కాలేదు. అందుచే ఆర్యసంస్కృతిని నష్టపరచాలనుకున్నాడు. ఆర్యసంస్కృతికి మూలం వానప్రస్థులుగా గడిపే ఋషులు, మునులు, తపస్వులు, విద్వాంసులు కనుక వారిని సమాప్తం చెయ్యాలనుకున్నాడు. 14వేలమంది రాక్షస సైన్యాన్నిచ్చి తన సోదరుని కుమారుడైన ఖరుని, తన సేనాధిపతియైన దూషణుని దండకారణ్యానికి పంపాడు. ముందు ఆ ప్రాంతాన్ని తన వశంలో పెట్టుకుని అనంతరం ఆర్యావర్తాన్ని ఆక్రమించి తనవశం చేసుకోవలనేది అతని ఆలోచన.

ఖర దూషణు లిద్దరు వింధ్యాచల పర్వత ప్రాంతమందలి వానప్రస్థులైన ఋషులను మునులను యోగులను హింసించసాగారు. వారి యజ్ఞయాగాదులలో మాంస మద్యాదులను పడవేసేవారు. వారిని హింసించి చంపి నరమాంసభక్షణ చేసేవారు. లేని యుద్ధవాతావరణం అక్కడ నెలకొంది. అదికూడ ఏకపక్షయుద్ధం. నిరాయుధులు, సాధువులునైన ఆ తాపసికులను ఊచకోతకోసి ఆనందించేవారు. ఆ సమయంలోనే దశరథ పుత్రుడు శ్రీరాముడు తండ్రివచనాలకు కట్టుబడి తమ్ముడు లక్ష్మణునితోను, భార్య సీతతోను వనవాసం కొరకు ఆ దండకారణ్యానికి రావటం జరిగింది. సూక్ష్మగ్రాహియైన శ్రీరాముడు కొద్ది రోజులలోనే అక్కడి పరిస్థితిని అర్థంచేసుకున్నాడు. ఇంతేగాక శ్రీరాముని రాకను తెలుసుకున్న అక్కడి వానప్రస్థులు శ్రీరాముని వద్దకు వచ్చి తమ తమ కష్టాలను విన్నవించుకొని రక్షించుమని ప్రార్థించారు. వాల్మీకిరామాయణ ఆరణ్యకాండ ఆరవ అధ్యాయంలో ఈ విషయం విస్తారంగా వర్ణించబడింది.

# రామ - రావణ యుద్ధం

ఇక్కడ విషయాంతరంగా మరొక విషయం తెలిసికోవలసి ఉంది. చరిత్రను పరిశీలించి చూస్తే - ఆనాటి దేవతలు జ్ఞాన విజ్ఞానాలలో సమున్నత స్థానం పొందినవారుగా కనబడతారు. అందులో ముఖ్యంగా బ్రహ్మ, ఇంద్రుడు, శివుడు దివ్యాస్త్రాల నిర్మాణంలో నిపుణులు. ఇంతేగాక, వారికి తెలిసిన ఆ విద్యలను స్వ పర భేదం లేకుండా నేర్చుకోగల యోగ్యులైన వారెవరైనా నేర్పేవారు. వారు దేవతా వర్గానికి చెందినవారైనప్పటికి వారు పొందిన ఆ విజ్ఞానాన్ని సంపూర్ణ మానవజాతి యొక్క నిధిగా భావించేవారు. అందుచే ఏ జాతికి (వర్గానికి) చెందిన వ్యక్తి వచ్చి అడిగినా అతడు నేర్చుకోగల యోగ్యుడని వారు భావిస్తే నేర్పేవారు. ఆదికాలం నుండి ఇది యిట్లే వస్తున్నది. హిరణ్యకశిపుడు బ్రహ్మకు శిష్యుడై శస్త్రాస్త్ర సంపన్నుడయ్యాడు. దానితో అతనిని చంపటానికి అతని ప్రజల సహకారం అవసరమయ్యింది. ఇట్లే కొందరు దైత్యులు దేవతలనుండి వరాలు పొందినట్లుగా చరిత్రలో కనబడుతుంది. అయితే, దైత్యులు దివ్యాస్త్రాలతో అమాయకులను, సాధుసజ్జనులను హింసిస్తూ ఉంటే దేవతలు సహించేవారుకాదు. వారిని హెచ్చరించి చూచేవారు. వినకుంటే సంహరించడానికి తగిన యోజన చేసేవారు.

రావణ మేఘనాథులు కూడా బ్రహ్మకు, శివునకు శిష్యులై తపస్సు చేసి వారిని మెప్పించి వారి ఆశీర్వాదం పొందారు. అంటే వారినుండి శస్త్రాస్త్ర విద్యలను నేర్చుకున్నారు. కాని, అహంకార అభిమానాలకు గరియయ్యారు. ఆ దివ్యాస్త్రాలను స్వార్థంకోసం వినియోగించుకోసాగారు. దానితో దేవతల ఆగ్రహానికి గురియయ్యారు.

పరమేశ్వరుడు సర్వవ్యాపకుడు, సర్వాంతర్యామి, సర్వేశ్వరుడు,

సర్వజ్ఞుడు కనుక దండకారణ్య తపస్వుల ఆక్రందనలను వినకపోలేదు. అత్యంతన్యాయకారియైన పరమేశ్వరుడు మహాబలశాలురైన రావణ మేఘనాథులను చంపగల సమర్ధుడైన ఒక జీవాత్మను (మహాత్ముని - మహాపురుషుని) ఆర్యావర్తంలో జన్మింపజేసాడు. అతడే శ్రీరాముడు.

శ్రీరాముడు సర్వసద్గుణ సుభూషితుడు. మూర్తీభవించిన ధర్మమూర్తి. ఇంతేగాక, బలపరాక్రమాలలో అద్వితీయుడు. అందుచేతనే చిన్న వయస్సులోనే మాయావియైన తాటకిని సంహరించగలిగాడు. దుష్ట దైత్యులబారినుండి మహర్షి విశ్వామిత్రుని యాగాన్ని సంరక్షించగలిగాడు. మారీచ సుబాహులను భయభీతుల చేయగలిగాడు. ఎంతటి బలశాలియైనా వింటినారిని కూడా ఎక్కించలేని శివధనస్సును అవలీలగా విరిచివేయగలిగాడు. వాల్మీకి రామాయణాన్ని సూక్ష్మంగా అధ్యయనం చేస్తే శ్రీరాముడు కారణజన్ముడైన మహాపురుషుడని అర్థం అవుతుంది. ఇది సంక్షిప్త ఇతిహాసం కనుక యిక్కడ శ్రీరాముని గూర్చి విశేషంగా వర్ణించలేకపోతున్నాము. శ్రీరాముని యథార్థ చరిత్రను తెలిసుకోగోరువారు మాచే ప్రచురింపబడిన 'పురుషోత్తముడు శ్రీరాముడు' అనే పుస్తకాన్ని చదువగోరుచున్నాము. శ్రీరాముని గాథ మీ అందరికి తెలిసినదే కనుక దండకారణ్యం నుండి సంక్షిప్త చరిత్ర వ్రాయటం జరుగుతున్నది.

వనవాసం చేస్తూ శ్రీరాముడు సీతా లక్ష్మణ సమేతుడై దండకారణ్యానికి చేరుకోవటం జరిగింది. దండకారణ్యవాసుల కష్టాలను విన్న శ్రీరాముడు వారిని రక్షించ అక్కడనే ఉండిపోయాడు. సంఘర్షణ అవశ్యకమే అనుకున్నాడు. అదే జరిగింది.

ఆ ప్రాంతంలోనే నివసిస్తున్న రావణుని సోదరి సూర్పణఖ రామ లక్ష్మణుల సుందరాకారాలను చూసి మోహిత అయ్యింది. వీరిలో

ఎవరినైనా వివాహం చేసుకోవాలనుకున్నది. రామలక్ష్మణులిరువురు ఆమె కోరికను నిరాకరించారు. సీత ఉన్నందువల్లనే రామలక్ష్మణులు తన కోర్కె నంగీకరించుటలేదు కనుక సీతను సంహరించాలనుకున్నది. ఆమెను చంప ఆమెవైపు పరుగులు తీసింది. అంత లక్ష్మణుడు సూర్పణఖను నిరోధించి ఆమె ముక్కు చెవులను కోసి కురూపిని చేసాడు. పరాభవించటమే సరిపోతుందని భావించాడు.

అంతట శూర్పణఖ ఏడుస్తూ బొబ్బలుపెడుతూ ఖరుని దగ్గరకు వెళ్ళి జరిగిన వృత్తాంతం చెప్పింది. ఖరుడు క్రోధితుడై రామలక్ష్మణులను సంహరించి రమ్మని దూషణుని పంపాడు. రామలక్ష్మణులు దూషణుని అవలీలగా చంపివేసారు. అంతట ఖరుడు తన పద్నాలుగువేల రాక్షస సేనను తీసుకొని రామలక్ష్మణులను బంధించ ప్రయాణమయ్యాడు. రాముడు ఏదైనా ప్రమాదము జరుగవచ్చునని భావించి లక్ష్మణుని తోడుగా యిచ్చి సీతను దూరంగా వనాలలోకి పంపివేసాడు. తానొక్కడే ఆ రాక్షససేన నంతటిని ఎదుర్కొన్నాడు.

ఇంతకుపూర్వమే శ్రీరాముడు విశ్వామిత్ర మహర్షినుండి, అగస్త్యముని నుండి దివ్యాస్త్రాలను పొందియుండుటచే ఆ రాక్షససేన నంతటిని అవలీలగా సంహరించగలిగాడు. దానితో శూర్పణఖ క్రోధం మరింత పెరిగింది. పెద్దన్నగారైన రావణుని వద్దకు వెళ్ళి తనకు జరిగిన పరాభవాన్ని తెలిపి ప్రతీకారం చేయుమని మొరపెట్టుకుంది. శ్రీరాముడు ఖర దూషణులను, రాక్షససేనను సంహరించిన విషయం కూడా తెలిపింది. రాముని పరాక్రమాన్ని విని రావణుడు విస్మయం చెందాడు. అతనిని నేరుగా ఎదుర్కోవటం కష్టమనుకున్నాడు. ఏదైనా పథకం వేసి సంహరించాలనుకున్నాడు.

సీతయొక్క రూపలావణ్యాలను గురించి విన్న రావణుడు సీతను అపహరించి తన లంకానగరానికి తీసుకుపోయాడు. ఆమెను ఎట్లైనా ఒప్పించి తన రాణిని చేసుకోవాలనుకున్నాడు. కాని, సీత అందుకు అంగీకరించలేదు. సీతను వెదుకుతూ రామలక్ష్మణులు కిష్కింధ ప్రాంతానికి వచ్చారు. హనుమంతుని ద్వారా వారికి సుగ్రీవునితో మైత్రి ఏర్పడింది. వాలియొక్క తమ్ముడే సుగ్రీవుడు. వాలి సుగ్రీవుని రాజ్యాన్ని తన వశం చేసుకొని సుగ్రీవుని భార్య తారను బలవంతంగా తన పత్నిగా చేసుకున్నాడు. ఇంతేగాక, సుగ్రీవుని చంప ఉద్యుక్తుడయ్యాడు. అందుచే సుగ్రీవుడు కొందరు అనుచరులను తీసుకొని వనాలకు వెళ్ళిపోయాడు.

సీతను రావణుడు అపహరించుకొని దక్షిణం వైపుగా తీసుకువెళ్ళిపోయాడని సుగ్రీవుడు రామునికి తెలిపాడు. శ్రీరామ సుగ్రీవుల మధ్య ఒక ఒప్పందం కుదిరింది. శ్రీరాముడు సుగ్రీవుని రాజ్యాన్ని, అతని భార్యను వాలియొక్క బంధనాన్నుండి విడిపించి అతనికి యిప్పించుటకును, సుగ్రీవుడు సీతను రావణుని బంధంనుండి విడిపించి శ్రీరామునకు యిప్పించుటకును ఆ ఒప్పొందం కుదిరింది. ఈ మైత్రిలో హనుమంతుని పాత్ర అద్వితీయమైనది. ఆయనే స్వయంగా పురోహితుడై అగ్నిహోత్రం చేయించి శ్రీరామ సుగ్రీవులతో ప్రతిజ్ఞలు చేయించాడు.

అనంతరం హనుమంతుడు సీతాన్వేషణ చేసివచ్చి సీత లంకలో అశోకవనంలో ఉన్నట్లు చెప్పాడు. శ్రీరామ సుగ్రీవులు వానరసేనా సమేతులై దక్షిణ సముద్రతీరానికి చేరుకున్నారు. రావణ సోదరుడు విభీషణుడు సీతను రామున కప్పగించుటే క్షేమకర'మని ఉపదేశించినందు వల్ల రావణుని ఆగ్రహానికి గురి అయ్యాడు. విభీషణుడు శ్రీరాముని శరణుజొచ్చుట, శ్రీరాముడు అభయమిచ్చుట జరిగింది. సముద్రంపై

వంతెన కట్టకుండా సముద్రాన్ని దాటటం గాని, యుద్ధం చేయటం గాని అసాధ్యమని విభీషణుడు చెప్పాడు. నలుని పర్యవేక్షణలో 5 రోజులతో 58 మైళ్ళ పొడవుగల వంతెన నిర్మింపబడింది.

హస్తిమాత్రాన్ మహాకాయాః పాషాణాంశ్చ మహాబలాః ।
పర్వతాంశ్చ సముత్పాట్య యన్త్రైః పరివహన్తి చ ।
(వా.రా. యుద్ధకాం. 17వ సర్గం)

ఏనుగులవంటి విశాల శరీరాలుగల వానరులు పెద్దపెద్ద పర్వతాలను పగులగొట్టి యంత్రాలతో (క్రేన్‌లతో) సముద్రంలోకి చేర్చి వంతెన కట్టారు.

ఈ వంతెన యిప్పటికీ సముద్రగర్భంలో ఉంది. భూగర్భ శాస్త్రజ్ఞులు దీనికి ఆడమ్స్ బ్రిడ్జి అని పేరు పెట్టారు. ఈమధ్య నాసా - అమెరికా అంతరిక్ష పరిశోధనా సంస్థ దీనిని గుర్తించింది. ఇది 17,50,000 సం॥ల క్రిందట నిర్మింపబడిందని వారంటున్నారు. రామేశ్వరం నుండి శ్రీలంకలోని మన్నార్‌జిల్లా తీరప్రాంతం వరకు 30 కిలోమీటర్ల పొడవు వంతెన ఇప్పటికీ సముద్ర గర్భంలో ఉందట.

రెండవ ప్రపంచ యుద్ధ సమయంలో కూడా జపాన్‌వారు మలేషియానుండి సింగపూర్‌వరకు స్వల్పకాలంలోనే ఒక వంతెన నిర్మించారు. వెనుకనుండి ఆంగ్లేయులపై దాడి జరిపారు. అట్లే నలుడు ఈ వంతెన నిర్మించి అందరిని ఆశ్చర్యచకితులను చేసాడు.

రామలక్ష్మణులు లంకానగరంపై దండయాత్రకు బయలుదేరారు. ఘోరమైన యుద్ధం జరిగింది. పర్యవసానంగా రావణుడు తన సంబంధీకు లందరితోసహా సర్వనాశనమైపోయాడు. శ్రీరాముడు ధర్మాత్ముడైన విభీషణునికి లంకానగరాన్ని అప్పగించాడు. పద్నాలుగు సంవత్సరాల

వనవాసదీక్ష పూర్తికావటంతో శ్రీరాముడు సీతా లక్ష్మణులతోను, వానరాధిపతి సుగ్రీవునితోను, లంకాధిపతి విభీషణుని తోను, వజ్రాంగబలి వీరహనుమంతునితోను కలిసి అయోధ్యానగరానికి చేరుకున్నాడు.

రాక్షసుల రాజ్యమైన లంకారాజ్యం ధర్మాత్ముడైన విభీషణుని చేతికి రావటంవల్ల అది ధర్మరాజ్యంగా ప్రసిద్ధి చెందింది.

రావణ మేఘనాథులవద్ద దేవతలనుండి పొందిన దివ్యాస్త్రాలెన్ని ఉన్నా అధర్మాన్ననుసరించి అధోగతిపాలయ్యారు. ధర్మనిష్ఠులైన రామలక్ష్మణులవద్ద అటువంటి దివ్యాస్త్రాలేవీ లేకపోయినా విజయాన్ని పొంది వర్ధిల్లారు. మానవజాతికి చెందిన విశ్వామిత్ర అగస్త్య ఋషుల వద్ద నేర్చుకున్న అస్త్రశస్త్రవిద్యలతోనే రావణ మేఘనాథులను మట్టి కరిపించారు. 'ధర్మ ఏవ జయతే' అను ఆర్యోక్తిని సార్ధకం చేసారు. వీరాజంనేయుని వీరవిహారంముందు రాక్షసమూకలు కకావికలైనవి.

హనుమంతుడు వీరుడేకాక విద్వాంసుడుకూడా. ఆయన వేదవేదాంగవేత్త. నవవ్యాకరణ పండితుడు. ఆయన వాక్కునుండి ఒక్క అపశబ్దముకూడా వెలువడదు. ధర్మమూర్తి. స్వామిభక్తి సచ్ఛీలత కలిగిన ఆదర్శ పురుషుడు. అట్టి వ్యక్తిని కొందరు కోతియని భావించుట విచారకరము. అట్టివారు ఒకసారి వాల్మీకి రామాయణమున కిష్కింధకాండ చదివితే హనుమంతు డెవరో అర్థమౌతుంది. వానరులు ఒక జాతికి (తెగకు) చెందిన మానవులే. వారికి తోకలుకూడా లేవు.

రామాయణ కథ అందరికి తెలిసినదే కనుక ఈ పరిచయ గ్రంథంలో సంక్షిప్తంగా వ్రాయబడింది. ఈ చరిత్ర త్రేతాయుగ చివరభాగంలో జరిగినట్లు చెబుతారు. ఇక మనం ద్వాపరయుగ విశేషాలను తెలుసుకుందాము.

# ద్వాపరయుగము

## శకుంతల మరియు భరతుడు

మహాభారత ఆదిపర్వంలో శకుంతలా దుష్యంతుల గాంధర్వ వివాహ ప్రసక్తి వస్తుంది. పూర్వ ప్రకరణాలలో మనువంశావళిలో ఇక్ష్వాకునినుండి సూర్యవంశము, ఇలా నుండి చంద్రవంశము ప్రచలితమైనట్టు తెలుసుకొనియుంటిమి. సత్యయుగంలో ప్రారంభమైన చంద్రవంశం ద్వాపరయుగాంతంవరకు కొనసాగింది. మహాభారతాన్ననుసరించి ద్వాపరయుగంలోని మొదటి చంద్రవంశీయ మహారాజు దుష్యంతుడు. ఇతడుకూడా ద్వాపరయుగ మధ్యకాలంలో జన్మించినట్లు కనబడుతుంది. అంతకు పూర్వం రాజులు అంత ప్రముఖులుకారు. దుష్యంతుని తండ్రిపేరు ఈలన. ఈలనకు గల అయిదుగరు పుత్రులలో దుష్యంతుడు పెద్దవాడు. అందుచే అతనికి రాజ్యాధికారం వచ్చింది. ఇంతేగాక, అతడు శౌర్యపరాక్రమాలుగల రాజ్యపాలనాదక్షుడు.

ఒకరోజు దుష్యంతుడు తన విశాల సైనికపరివారంతో ఒక దట్టమైన అడవిలో వేటకై బయలుదేరాడు. రాజు వన్య మృగాలను వేటాడుతూ ఆ యడవిలో అటునిటు విహరించసాగాడు. కొన్ని మృగాలను వేటాడుతూ దుష్యంతుడు తన సైనిక పరివారాన్ని విడచి దూరంగా వెళ్ళటం జరిగింది. అక్కడ కణ్వమహర్షి ఆశ్రమం అతనికి కనబడింది. మహర్షిని కలిసి వెళ్ళాలనుకొని దుష్యంతుడు ఆ ఆశ్రమంలో ప్రవేశించాడు. అప్పుడు మహర్షి కందమూలఫలాలు తెచ్చుటకు అడవిలోకి వెళ్ళియుండెను. ఆశ్రమంలో మహర్షి పెంపుడు పుత్రిక శకుంతల మాత్రమే ఉంది. ఆమె రూపలావణ్యాలనుచూసి రాజు మోహితుడయ్యాడు. నిన్ను వివాహం చేసుకోగోరుచున్నా నన్నాడు. శకుంతల – 'తండ్రి వచ్చేవరకు

నిరీక్షించండి. వారి అనుమతి తీసుకొని వివాహం చేసుకుందా'మన్నది. కాని, దుష్యంతుడు తొందరచేయసాగాడు. అంత శకుంతల -

**'ముహూర్తం సంప్రతీక్షస్వ స మాం తుభ్యం ప్రదాస్యతి'**

**(మహాభారతం - ఆది. 73-5)**

'రాజా! కొద్దిసేపు ప్రతీక్షించండి. మా తండ్రే మీకు సమర్పించ గల'దని నచ్చజెప్ప ప్రయత్నించింది. దానికి దుష్యంతుడు ప్రతీక్ష చేయకపోగా -

**శ్లో॥ గాంధర్వరాక్షసౌ క్షత్రే ధర్మ్యౌ తౌ మా విశఙ్కిథాః ॥**

'ఓ శకుంతలా ! గాంధర్వ రాక్షస వివాహములు రెండూ క్షత్రియులకు ధర్మానుకూలమైనవే. శంకించవలదు" అని సమాధాన మిచ్చాడు.

ఈ సమాధానాన్ని పరిశీలించి చూస్తే యిది ఒక బెదిరింపు. గాంధర్వవివాహానికి నీవు అంగీకరించకపోతే నిన్ను బలవంతంగా ఎత్తుకుపోయి రాక్షసవివాహం చేసుకుంటానని దీని భావం.

ముందు ప్రకరణాలలో చెప్పుకొన్నట్లుగా సూర్యవంశీయ రాజులలోఉన్నంత సచ్ఛీలత, ధర్మనిష్ఠ, సదాచారం చంద్రవంశీయ రాజులలో కనబడదు. దీనికి ఉదాహరణలుగా పురూరవ, నహుష, యయాతి, దుష్యన్త, శంతను, ధృతరాష్ట్ర, దుర్యోధనాదులను చెప్పుకోవచ్చు.

దుష్యంతుని ఆ బెదిరింపుతో శకుంతల వివశురాలై గాంధర్వ వివాహానికి అంగీకరించింది. ఇద్దరి సమాగమము జరిగింది. కణ్వమహర్షి ఆశ్రమానికి వచ్చేంతవరకు ఆగకుండానే తనకు చాలా రాచకార్యాలున్నాయని చెప్పి దుష్యంతుడు బయలుదేరాడు. శకుంతల ఎంత ప్రార్థించినా ఆగలేదు. తిరిగివచ్చి రాజలాంఛనాలతో నిన్ను అంతఃపురానికి తీసుకువెడతానన్నాడు. 12 సంవత్సరాలైనా తిరిగిరాలేదు.

ఆ మొదటి సమాగమముతోనే శకుంతల గర్భవతి అయ్యింది. ఒక బాలునికి జన్మనివ్వటం, అతనికి భరతు డని నామకరణం చెయ్యటం జరిగింది. బాలుడు పెరిగి 12 సంవత్సరాల వాడయినా దుష్యంతుడు తిరిగిరాలేదు. ఇక చేసేదిలేక శకుంతలనే బాలుని తీసుకుని దుష్యంతుని రాజసభకు వెళ్ళింది. ఈ భరతుడు నీ కుమారుడేనని నచ్చజెప్ప ప్రయత్నించింది. అయినా దుష్యంతుడు శకుంతలను గుర్తుపట్టనట్టే వ్యవహరించాడు. ఆదరించకపోగా నిందించాడు. మహాభారత ఆది పర్వంలోని ఆ ప్రసంగం చదివితే హృదయవిదారకంగా ఉంటుంది. ఆ నిందలను వినలేక శకుంతల బాలుని తీసుకొని వెళ్ళిపోబోతూ ఉంటే దేవతలు సహించలేకపోయారు. ఈ భరతుడు నీ బిడ్డనే యని నొక్కి వక్కాణించారు. దానితో దేవతలతో విరోధం పెట్టుకోలేక వివశుడై భరతుని తన పుత్రునిగా అంగీకరించాడు దుష్యంతుడు.

## శంతన మహారాజు

దుష్యంతుని తదుపరి భరతుడు రాజై రాజ్యాన్ని విస్తరింపచేసాడు. ప్రజలను కన్నబిడ్డలవలె పాలించాడు. సర్వజన ప్రియుడయ్యాడు. ఈ చంద్రవంశంలోనే కాలాంతరంలో ప్రతీప అను పేరుగల ఒక యశస్వంతుడు ఉద్భవించాడు. అతనికి ముగ్గురు కుమారులు కలిగారు. వారే దేవాపి, శంతను, వాహ్నికులు. పెద్దవాడైన దేవాపి రాజ్యభారాన్ని వహించటానికి యిష్టపడలేదు. మోక్షమార్గగామియై తపస్సు చేసుకోవడానికి అడవులకు వెళ్ళిపోయాడు. అందుచే రెండవ కుమారుడైన శంతనునకు రాజ్యం లభించింది.

ఒక రోజు శంతనమహారాజు గంగానదీ తీరాన ఒంటరిగా విహరిస్తూండగా ఒక అత్యంత రమణీయ కన్య కనబడింది. ఆమెకూడా

ఒంటరిగానే విహరిస్తోంది. ఆమెను చూసి మోహితుడైన శంతనుడు ఆమె ఎవరో తెలిసికోకుండానే నిన్ను వరిస్తున్నాననీ, నన్ను వివాహం చేసుకోమని కోరాడు. ఆమె ఒక గట్టి షరతుపై ఆ వివాహానికి అంగీకరించింది. ఆ ఒప్పంద మేమంటే ఆమెకు కలగబోయే సంతానాన్ని ఆమె ఏమైనా చేసుకోవచ్చును. అందుకు రాజు అడ్డుపడరాదు. ఒకవేళ అడ్డు చెప్పినట్లయితే వెంటనే విడిచి వెళ్ళిపోతానన్నది.

కామాంధుడైన శంతనుడు ఆమె కోరికను సరిగా అర్థం చేసుకోవడంగాని, వివరాలు అడిగి తెలుసుకోవడంగాని చేయలేదు. నీవేమి చేసినా అడ్డు చెప్ప నన్నాడు. ఆమేనే గంగ. ఆమె తనకు ఎప్పుడు సంతానం కలిగితే అప్పుడు ఆ పసిబిడ్డను తీసుకువెళ్ళి గంగానదిలో ప్రవహింపజేసేది. శంతనుడుగాని రాజపరివారముగాని చూస్తూ కూడా అడ్డు చెప్పలేకపోయేవారు. ఆ విధంగా ఏడుగురు బిడ్డలను పుట్టినవెంటనే నదిలో కలిపివేయటం జరిగింది. ఎనిమిదవ పర్యాయం పుట్టిన బిడ్డను నదిలో కలుపుటకు గంగ బయలుదేరగా శంతనుడు సహించలేకపోయాడు. అడ్డుకొని యిది చాలా అన్యాయమన్నాడు. క్రూరమన్నాడు. అంతట గంగ – 'రాజా ! నీ యిష్టానుసారమే ఈ బిడ్డను నీకు వారసునిగా వదిలిపెడుతున్నాను. నీవు నాకు ఇచ్చిన మాట తప్పావు కనుక నేను నిన్ను వదలిపెట్టి వెళ్ళిపోతున్నా'నని చెప్పి వెళ్ళిపోయింది. ఆ బిడ్డడే దేవవ్రతుడు. కాలాంతరంలో 'భీష్మ'డనే పేరుతో ప్రసిద్ధిని పొందాడు.

శంతనుడు మరల వివాహం చేసుకోలేదు. దేవవ్రతుని అల్లారు ముద్దుగా పెంచుకోసాగాడు. క్రమంగా శంతనుడు వృద్ధుడు కూడా అయ్యాడు. అయినా ఒక రోజు గంగాతీరంలో విహరిస్తూండగా ఒకవైపు నుండి అద్భుతమైన సుగంధం రావటం గమనించాడు. ఆ సుగంధం

ఎక్కడనుండి వస్తున్నదో తెలుసుకోవాలని ఆ వైపుగా నడుస్తూ ఒక నిషాదుని కుటీరానికి చేరుకున్నాడు. ఆ నిషాదుని అడుగగా అది తన కుమార్తె శరీరాన్నుండి వస్తున్నదనీ, మహర్షి పరాశరుని కృపవల్ల ఆమె శరీరానికి ఆ దివ్యసుగంధం ప్రాప్తించిందనీ చెప్పాడు. అంతట శంతనుడు చకితుడై ఆ కన్యను నాకిచ్చి వివాహం చెయ్యమని కోరాడు. నా కుమార్తె గర్భాన పుట్టినవానికే రాజ్యం యిస్తానని ప్రమాణం చేస్తేకాని నేను వివాహం చేయనని నిషాదుడు సమాధనమిచ్చాడు.

శంతనుడు కామవేదనతో విచారగ్రస్తుడై అంతఃపురానికి చేరుకున్నాడు. అప్పటికే దేవవ్రతుడు యువకుడయ్యాడు. రాచకార్యాలు నిర్వహించగల జ్ఞానవిజ్ఞానాలను, శస్త్రాస్త్ర ప్రయోగాలను నేర్చుకొని ప్రవీణుడయ్యాడు. ప్రియవ్యవహారంతో ప్రజలకు ప్రీతిపాత్రుడయ్యాడు. అట్టి కుమారుని మనస్సు కష్టపెట్టకూడదనుకుని శంతనుడు మౌనంగా విచారంగా గడుపసాగాడు. దేవవ్రతుడు ఇది గుర్తించి మీ నిరాశకు కారణమేమని తండ్రిని అడిగాడు. తండ్రి తన బలహీనతను కప్పిపుచ్చుచూ 'మనది చాలా విశాలమైన వంశం. ఈ విశాల సామ్రాజ్యం నీపై ఆశపెట్టుకుని ఉంది. నీవు నిస్సందేహంగా దీనిని పరిపాలించయోగ్యుడవు, నీవొక్కడవే నూరుగురు పుత్రులతో సమానం. కాని, లోకాన్ని పరిశీలించి చూస్తే ఎవరూ నిత్యంకాదు. ప్రమాదవశాత్తు నీకేదైనా హాని జరిగితే ఈ రాజ్యం గతి ఏమౌతుందోనని నా చింత. నాకు మరల వివాహం చేసుకోవాలని లేదు. కాని, వంశవిచ్ఛేదం కాకుండాఉండటానికి మరల వివాహం చేసుకోగోరుచున్నా'నన్నాడు.

దేవవ్రతుడు పరిచారకుల ద్వారా అసలు విషయం తెలిసికొని తండ్రి హితాన్ని కోరి నిషాదుని వద్దకు వెళ్ళి అతని కన్యను తన తండ్రికి యిమ్మని కోరాడు. నిషాదుడు అతనికి షరతును చెప్పాడు. నీవుకూడా

సంతానాన్ని కననని ప్రతిజ్ఞ చేయమన్నాడు. సత్యవతీ పుత్రులే రాజ్యాన్ని పాలించగలరనీ, తాను అజన్మబ్రహ్మచర్యాన్ని పాటిస్తాననీ భీషణ ప్రతిజ్ఞ చేసాడు. జీవితాంతం ఆ ప్రతిజ్ఞకు కట్టుబడి ఉన్నాడు. అందుచే 'భీష్మ'డనే పేరుతో ప్రసిద్ధ డయ్యాడు.

ఈ భీషణ ప్రతిజ్ఞవల్ల కాలాంతరంలో భయంకర పరిస్థితు లేర్పడ్డాయి. శంతనుడు ఆ నవీన పత్ని సత్యవతి ద్వారా యిద్దరు పుత్రులను పొందాడు. పెద్దవాడు చిత్రాంగదుడు. రెండవవాడు విచిత్రవీర్యుడు. ఈ బాలురు చిన్న వయస్సులో ఉండగానే శంతనుడు దివంగతుడయ్యాడు. చిత్రాంగదుడు ఒక గంధర్వునితో యుద్ధంచేస్తూ చనిపోయాడు. విచిత్రవీర్యుడు 18 సంవత్సరాల ప్రాయంలో ఉండగానే కాశీరాజు తన ముగ్గురు కన్యలకు స్వయంవరం ప్రకటించాడు. భీష్ముడు ఆ స్వయంవరానికి వెళ్ళి బలవంతంగా ఆ కన్యలను తీసుకువచ్చి విచిత్రవీర్యునితో వివాహం జరిపించే ప్రయత్నం చేసాడు. ఆ కన్యలలో పెద్దదైన అంబ - నేను ఇంతకు పూర్వమే శాల్వరాజును వరించాను కనుక ఈ వివాహం చేసుకోలేనన్నది. అందుచే భీష్ముడు ఆమె వెళ్ళిపోవడానికి అనుమతిచ్చాడు. మిగిలిన అంబిక అంబాలికలతో విచిత్రవీర్యునకు వివాహం జరిపించాడు.

కాశీరాజు పెద్దకుమార్తెయైన అంబ నేరుగా శాల్వరాజు వద్దకు వెళ్ళి జరిగిన విషయం చెప్పి నన్ను వివాహం చేసుకోమన్నది. ఎవరో ఎత్తుకు వెళ్ళిన కన్యను నేను వివాహం చేసుకోలేనన్నాడు శాల్వరాజు. అంబ తిరిగి భీష్ముని చెంతకు వచ్చి శాల్వరాజు నిరాకరిస్తున్నాడు, నీవు నన్ను బలవంతంగా తీసుకువచ్చావు కనుక నీవే నన్ను వివాహం చేసుకోమన్నది. భీష్ముడు వచనబద్ధుడు కనుక నేను వివాహం చేసుకోలేనన్నాడు. అంతట అంబ క్రోధితయై పరశురాముని వద్దకు వెళ్ళి భీష్ముని దుష్టతను తెలిపి అతనికి తగిన బుద్ధి చెప్పుమన్నది. అప్పటికి

పరశురాముడు చాలా వృద్ధుడయ్యాడు. అందుచే యువావస్థలో ఉన్న భీష్ముని ఓడించలేకపోయాడు. అవమానం భరించలేక అంబ చితి పేర్చుకుని అందు దూకి భస్మమైపోయింది. ( ఈ కథలో పరశురాముని వృత్తాంతం కల్పించిజోడించబడి ఉండవచ్చు. శ్రీరాముని కాలంనాటి పరశురాముడు భీష్ముని కాలం వరకు బ్రతికి ఉంటాడా ? లేదా ఈ పరశురాముడు మరొకరు కావచ్చు).

విచిత్రవీర్యునకు ఇంకా యౌవ్వనం రాకపోవటంవల్ల, దుర్బల శరీరుడు కావటంవల్ల యౌవ్వన సంపన్నులైన అంబికా, అంబాలికల వల్ల సంతానం కలుగలేదు. ఇంతేగాక, అతడు మరింత దుర్బలుడై వ్యాధిగ్రస్తుడై మరణించాడు.

విచిత్రవీర్యుడు చనిపోయిన తరువాతకూడా భీష్ముడు వివాహం చేసుకోలేదు. వంశం నిలుపుకోవటానికి అంబికా అంబాలికలకు నియోగం ద్వారా సంతానం కలిగిస్తే మంచిదని పినతల్లి సత్యవతికి సలహా యిచ్చాడు. సత్యవతి తన కోడండ్ర నియోగం కొరకు వ్యాసమహర్షిని ఎన్నుకొంది. ముందు అంబికతో నియోగం చేయుటకు నిర్ణయం జరిగింది. వ్యాసుడు ముందే హెచ్చరించాడు. ఆమె నా కురూపి ఆకారాన్ని సహించగలిగితే నానుండి ఉత్తమ బాలకుడే జన్మించగలడు. లేకున్న విపరీతం జరగవచ్చు నన్నాడు.

వ్యాసుని రంగు నలపు. పెద్దగడ్డము, జడలుగట్టి బూడిద రంగుగా మారిన తలవెండ్రుకలు, తెల్లని కనుగ్రుడ్లు కలిగి కురూపిగా ఉండేవాడు. అతనిని చూచి భయపడగలదని అంబికకు ముందే ధైర్యాన్ని నూరిపోసారు. అయినా నియోగ సమయంలో అతని రూపాన్ని చూడలేక గట్టిగా కన్నులు మూసుకుని ఎట్లో సహించింది. ఫలితంగా పుట్టుగ్రుడ్డి బిడ్డ

కలిగాడు. ఇంతేగాక, ఎన్నో అవగుణాలు అతనిని ఆశ్రయించాయి. అతడే ధృతరాష్ట్రుడు. సత్యవతికి సంతృప్తి కలగలేదు.

అంబాలికకు కూడా వ్యాసుని ద్వారా నియోగానికి ఏర్పాట్లు చేసారు. ఏమీ భయపడవద్దనీ, ఆందోళన చెందవద్దనీ, నిరాశా నిస్పృహలకు తావీయవద్దని బోధించారు. అయినా ఆమె నియోగ సమయంలో నిశ్చేష్టురాలై పోయింది. ముఖమంతా పాలిపోయి నట్లయ్యింది. ఫలితంగా పాండు వర్ణంగల పుత్రుడు పుట్టాడు. అతడే పాండురాజు. సత్యవతి ఈ పుత్రునితోకూడా సంతృప్తి చెందలేదు. అంబికతో మరియొకసారి నియోగానికి ఏర్పాట్లు చేసింది. ఎంతో ధైర్యం చెప్పింది. అంబిక ఎట్లో సరేనన్నది. కాని, సమయం దగ్గరకురాగానే భయం ముంచుకువచ్చి తన స్థానంలో ఒక దాసీని ఏర్పాటు చేసి తను తప్పించుకుంది. దాసి తనకు ఒక గొప్ప పుత్రుడు కలుగగలడనే ఆశతో నియోగంలో పాల్గొంది. అందువల్ల గుణవంతుడైన పుత్రుడు పుట్టాడు. అతడే విదురుడు.

ఈ ముగ్గురు బాలురను సత్యవతీ భీష్ములు జాగ్రత్తగా పెంచసాగారు. వీరి జనన వృత్తాంతం చదివిన పాఠకులకు మహాభారతకాలంనాటి సామాజిక వ్యవస్థ ఎంత దిగజారిపోయిందో అర్థమయ్యే ఉంటుంది. ఆనాడు అదే ధర్మంగా ఎంచబడింది. గంధర్వ రాక్షస వివాహాలు, బలవంతపు నియోగాలు, అక్రమ సంబంధాలు మొదలైన వేదవిరుద్ధ కర్మలు ఆనాడు జరిగాయి. అవే భారతదేశ పతనానికి మూలకారణాలయ్యాయి.

దీని అనంతర ఇతిహాసం తెలుసుకునే ముందు యదు వంశాన్ని గురించి కొన్ని విషయాలు తెలుసుకోవటం అవసరం. ఎందుచేతనంటే యోగేశ్వర కృష్ణుడు జన్మించింది యదువంశంలోనే.

# కర్మయోగి శ్రీకృష్ణుడు

ముందు (మనువంశావళి) ప్రకరణంలో తెలుసుకున్నట్లుగా చంద్రవంశం యదువంశ, పురువంశా లనే రెండు శాఖలుగా విస్తరిల్లింది. యయాతి కథలో తెలిసికొన్నట్లుగా యయాతికి దేవయానివల్ల కలిగిన పుత్రులు తనకు వారి యౌవనాన్ని యివ్వనందున క్రోధితుడై దేవయానిని, ఆమె పుత్రులను రాజ్యంనుండి బహిష్కరించాడు. అంతట దేవయానీ పుత్రుడైన యదు తల్లిని, సోదరులను తీసుకుని సౌరాష్ట్రప్రాంతం చేరుకొని తనకొఱకు ఒక రాజ్యాన్ని స్థాపించుకున్నాడు. అప్పటినుండి యదుని పేరుతో యదువంశం ప్రారంభమయ్యింది.

శర్మిష్ఠ పుత్రుడైన పురు తండ్రికి తన యౌవ్వనాన్ని ఉదారంగా యిచ్చినందున యయాతికి ప్రీతిపాత్రుడయ్యాడు. అందుచే యయాతి అనంతరం పురు రాజ్యానికి అధికారి అయ్యాడు. ఈ పురువంశంలోనే కాలాంతరంలో కురు అనే పేరుగల ఒక తేజస్వంతుడైన రాజు ఉద్భవించాడు. దానితో పురువంశం కురువంశంగా ప్రసిద్ధి చెందింది.

యదు పేరుతో ప్రారంభమైన యదువంశంలో కాల ప్రవాహంలో మరికొన్ని ఉపశాఖలేర్పడ్డాయి. వాటిలో వృష్ణి, భోజ, అన్ధక శాఖలు ముఖ్యమైనవి. ఇందు వృష్ణివంశ రాకుమారుడైన వసుదేవుని వివాహం మథురా నగర క్షత్రియుడైన దేవకుని పుత్రిక దేవకితో జరిగింది.

మథురానగరాధీశుడైన ఉగ్రసేనుని చిన్న తమ్ముడే దేవకుడు. ఉగ్రసేనుడు మథురా నగరానికి రాజే అయినా అతని పుత్రుడు కంసుడు దుష్టుడు బలశాలి అగుటచే తండ్రిని బలవంతంగా గద్దె దింపి తానే రాజయ్యాడు. అట్టి కంసునికి ఎవరో 'దేవకీ పుత్రుని చేతిలో నీకు మరణం వ్రాసిపెట్టి ఉందని' ఫలిత జ్యోతిష్యం చెప్పారు. ఆ భయంతో

కంసుడు దేవకీ వసుదేవులను చెఱశాలలో బంధించాడు. ఆమెకు కలిగిన సంతానాన్ని పుట్టిన వెంటనే చంపటం చేయసాగాడు. దేవకికి క్రమంగా ఎనిమిది మంది పుత్రులు పుట్టారు. అందులో ఏడుగురిని కంసుడు పుట్టిన వెంటనే చంపివేసాడు. ఎనిమిదవ పుత్రుడు కలిగినపుడు ఒక సంఘటన జరిగింది.

ఎనిమిదవ సంతానంయొక్క జననం అర్ధరాత్రి జరిగింది. అంతకుముందే ఆ బాలుని తప్పించటానికి ఒక పథకం తయారు చేయబడింది. అర్ధరాత్రి కావటంవల్ల ద్వారపాలకులంతా నిద్రలో మునిగి ఉన్నారు. దేవకి ప్రసవించిన వెంటనే వసుదేవుడు ఆ బాలకుని తీసుకొని బందీగృహాన్నుండి బయటకు వచ్చాడు. పథకం ప్రకారం నందగ్రామం చేరుకొని నందుని యింటిలో యశోదకు అప్పుడే పుట్టిన బాలిక స్థానంలో దేవకీపుత్రుని ఉంచి ఆ బాలికను తీసుకొని యథాస్థానానికి చేరుకున్నాడు. మరునాడు కంసునకు ఈ విషయం తెలిసింది. కంసుడు వెంటనే వచ్చి ఆ బాలిక దేవకీ సంతానంగానే భావించి చంపి వెళ్ళిపోయాడు.

యశోద ఒడి చేరిన ఆ దేవకీ పుత్రుడే శ్రీకృష్ణుడు. ఆ బాలుని నంద యశోదలు అల్లారుముద్దుగా పెంచసాగారు. బాల్యంలోనే అతని బలతేజస్సుల గూర్చిన ప్రశంస కంసుని వరకు చేరింది. కంసుడు ఆ బాలుని చంపించటానికి చాలా ప్రయత్నాలు చేసాడు. కాని అవి ఏవీ నెరవేరలేదు.

వసుదేవునికి మరొక పత్ని ఉంది. ఆమె పేరు రోహిణి. ఆమెకు కూడా ఒక పుత్రుడు కలిగాడు. అతనిపేరు బలరాముడు. కృష్ణునకు 4-5 సంవత్సరాల ప్రాయం వచ్చినప్పుడు బలరాముని కూడా అక్కడకు పంపటం జరిగింది. దానితో 'కృష్ణుడుకూడా వసుదేవునికి సంబంధించిన వాడే' అనే అనుమానం కంసునకు కలిగింది. కృష్ణుని చంపటానికి

మరికొన్ని ప్రయత్నాలు చేసాడు. అవికూడా ఫలించలేదు. బలరాముడు అక్కడకు చేరిన తదుపరి యిద్దరు కలిసి మరికొన్ని సాహసకార్యాలు చేసారు. దానితో కంసుడు మరింత భయపడసాగాడు. ఎలాగయినా వీరిద్దరిని చంపాలనుకున్నాడు. మథురానగరంలో ఒక కుస్తీ పోటీ ఏర్పాటు చేసాడు. ఆ పోటీకి రమ్మని బలరామకృష్ణులకు కూడా ఆహ్వానం పంపాడు. బలరామ కృష్ణులను ఆ పోటీకి పంపటానికి నంద యశోదలకు ఇష్టంలేదు. అయినా అది సవాలుగాను, ఒక చక్కటి అవకాశంగాను భావించి బలరామ కృష్ణులు ఆ పోటీకి వెళ్ళారు.

కంసుడు మల్లభూమివద్ద ఒక బలిసిన ఏనుగును ఏర్పాటు చేసి బలరామకృష్ణులు అక్కడకు రాగానే వారిపైకి దానిని ఉసిగొల్పమని మావటి వానికి చెప్పాడు. మావటివాడు అట్లే చేసాడు. కృష్ణుడు ఏనుగు తమపైకి రావటం గుర్తించి వెంటనే దాని తోకను మెలిపెట్టి దాని వీపుపైకి ఎగిరాడు. మావటివానిని చంపి ఏనుగును కూడా చంపివేసాడు. దానితో కంసుడు విచలితుడయ్యాడు. భయపడ్డాడు.

కంసుడు ఒక్కసారిగా కొందరు మల్లయోధులను (పహెల్వాన్‌లను) బలరామకృష్ణులపైకి పంపాడు. కృష్ణుడు అందులోని చాణూరు డనే పెద్ద యోధునిపైకి దూకి ఒకే ఒక దెబ్బతో చంపివేసాడు. దానితో మిగతా యోధులంతా వెనుతిరిగారు. అంతట కృష్ణుడు కంసుని 'నీవు వీరుడవైతే నాతో మల్లయుద్ధం చేయు మన్నాడు. కంసుడు స్వయంగా పోరాడ యిష్టపడలేదు. మల్లభూమినుండి తప్పించుకోవడానికి ప్రయత్నం చేసాడు. అంత కృష్ణుడు ఒక్క ఉదుటన అతనిపై లంఘించి క్రింద పడద్రోసి పిడి గుద్దులతోనే అతనిని చంపివేసాడు. కంసునికన్న ముందు కేశీ అనే పేరుగల దైత్యునికూడా కృష్ణుడు చంపివేసాడు.

కంసుని సంహరించిన తదుపరి కృష్ణుడు ఉగ్రసేనునకు రాజ్యాన్ని అప్పగించాడు. కాని, అతనిలో రాజ్యపాలనా దక్షత లేదు. అందుచే అతను మథురను పాలించలేకపోయాడు. కంసుని మామ జరాసంధుడు అతని యిద్దరు కుమార్తెలను కంసునకి యివ్వటం జరిగింది. కంసుని మరణంతో ఆ కుమార్తె లిరువురు పతివిహీనులయ్యారు. ఇది అదనుగా చూసుకొని జరాసంధుడు మథురపై దండయాత్రలు చేయటం ప్రారంభించాడు. పదహారు పర్యాయాలు ఆక్రమణ చేయ ప్రయత్నించటం బలరామకృష్ణులు వాటిని త్రిప్పికొట్టటం జరిగింది. అయినా జరాసంధుని ఆక్రమణలు ఆగలేదు. చివరికి కృష్ణుడు మథురానగరాన్ని రక్షించటం కష్టమే అనుకున్నాడు. అందుచే ఉగ్రసేనుని తీసుకొని ద్వారకానగరానికి వెళ్ళిపోయాడు.

అనంతరం కృష్ణ బలరాములు ఉజ్జయనీ నగరంలో సాందీపని అనే పేరుగల ఒక బ్రాహ్మణ విద్వాంసుని గురుకులంలో చేరి వేదవేదాంగాల నధ్యయనంచేసారు. అక్కడనే సుధాము డనే పేద బ్రాహ్మణ విద్యార్థితో స్నేహమేర్పడింది. అనతికాలంలోనే బలరామకృష్ణులు వేద విద్యల నభ్యసించి ద్వారకా నగరానికి చేరుకున్నారు. ఆనాడు ద్వారకానగరంపై అనేకులు ఆక్రమణచేయ యత్నించారు. శ్రీకృష్ణుడు వాటి నన్నిటిని తన అద్భుత యుద్ధనీతి కుశలతతో త్రిప్పికొట్టాడు. దానితో కృష్ణునిలోని విశిష్టతను భారత రాజన్యులంతా గుర్తించి గౌరవించారు.

ఆ రోజులలో హిమాలయ పర్వత ప్రాంతంలో భౌమాసురు డనే పేరుగల ఒక దైత్యుడు తనదైన ఒక రాజ్యాన్ని స్థాపించుకున్నాడు. అతనికే నరకాసురుడనే మరొకపేరు ఉంది. అతడు అటు దేవ గంధర్వ లోకాల ధన సంపదలను,ఇటు మానవుల సంపదలను కొల్లగొట్టుకునేవాడు.

అందమైన కన్యలను చెరపట్టి తన అంతఃపురానికి చేర్చుకునే వాడు. అతడు చాలా బలశాలి కావటంవల్ల అతనిని ఎవరూ ఓడించలేకపోయేవారు. చివరకు ఇంద్రుడు శ్రీకృష్ణుని సహాయం కోరాడు. అందుకు శ్రీకృష్ణుడు 'గరుడవాహనాన్ని, సుదర్శన చక్రాన్ని యిస్తే అతనిని జయించగలుగుతాను. లేకుంటే ఆ పర్వతలోయలలో అతనిపై యుద్ధం చేయటం కష్ట' మన్నాడు. ఇంద్రునికి యిష్టం లేకపోయినా వాటిని యివ్వటం జరిగింది. వాటితో శ్రీకృష్ణుడు భౌమాసురుని సంహరించి చెరపట్టిన స్త్రీలనందరిని విడిపిస్తాడు. దానితో దేవ గంధర్వ మానవ లోకాలలోని ప్రజలంతా సంతసిస్తారు. (ఈ కథ కల్పించి భారతంలో చొప్పింపబడినదని కొందరు చరిత్రకారుల అభిప్రాయం. ఏది ఏమైనా శ్రీకృష్ణుడు గొప్ప వీరుడు. యుద్ధనీతి కుశలుడు).

రుక్మిణి శ్రీకృష్ణుని వరించి ఉత్తరం పంపింది. వారి వివాహానికి అడ్డుగా ఉన్న ఆమె సోదరుడు రుక్ముని ఓడించి శ్రీకృష్ణుడు రుక్మిణిని వివాహం చేసుకున్నాడు. ఆమెను తన పట్టపురాణిగా చేసుకొని ఏకపత్నీవ్రతుడై ఆదర్శ జీవితం గడిపాడు. రుక్మిణితో కలిసి బదరీకాశ్రమంలో 12 సంవత్సరాలు ఘోరమైన బ్రహ్మచర్య తపస్సునుచేసి తనవంటి బలవీర్యములుగల కుమారునికి జన్మనిచ్చాడు. (శ్రీకృష్ణుని గురించి అనేక అలౌకిక అశ్లీల కథలు కల్పించి లోకంలో ప్రచారం చేయబడ్డాయి. అవి అన్నీ సత్యంకావు. శ్రీకృష్ణుని యథార్థచరిత్ర తెలుసుకో గోరువారు మాచే ప్రచురింపబడిన 'యుగపురుషుడు – శ్రీకృష్ణుడు' అను పుస్తకం చదువగోరుచున్నాము).

ఆ విధంగా శ్రీకృష్ణుడు ఒక శౌర్య వీరునిగా కీర్తిపొందిన అనంతరమే కురువంశంతో దగ్గర సంబంధం ఏర్పడింది.

# కౌరవ - పాండవ యుద్ధం

వ్యాసునితో నియోగం ఏర్పరచటంవల్ల కురువంశం అంతరించి పోకుండా నిలబడింది. ధృతరాష్ట్ర, పాండులు వారసులయ్యారు. విదురుడు దాసీకి జన్మించాడు కనుక అతనిని వారసునిగా గణించలేదు. ధృతరాష్ట్ర పాండుల విషయంలో ఎవరిని రాజుగా చెయ్యాలా ? అనే సమస్య ఏర్పడింది. సత్యవతి భీష్ముని సంప్రదించగా - ధృతరాష్ట్రుని రాజును చేసి, అతను గ్రుడ్డివాడు కనుక అతని స్థానంలో పాండు రాజ్యాన్ని పాలిస్తే బాగుంటుందనీ, వీరిలో ఎవరికి ముందు పుత్రుడు కలిగితే అతనిని యువరాజుగా చెయ్యాలనీ సూచించాడు. ఆ విధంగానే జరిగింది.

ధృతరాష్ట్రునికే ముందు వివాహం జరిగినప్పటికీ పాండురాజునకే ముందు పుత్రుడు కలిగాడు. పాండురాజు రోగగ్రస్తుడు కావటంవల్ల సంతానాన్ని కనే సామర్థ్యం లేకపోయింది. అందుచే అతని యిద్దరు భార్యలకు నియెగం ఏర్పాటు చేయబడింది. దానివల్ల మొదటి భార్య కుంతికి ముగ్గురు పుత్రులు, రెండవ భార్య మాద్రికి యిద్దరు పుత్రులు మొత్తం అయిదుగురు పుత్రులు కలిగారు. కుంతీదేవికి ధర్మునితో నియోగమేర్పరచటం వలన యుధిష్ఠిరుడు, వాయవుతో నియోగమున భీముడు, ఇంద్రునితో నియోగమున అర్జునుడు కలిగారు. మాద్రికి అశ్వినీకుమారులతో నియోగమున నకుల, సహదేవులు కలిగారు. (ఇచట వాయువంటే గాలి అని అర్థంకాదు. 'వాయు'వను పేరుగల ఒక వ్యక్తి) వీరిలో యుధిష్ఠిరుడు అందరికన్న పెద్దవాడు.

పాండురాజుయొక్క అయిదుగురు పుత్రులు వనాలలోనే జన్మించారు. అక్కడే పెరిగి పెద్దవారయ్యారు. పాండురాజు దివంగతుడైన తరువాత తల్లులతో కలిసి పాండవులు హస్తినాపురికి చేరుకున్నారు. వీరు

వచ్చిన తరువాత భీష్ముడు యుధిష్ఠిరుని యువరాజును చేయాలనుకున్నాడు. కాని, అప్పటికే ధృతరాష్ట్రునికి పుత్రుడు కలిగినందున గాంధారి శకునులు తీవ్ర అభ్యంతరం తెలిపారు. దానితో కలహం ప్రారంభమయ్యింది. ఆ కలహం పెరిగి పెద్దదవుతూ పాండవులను కౌరవులు హతమార్చ ప్రయత్నించటం వరకు వచ్చింది.

పాండవులలో భీముడు అందరికన్న బలవంతుడు. అతను బ్రతికుండగా పాండవులను ఏమీ చేయజాలమని దుర్యోధనుడు ముందు భీముని హతమార్చ యత్నించాడు. రహస్యంగా భీమునకు విషమిప్పించాడు. భీముని శరీరం చాలా దృఢమైనది కనుక విషం అతనిని చంపలేకపోయింది. కొంతకాలం స్పృహతప్పి పడిపోవటం మాత్రమే జరిగింది. అది విషప్రభావమే ననీ, దుర్యోధనుడే ఆ విషప్రయోగం చేయించాడనీ అందరికి తెలిసిపోయింది. అయినా రాజైన ధృతరాష్ట్రుడు పుత్రవ్యామోహం వల్ల దుర్యోధనుని దండించలేకపోయాడు. దానితో దుర్యోధనునికి, అతని అనుయాయులకు సాహసం పెరిగిపోయింది.

క్రమంగా యుధిష్ఠిరుని యువరాజుగా ప్రకటించటానికి తగిన పరిస్థితులు బలపడసాగాయి. అంతట దుర్యోధనుడు రాజ్యాన్ని రెండుగా విభజించి చెరియొకటి యివ్వాలనే వాదన ప్రారంభించాడు. ధృతరాష్ట్ర భీష్ములు బాగా ఆలోచించి రాజ్యాన్ని రెండుగా విభజించి చెరియొకటి యిచ్చి ఈ అంతఃకలహాన్ని శాశ్వతంగా దూరం చేయటమే మంచిదను కున్నారు. అందుచే పాండవులకు వారణావత రాజ్యాన్ని కేటాయించి హస్తినాపురాన్నుండి పంపించివేసారు. అయితే మాయావి, కపటియైన దుర్యోధనుడు వారణావతంలో పాండవులకొరకు నిర్మించిన భవనం లక్కతోను, తొందరగా కాలిపోయే కట్టెలతోను నిర్మింపచేసాడు.

పాండవులను ఎట్టైనా హతమార్చి ఆ రాజ్యాన్ని కూడా తానే కాజేయాలన్నది అతని దురుద్దేశ్యం. వారిని ఆ భవనంలో సజీవ దహనం చెయ్యాలన్నది అతని కుయుక్తి. భవనం చూడటానికి పైకి బాగానే కనబడేటట్టు జాగ్రత్తపడ్డాడు.

మహాత్మా విదురుడు ధర్మాత్ముడు రాజనీతిజ్ఞుడు. మ్లేచ్ఛభాష కూడా తెలిసినవాడు. ధర్మరాజునకును మ్లేచ్ఛ భాష తెలుసు. అందుచే, విదురుడు రాబోయే ప్రమాదాన్ని గురించి ఇతరులకు తెలియకుండా ధర్మరాజునకు మ్లేచ్ఛభాషలో సంకేతంగా చెబుతాడు. అంతేకాక; సొరంగమార్గాన్ని నిర్మించటానికి ఒక ఖనకుని కూడా పంపుతాడు. బుద్ధిమంతుడైన ధర్మరాజు విదురుని సహాయాన్ని సద్వినియోగం చేసుకొని ఆ ప్రమాదం నుండి తల్లితోను తమ్ములతోను బయటపడతాడు. దుర్బుద్ధియైన దుర్యోధనుడు మరల ఏదైనా దుశ్చేష్ట చేయగలడని కొంతకాలం అజ్ఞాతంగా గడపాలనుకుంటాడు.

అందుచే కొంతకాలం అజ్ఞాతంగా గడపాలనుకున్నాడు.

అనుకున్నట్లుగానే అన్నీ జరిగాయి. దుర్యోధనుడు నిజంగానే పాండవులు కాలిపోయారనుకున్నాడు. పాండవులు బ్రాహ్మణవేషధారణచేసి అజ్ఞాతంగా గడపసాగారు. సరిగా అదే సమయంలో ద్రౌపదీ స్వయంవరం ప్రకటించబడింది.

మహారాజు ద్రుపదుడు తన కుమార్తె ద్రౌపది స్వయంవరానికి ఒక అతికఠినమైన నియమం ఏర్పరచాడు. అదే మత్స్యయంత్రం. క్రింద భూమిపై ఒక జలకుండాన్ని ఏర్పాటు చేసారు. దానికి సరిగాపైన ఒక బొమ్మచేపను వ్రేలాడగట్టారు. ఆ బొమ్మచేపను చక్రాలద్వారా గుండ్రంగా తిరిగేటట్టు ఏర్పాటు చేసారు. ఆ చేప తిరుగుతూ ఉండటం క్రింద

జలకుండంలోని నిరల్మనిశ్చల నీటిలో ప్రతిబింబంగా పడుతున్నది. నీటిలో కనబడుతున్న ప్రతిబింబాన్నే చూస్తూ పైన తిరుగుతున్న చేపయొక్క కంటిని లక్ష్యంగా బాణంవేసి లక్ష్యాన్ని ఛేదించాలి. ఈ పని అత్యంత విలువిద్యా నిపుణుడే చేయగలగుతాడు.

ఈ స్వయంవరానికి దేశదేశాంతరాలనుండి అనేక రాజ మహారాజులు వచ్చారు. కాని, ఎవ్వరూ మత్స్యయంత్రాన్ని ఛేదించలేక పోయారు. బ్రాహ్మణవేషంలో ఉన్న పాండవులుకూడా ఆ స్వయంవరానికి వచ్చారు. అందులో అర్జును డొక్కడే ఆ యంత్రాన్ని భేధించగల ధనుర్ధారి. చివరకు ఆ పని అర్జునుడే చేయగలిగాడు. స్వయంవర నియమాన్న నుసరించి ద్రౌపది అర్జునుని మెడలో జయమాల వేసి వరించింది. దానితో సభకు వచ్చిన రాజన్యులంతా అవమానంగా భావించి అర్జునుడు ద్రౌపదిని తీసుకుపోకుండా అడ్డుకున్నారు. వారందరిని భీమార్జునులు ఎదుర్కొని ద్రౌపదిని బయటకు తీసుకువచ్చారు. ఇంతలో ద్రౌపది సోదరుడు తన సోదరిని ఒక బ్రాహ్మణుడు తీసుకుపోవటం యిష్టంలేక తన చతురంగసేనను సమాయత్తంచేయ యత్నించాడు. అది గమనించి ఆ సభకు వచ్చిన బలరామకృష్ణులు అతనిని సమాధానపరచారు. నీ సోదరి గెలిచిన బ్రాహ్మణునివెంట స్వచ్ఛందగా వెడుతున్నది. కనుక నీవు అడ్డుపడకూడదన్నారు. అతడు క్షత్రియుడు కాకున్నా బ్రాహ్మణుడు కదా! క్షత్రియునికన్న ఎక్కువ వర్ణస్థుడే కదా! అని నచ్చచెప్పారు.

అనంతరం శ్రీకృష్ణుడు పాండవులు గుప్తవేషంలో బసచేసిన చోటుకు వెళ్ళాడు. వారు పాండవులనీ, వారణావత లాక్షాగృహ దహనం నుండి బయటపడినారనీ గుర్తించాడు. అంతేగాక, కుంతీదేవి శ్రీకృష్ణునికి మేనత్త. వసుదేవుని సోదరి. ఆమెను బాల్యంలోనే కుంతిభోజుడు దత్తతగా

తీసుకున్నాడు. శ్రీకృష్ణుడు మేనత్త కుంతీదేవిని గుర్తించి పాదాభివందనం చేసాడు. పాండవులను గుప్తవేషం చాలించి ప్రకటింప బడండని కోరాడు. వారు అట్లే చేసారు.

మహారాజు ద్రుపదునకు ఈ సమాచారం తెలిసి ప్రసన్నుడయ్యాడు. తిరిగి పాండవులను సన్మానపూర్వకంగా హస్తినాపురికి తీసుకువెళ్ళాడు. ఈసారి ద్రుపదుడు, కృష్ణుడు మరియు సంబంధీకులు అంతాకలిసి ధృతరాష్ట్రునిపై వత్తిడితెచ్చి పాండవులకు ఖాండవప్రస్థరాజ్యాన్ని యిప్పించారు. ఇంద్రప్రస్థాన్ని రాజధానిగా చేసుకొని దృఢమైన రాజ్యవ్యవస్థ చేసుకోమని సలహాయిచ్చారు. పాండవు లట్లే చేసారు. తమ రాజ్యాన్ని ధన ధాన్యాలతో పరిపూర్ణంచేసుకొన్నారు. ధర్మయుక్త వ్యవహారంతో ప్రజలకు ప్రీతి పాత్రులయ్యారు. సువ్యవస్థిత సైనికబలాన్ని చేకూర్చుకున్నారు. అప్పుడే అర్జునునకు కృష్ణునకు గాఢమైన స్నేహం ఏర్పడింది. బలరామకృష్ణుల సోదరి సుభద్రను అర్జునకిచ్చి వివాహం జరిపించారు. దానితో సన్నిహిత సంబంధం ఏర్పడింది.

పాండవులు ఇంద్రప్రస్థంలో స్థిరపడి ఉన్నతావస్థను పొందిన తదుపరి యుధిష్ఠిరునకు రాజసూయయజ్ఞం చేయాలనే సంకల్పం కలిగింది. అనేక యుద్ధాలలో విజయం పొందిన రాజనీతి దురంధరుడైన శ్రీకృష్ణునితో ఈ విషయం ప్రస్తావించాడు. శ్రీకృష్ణుడు ఆలోచించి - రాజసూయ యజ్ఞంలో ముగ్గురు వ్యక్తులు మనకు అడ్డుగా ఉంటారు. ఒకరు దుర్యోధనుడు, రెండవవాడు శిశుపాలుడు, మూడవ వ్యక్తి జరాసంధుడు. ముందుగా వీరిని వేరువేరుగా జయించి రాజసూయ యజ్ఞాన్ని ప్రారంభిస్తే నిర్విఘ్నంగా సాగుతుందని సలహాయిచ్చాడు. దీనిని బాగా చర్చించిన తదుపరి ముందుగా జరాసంధుని జయించాలను కున్నారు. కృష్ణార్జునులు భీముని తీసుకుని జరాసంధుని రాజధానికి చేరుకున్నారు. జరాసంధుడు

మగధదేశానికి రాజు. అతని రాజధాని గిరివ్రజ నగరం. ఈ ముగ్గురు వేషాలు మార్చుకుని జరాసంధుని మల్లయుద్ధానికి రమ్మని సవాలు చేసారు. పరిణామంగా భీమునకు జరాసంధునకు మల్లయుద్ధం జరిగింది. చివరికి జరాసంధుడు భీమునిచే చంపబడ్డాడు.

అనంతరం దుర్యోధనుని అంగీకరింపజేయటంకోసం వ్యాస మహర్షిని ధృతరాష్ట్రుని వద్దకు పంపారు. వ్యాసమహర్షి ధృతరాష్ట్రుని సమాధాన పరచాడు. కాని, దుర్యోధనుడు యజ్ఞాన్ని వ్యతిరేకిస్తానన్నాడు. అంతట భీష్ముడు, ద్రోణుడు – 'మేము పాండవులపక్షంలో ఉండి నీపై యుద్ధంచేస్తా'మని హెచ్చరించారు. దానితో వివశుడై దుర్యోధనుడు రాజసూయయజ్ఞాన్ని అంగీకరించాడు.

యుధిష్ఠిరుడు సమస్త పృథివీమండల రాజ – మహారాజుల నందరిని తనకు అనుకూలం చేసుకుని రాజసూయయజ్ఞాన్ని సంపన్నం చేసాడు. శిశుపాలుడు విఘ్నంచేయ యత్నించాడు. వెంటనే కృష్ణుడు అతనిని చంపివేసాడు.

రాజసూయయజ్ఞ వైభవాన్ని, అపార ధనసంపత్తిని, అత్యద్భుత మైన మయసభ భవనాన్ని చూసిన దుర్యోధనునిలో అసూయాజ్వాలలు మింటికెగసాయి. దానికి తోడు మయసభా భవనంలో నీటిమడుగును తివాసీగా భావించి అందులో పడిపోవటం, అది చూసిన ద్రౌపది హేలనగా పరిహసించటం అతని మనసును కలచివేసాయి. చింతాగ్రస్తుడై హస్తినాపురికి చేరుకున్నాడు. ఎలాగయినా కక్ష తీర్చుకోవాలనుకున్నాడు. మామ శకునిని సంప్రతించాడు. ఇద్దరు కలిసి ఒక పన్నాగం పన్నారు. శకుని సిద్ధహస్తుడైన జూదరి. యుధిష్ఠిరుడు ధర్మాత్ముడేకాని జూదం పట్ల అత్యంత వ్యసనపరుడు. ఆతనిలోని ఆ బలహీనతను ఆసరాగా తీసుకొని అతని సంపూర్ణ రాజ్యాన్ని, అన్నదమ్ములను, ద్రౌపదిని పణంగా

పెట్టించి అతనిని ఓడించి అన్నిటిని తమ వశం చేసుకోవాలనుకున్నారు. అందుకు అతనిని ఆహ్వానించారు. వారనుకున్నట్లే అన్నీ జరిగాయి. కాని, ఒక పొరపాటు జరిగింది. యుధిష్ఠిరుడు ముందు తనను పణంగా పెట్టి ఓడిపోయాడు. అనంతరమే మిగిలినవన్నీ పణంగా పెడుతూ ఓడిపోయాడు. కనుక ఇది చెల్లదని మరొకసారి పోటీ వేయాలని నిర్ణయించారు. ద్రౌపది మరియు సోదరులు ఎంత వారిస్తున్నా యుధిష్ఠిరుడు వినలేదు. వ్యసన మోహితుడైపోయాడు. "ఈ సారి గెలిచినవారు మొత్తం రాజ్యానికి, సంపదలకు స్వాములవుతారు. ఓడినవారు 12 సంవత్సరాలు వనవాసం, ఒక సంవత్సరం అజ్ఞాతవాసం చెయ్యాలి. ఒకవేళ అజ్ఞాతవాసంలో ఉండగా వారు గుర్తింపబడితే తిరిగి 12 సంవత్సరాల వనవాసం + ఒక సంవత్సరం అజ్ఞాతవాసం – ఈ చక్రం యిలాగే నడవాలి. అరణ్యవాస అజ్ఞాతవాసాలు సక్రమంగా పూర్తిచేస్తే ఓడినవారి రాజ్యాన్ని, సిరిసంపదలను అన్నీ వారికిచ్చివేయాలి." అనే షరతుపై జూదం ఆడారు. దురదృష్టవశాత్తు యుధిష్ఠిరుడు ఓడిపోయాడు. దానితో ద్రౌపదితో సహా పాండవులు అరణ్యవాసానికి వెళ్ళివలసివచ్చింది.

ఎన్నెన్నో కష్టాలకోర్చి ఎట్లో పాండవులు అరణ్యవాస అజ్ఞాత వాసాలను పూర్తిచేయగలిగారు. పందెం షరతు ప్రకారం దుర్యోధనుడు పాండవులరాజ్యం పాండవులకిచ్చివేయాలి. కాని, తిరిగి యివ్వటానికి దుర్యోధనుడు ఎంతమాత్రం అంగీకరించలేదు. భీష్ముడు, కృష్ణుడు, వ్యాసుడు, గురువులు, బంధువుల, మిత్రులు ఎంతమంది నచ్చచెప్పటానికి ప్రయత్నించినా, అన్యాయమని ఘోషించినా దుర్యోధనుడు వినలేదు. చివరకు యుద్ధమే శరణ్యమయ్యింది.

యుధిష్ఠిరునిలోని జూదవ్యసనాన్ని ప్రపంచరాజులంతా

నిందించారు. వారికి ముందు ఉన్న గౌరవభావం, సద్భావం తగ్గింది. అయినా యిప్పుడు వారికి జరుగుతున్న అన్యాయాన్ని సహించలేక పోయారు. వారికి అండగా ఉండటానికి కొందరు ముందుకు వచ్చారు. ఎట్లో పాండవులు ఏడు అక్షౌహిణుల సైన్యాన్ని తమవైపు పోరాడటానికి సమకూర్చుకోగలిగారు. కౌరవులు పదకొండు అక్షౌహిణుల సైన్యాన్ని సమకూర్చుకున్నారు. కురుక్షేత్రాన్ని రణభూమిగా ఎంచుకున్నారు. ప్రపంచదేశాలన్నిటినుండి రాజులు - మహారాజులు వీరులు శూరులు అంతా యుద్ధరంగానికి తరలివచ్చారు. అతి భయంకరమైన యుద్ధం జరిగింది. ఇరువైపుల సైన్యం పూర్తిగా నాశనమయ్యింది. భారత యుద్ధంలో అన్ని రకాల శస్త్రాస్త్రాల ప్రయోగం జరిగింది. ఛల కపటాల వ్యవహారం కూడా జరిగింది.

చివరికి దుర్యోధనుడు భీమునిచే చంపబడ్డాడు. అనంతరం అశ్వద్ధామ పాండవులు నిద్రించిన గుడారానికి అర్ధరాత్రి నిప్పుపెట్టాడు. అదృష్టవశాత్తు పాండవులు ఒక పనిమీద దూరంగా వెళ్ళియుండుటచే బ్రతికిబయటపడ్డారు. భారత ఇతిహాసంలో యింతటి పెద్ద భయంకర యుద్ధం ముందెన్నడు జరగలేదు.

## భారతయుద్ధం - ఒక విశ్లేషణ

మహాభారత కథ అందరికీ తెలిసినదే కనుక గ్రంథవిస్తరణ భీతిచే అతి సంక్షిప్తంగా వ్రాయబడింది. భారతయుద్ధం జరగటానికి ముఖ్యకారణం దుర్యోధనుని ఆసురీ ప్రవృత్తులే. అందులో ముఖ్యమైనవి.

1) రాజవంశావళియొక్క నియమాన్ననుసరించి యుధిష్ఠిరుడు పెద్దవాడు కనుక రాజ్యాధికారం అతనికే రావాలి. కాని, దుర్యోధనుడు దీనిని భంగపరచాడు.

2) పాండవులలో భీముడు బలవంతుడు కనుక అతనిని చంపటానికి శతవిధాల ప్రయత్నించాడు. కుట్రలు పన్నాడు.

3) పాండవులయిదుగురిని, కుంతీమాతను సజీవదహనం చెయ్యాలని లక్కభవనం నిర్మింపజేసి, దానికి నిప్పు పెట్టించాడు.

4) యుధిష్ఠిరునితో ఆడిన జూదం కపటంతోనే జరిగింది. ఆటలో కూడా మోసమే జరిగింది.

5) వనవాసం చేస్తున్నప్పుడుకూడా వారిని చంప యత్నించాడు.

6) అజ్ఞాతవాసాన్ని భంగపరచాలని ప్రయత్నించాడు. ఒక సంవత్సరం పూర్తికావటంవల్ల పెద్ద సంకటాన్నుండి పాండవులు బయటపడ్డారు.

7) అరణ్యవాస అజ్ఞాతవాసాలు సక్రమంగా పూర్తిచేసినా వారి రాజ్యం వారికివ్వటానికి నిరాకరించాడు.

8) జూదంలో పాండవులు ఓడిపోయినపుడు ద్రౌపదిని నిండు సభలో అవమానపరచాడు. వివస్త్రనుచేయ యత్నించాడు.

9) ధృతరాష్ట్ర గాంధారీ భీష్ములు ఎంతవారించినా యుద్ధమే శరణ్యమన్నాడు. కృష్ణ వ్యాస విదుర నారదాదుల హితోక్తులుకూడా వినలేదు.

10) చివరికి మరణించేటప్పుడు కూడా పశ్చాత్తాపం చెందకపోగా ద్వేషంతోనే చనిపోయాడు.

చివరగా దుర్యోధనునకు భీమునకు ద్వంద్వ యుద్ధం జరిగింది. ఇద్దరు గదలు ధరించి తలపడ్డారు. భీకరంగానే పోరాడారు. చివరకు భీముడు గదాయుద్ధ నియమాన్ని తప్పి తొడలపై కొట్టాడు. దానితో తొడలు విరిగి దుర్యోధనుడశక్తుడయ్యాడు. ఓడిపోయాడు. ఆ యుద్ధం

జరిగేటప్పుడు బలరామకృష్ణులు కూడా ఉన్నారు. భీముని ఈ దుశ్చర్యతో బలరామునకు పట్టలేనంత ఆగ్రహం వచ్చింది. రెండు చేతులు పైకెత్తి యిది ధిక్కారమనీ, అన్యాయమనీ ఘోషిస్తూ తన హలాయుధాన్ని ధరించి భీమునిపైకి లంఘించాడు. అప్పుడు శ్రీకృష్ణుడు తన రెండు బాహువులతో అన్నను ఆపి సముదాయించాడు. 'భీముడు చేసింది అధర్మమే. కాని అధర్మాత్ముడైన దుర్యోధనుని చంపటానికే ఈ పనిచేసా' డన్నాడు. దుర్యోధనుడు భీమునికి విషమిప్పించి చంప యత్నించాడన్నాడు. నిండు సభలో ద్రౌపదిని వచ్చి తన తొడలపై కూర్చోమన్నాడు. అప్పుడే భీముడు నీ తొడలు విరగకొట్టి చంపుతానన్నాడు. ఆ ప్రతిజ్ఞనే యిప్పుడు అతడు నెరవేర్చుకున్నాడు. ఇందులో దోషమేమి? అని ప్రశ్నించాడు. ఈ దుర్యోధనుడు చేసిన వంచన వల్లనే కురు వృష్ణివంశాల రెంటికి తలమాణికమైన వీరాభిమన్యుడు చనిపోయాడన్నాడు. పైన తెలిపిన దోషాలన్నిటిని ఏకరువుపెట్టాడు. దానితో బలరాముడు శాంతించాడు.

ఇట్టివే భారతయుద్ధంలో అనేక దోషాలున్నాయి. ఇక జరిగిన నష్టం వర్ణనాతీతం. ఒక అక్షౌహిణీ సేనలో 21, 870 రథాలు, 21, 870 ఏనుగులు, 65, 610 గుఱ్ఱపు దళము ; 1,09,350 (పాదదళము) రథాలపైన; ఏనుగులపైన కనీసం యిద్దరైనా ఉంటారు. అంతా కలిసి ఒక అక్షౌహిణీ 2, 62, 440 మంది మనుష్యులుంటారు. మొత్తం 18 అక్షౌహిణీలోను 47, 23, 920 మంది మనుష్యులుంటారు. వీరందరు చనిపోయారంటే ఎంత భారీ నష్టమో మీరే ఊహించండి. క్షాత్రశక్తి అంతా నశించి జాతి జీవచ్ఛవమై పోయింది. ఎంతోమంది స్త్రీలు పతివిహీనలు గాను ఎంతో మంది పిల్లలు అనాథులుగాను మిగిలి పోయారు. ఆస్తినష్టం, ప్రాణనష్టమే కాక విద్యా విజ్ఞానాలు నశించాయి.

ఎన్నో యిబ్బందులేర్పడ్డాయి. అప్పటినుండి ఆర్యచక్రవర్తి రాజ్యం పతనోన్ముఖమయ్యింది.

రామ-రావణ యుద్ధం ఆర్య-రాక్షసజాతుల మధ్య జరిగింది. అందు ఆసురీ ప్రవృత్తిగల రాక్షసులు మాత్రమే సంహరింపబడ్డారు. మిగిలిన వారిని శ్రీరాముడు విభీషణున కప్పగించాడు. అతడు రాక్షసజాతిని ధర్మమార్గంలో నడిపించాడు. కొంత నష్టం జరిగినా అది ఒక సంస్కరణ వంటిదే అయ్యింది. కాని, కౌరవ-పాండవయుద్ధం ఒకే ఆర్యజాతిలో ముఖ్యంగా ఒకే వంశంలో ఒకే కుటుంబంలో జరిగింది. రెండు వైపుల ధర్మశీలత, నైతికత దిగజారాయి. అందువల్ల రెండు పక్షాలు నష్ట పోయాయి.

భారతకాలంనాడు నియోగ వ్యవస్థ ఉండేది. ఆనాటి దేశకాల పరిస్థితులనుబట్టి రాచరిక వారసత్వాన్ని కాపాడటానికి అది అవసర మయ్యింది. నేటి దేశకాల పరిస్థితులనుబట్టి పునర్వివాహాలు జరుగుతున్నాయి. ఇవి వేదసమ్మతమే. పురుషు లెట్లు భార్య మరణించిన రెండవ వివాహం చేసుకుంటారో, అట్లే పతి మరణించిన స్త్రీలు పునర్ వివాహం చేసుకోవచ్చును. ఆ కాలంలో దూరస్థ వివాహాలు జరుగుతూ ఉండేవి. పాండురాజుయొక్క రెండవ భార్య మాద్రి ఈరాన్ దేశపు రాకుమార్తె. ధృతరాష్ట్రుని భార్యయగు గాంధారి కంధారదేశ రాజపుత్రిక.

ఆనాడు నిస్సంకోచంగా దేశదేశాంతరాలకు పోతూ వస్తూ ఉండేవారు. మధ్యకాలంలోనే కొందరు ధూర్తులు సముద్రయానాన్ని నిషేధించారు. విదేశీయులైన చీనా దేశపు భగదత్తుడు, అమెరికాదేశపు బభ్రువాహనుడు, యూరపుదేశపు బిడాలాక్షుడు (పిల్లికన్నులవంటివాడు), ఈరాన్‌దేశపు శల్యుడు రాజసూయ యజ్ఞంలోను, భారతయుద్ధంలోను

పాల్గొన్నారు. కృష్ణార్జునులు ప్రపంచమంతా పర్యటించి రాజుల నాహ్వానించి వచ్చారు. వేదవ్యాసులవారుకూడా కొంతకాలం పాతాళదేశంలో (నేటి అమెరికాలో) నివసించారు. విదేశ గమనాగమనములు చేస్తూ మీ దేశాన్ని సుసంపన్నంచేసుకోమనే వేదం చెబుతుంది.

## కలియుగం - యుధిష్ఠిర పట్టాభిషేకం

కలియుగారంభం యుధిష్ఠిరుని పట్టాభిషేకంతో ప్రారంభ మయ్యిందని కొందరు, భారతయుద్ధం సమాప్తం కాగానే ప్రారంభ మయ్యిందని కొందరు చెబుతారు. ఈరెంటికి ఎక్కువ కాలభేదం లేదు కనుక ఒకటిగానే భావించవచ్చు. మరికొందరు శ్రీకృష్ణుని నిర్యాణానంతరం జరిగిందని చెబుతారు. భారతీయ పంచాంగం ప్రకారం కలియుగం ప్రారంభమై 5,105 సంవత్సరములు గడచి 5,106 వ సంవత్సరం జరుగుతోంది.

భారతయుద్ధానంతరం జయించిన పాండవులకు రాజ్యం లభించింది. వారిలో పెద్దవాడగు యుధిష్ఠిరుని రాజుగాప్రకటించి పట్టాభిషేకం చేసారు. ధృతరాష్ట్రునికి యిష్టం లేకున్నా విధిలేక తన చేతులమీదుగా యుధిష్ఠిరునికి రాజ్యాన్ని అప్పగించి పట్టాభిషేకం చేసాడు. యుద్ధంలో మిగిలిన శ్రీకృష్ణుడు మొదలగువారు సెలవు తీసుకుని వారివారి రాజ్యాలకు వెళ్ళిపోయారు.

అనంతరం ధృతరాష్ట్రుడు వానప్రస్థాశ్రమం తీసుకొని వనాలకు వెళ్ళిపోతానన్నాడు. పతివ్రతయైన గాంధారి పతి ననుసరించి తానూ వెడతానన్నది. వీరిద్దరి ప్రయాణం చూసి కుంతీదేవి నాపనికూడా పూర్తయినది. నేనుకూడా వనాలకు వస్తానన్నది. ఆ ముగ్గురు కలిసి వనాలకు వెళ్ళి కుటీరాలను నిర్మించుకొని కందమూలఫలాలు తింటూ

తాపసిక జీవితం గడిపారు. దీనినిబట్టి నాడుకూడా నిష్ఠగా ఆశ్రమ ధర్మాలు పాటింపబడుతూ ఉండేవని అర్థమౌతోంది. దురదృష్టవశాత్తు ఒక రోజు వారున్న అడవికి నిప్పంటుకున్నది. చుట్టూ అగ్ని జ్వాలలు సమీపించుకుంటూ రావటం జరిగింది. ధృతరాష్ట్రుడు పుట్టు గ్రుడ్డివాడు కావటంచేతను, గాంధారి మూఢపాతివ్రత్యం పేరుతో కండ్లకు గుడ్డకట్టుకుని అంధురాలు కావటంచేతను వారిది తప్పించుకు పారిపోలేని పరిస్థితి. కుంతీదేవికి అవకాశం ఉన్నప్పటికి అక్కగారిని, బావగారిని ఆ స్థితిలో వదిలి వెళ్ళలేక వారితోనే ఉండిపోయింది. అగ్ని సమీపించుకుంటూ వచ్చి వారి కుటీరాలకు అంటుకుంది. ఫలితంగా ముగ్గురూ అగ్నికి ఆహుతి అయ్యారు.

అనతికాలంలోనే యాదవవంశంకూడా నాశనమయ్యింది. యాదవులలో మద్యపాన మల్లయుద్ధ వ్యసనాలుండేవి. ఒక పర్వదినాన యాదవులు విపరీతంగా మద్యం సేవించి ఉన్మత్తులైపోయారు. ఒకరి నొకరు దూషించుకున్నారు. పెరిగిపెరిగి పెద్ద కలహమే అయ్యింది. బంధొరులు మల్లయుద్ధాలుచేసి ఒకరినొకరు చంపుకున్నారు. బలరాముడు కూడా అతిగా మద్యం సేవించి చనిపోయాడు. మహాత్ముడైన శ్రీకృష్ణుడు ఎంత వారించినా ఎవరూ ఆగలేదు. 'వినాశకాలే విపరీత బుద్ధి' అన్నట్లయ్యింది.

శ్రీకృష్ణుడు దిగ్భ్రాంతిని చెంది, ఈశ్వరేచ్ఛగా భావించి చెట్టునీడన విశ్రమించాడు. ఒక బోయవాడు వేసిన బాణం అతని పాదంలో గుచ్చుకుపోయింది. కారణం చిన్నదైనా శ్రీకృష్ణుడు తన పని పూర్తయినట్లుగా భావించి సమాధిస్థితికి వెళ్ళి స్థితప్రజ్ఞుడుగా శరీరాన్ని వదలిపెట్టి దివంగతుడయ్యాడు.

పాండవులకు ఈ వార్త తెలిసి మిక్కిలిగా దుఃఖించారు. మిగిలిన స్త్రీలను పిల్లలను తీసుకురమ్మని యుధిష్ఠిరుడు అర్జునుని పంపిస్తాడు. అర్జునుడు అట్లే మిగిలిన స్త్రీలను తీసుకువస్తూఉండగా ఒక అడవిలో వారిపై గంధర్వులు దాడి జరిపారు. మహావీరుడైన అర్జునుడు కూడా ఆ సమయంలో వారిని త్రిప్పికొట్టలేకపోయాడు. గంధర్వులు యాదవస్త్రీలనందరిని చెఱపట్టి తీసుకువెళ్ళిపోయారు. అర్జునుడు వట్టిచేతులతోనే హస్తినాపురికి వెళ్ళవలసివచ్చింది. 'విధి బలీయం' అని అంతా విచారించారు.

యుధిష్ఠిరుని పట్టాభిషేకానంతరం కొన్ని నెలలకు అభిమన్యుని భార్య పుత్రుని ప్రసవించింది. ఆ బాలునకు 'పరీక్షితు'డని నామకరణంచేసి జాగ్రత్తగా పెంచసాగారు.

యుధిష్ఠిరుడు 36 సంవత్సరాలు రాజ్యపాలన చేసాడు. అనంతరం పరీక్షితునకు రాజ్యాన్ని అప్పగించి సోదరులతో మరియు ద్రౌపదితో కలిసి దేవలోకానికి వెళ్ళి వానప్రస్థిగా జీవితం గడుపుతానని బయలుదేరాడు. వారు దేవలోకం చేరకుండానే మార్గమధ్యంలోనే ఉండిపోయారని మహాభారతం చెబుతుంది.

పరీక్షితుడు 24 సంవత్సరాలు పాలించిన తదుపరి కశ్యపుని స్వార్థం వలన మరణించాడు. అతని మరణం ఆనాటి ప్రజల వ్యవహారం ఎలా ఉండేదో తెలుపుతుంది.

ఒకనాడు పరీక్షితుడు వేటకై అడవికివెళ్ళి అలసిపోయాడు. అతని బాణం దెబ్బకు గాయపడిన ఒక మృగం ఎటో పారిపోయింది. దానిని వెతుకుతూ చాలా దూరం వెళ్ళాడు. అక్కడ అతనికి శమికముని ఆశ్రమం కనబడింది. ముని మౌనవ్రతాన్ని పాటిస్తూ తపస్సు చేసుకుంటున్నాడు.

పరీక్షితుడు లోనికివెళ్ళి – "ఓ మునిశ్రేష్ఠా ! నేను అభిమన్యు పుత్రుడను. ఇక్కడకు ఏదైనా గాయపడిన మృగం వచ్చిందా!" అని అడిగాడు. ముని ఏమీ సమాధానం చెప్పకుండా మౌనంగా కండ్లుమూసుకొని ధ్యానం చేసుకుంటూ ఉన్నాడు. అతడు తెలిసికూడా కావాలని చెప్పటంలేదనుకుని పరీక్షీతుడు కొద్ది దూరంలో మరణించిన ఒక సర్పం ఉంటే దానిని విల్లుతో ఎత్తి ముని మెడలో మాలగావేసి వెళ్ళిపోయాడు. ఇంతటి కొంటె పని చేసినా ముని మాట్లాడలేదు. భయపడలేదు. తన తపస్సులో తను లీనమైయున్నాడు.

కొంతసేపటికి ఆ మునియొక్క కుమారుడు 'శృంగి' అక్కడకు వచ్చాడు. అతడు చాలా తేజస్వి. తండ్రి మెడలో మాలగా వ్రేలాడుతున్న పామును చూసి ఉద్రిక్తుడయ్యాడు. ఎవరీపనిచేసారని ఆరాతీసాడు. శమికముని జరిగిన వృత్తాంతమంతా కుమారునికి వివరించాడు. అది విన్న శృంగి ఇట్టి దుష్టుడైన రాజు జీవించటం లోకహితం కాదనుకున్నాడు. అతనిని చంపటానికి పన్నాగం పన్నసాగాడు. తన తండ్రి నాగజాతి ఆటవికులకు గురువు. వారికి ఈ విషయం తెలిపి వారితో అతనిని చంపించాలనుకున్నాడు. వారిని సంప్రతించాడు. గురువుకు జరిగిన అవమానానికి ప్రతీకారం తీర్చుకుంటానన్నారు నాగులు. తక్షకు డనే నాగజాతి నాయకుడు ఈ బాధ్యత తాను తీసుకుంటానన్నాడు. ఈ విషయం ఎట్లో పరీక్షితునకు తెలిసిపోయింది. అప్పటినుండి తనచుట్టూ సైనిక పహరా ఏర్పాటుచేసుకొని జాగ్రత్తగా ఉండసాగాడు.

ఒకనాడు కొందరు నాగులు బ్రాహ్మణవేషం ధరించి రాజును ఆశీర్వదించే నెపంతో అంతఃపురంలోనికి ప్రవేశించారు. ఆశీర్వాదం తీసుకోవడం నాకు మేలేకదా ! అనుకొని కలుసుకోవడానికి రాజు అనుమతించాడు. ఆ బ్రాహ్మణవేషధారులు రాజునకు కొన్ని పండ్లు

బహుకరించారు. రాజువాటిని స్వీకరించి ఆశీర్వాదం తీసుకుంటూ ఉండగా తక్షకుడు తన వస్త్రాలలో దాచితెచ్చుకున్న ఖడ్గంతో రాజును చంపివేసాడు.

ఈ కథ వెనుక మరొక కథ ఉంది. తక్షకుడు రాజును చంపటానికి పన్నాగం పన్నుతున్నాడని తెలిసి కశ్యపు డనే ఒక బ్రాహ్మణుడు రాజును రక్షించడానికి బయలుదేరాడు. అతనికి సంజీవనీ విద్య తెలుసు. రాజు ఏదైనా ప్రమాదంవల్ల గాయపడితే అతనిని కాపాడి విలువైన బహుమతులు పొందాలని అతని ఆలోచన. (బహుశః సంజీవనీ విద్య అంటే అత్యవసర వైద్యవిద్య కావచ్చు) ఈ విషయం ఎట్లో తక్షకుడు తెలుసుకున్నాడు. ఆ బ్రాహ్మణుని వద్దకువెళ్ళి – 'ధనమేకదా ! నీకు కావాలి. రాజుకన్న నీకు నేను ఎక్కువ ధనం యిస్తానని కొంత ధనం అతనికిచ్చాడు. దానితో కశ్యపుడు తృప్తిపడి వెనుతిరిగివెళ్ళిపోయాడు. అంటే, ధనలోభంతో ఆ బ్రాహ్మణుడు రాజును చంపివేయటానికి వదలిపెట్టి వెళ్ళిపోయాడు.

ఈ రెండు కథలవల్ల ఆనాటి లోకపరిస్థితి ఎలా ఉండేదో అర్థమౌతుంది. పరీక్షితుని తదుపరి అతని కుమారుడు జనమేజయుడు రాజయ్యాడు. ఇంతలో మరొక సంఘటన జరిగింది. ఒక ఉపాధ్యాయుని వద్ద వేదం చదువుకొన్న ఉతఙ్కు డనే ఒక శిష్యుడు గురుదక్షిణగా ఏమివ్వాలని గురువు నడిగాడు. దానికి ఆ ఉపాధ్యాయుని భార్య పౌష్య డనేవాని భార్యయొక్క కుండలాలు తెచ్చి ఇమ్మని కోరింది. ఆ శిష్యుడు ఆ కుండలాలను యాచించి తీసుకువెడుతుండగా తక్షకుడు వాటిని బలవంతంగా తీసుకుపోవడానికి విఫలప్రయత్నం చేసాడు. శిష్యుడు ఎట్లో తప్పించుకొని గురుదక్షిణ చెల్లించాడు. ఉతఙ్కుడు తక్షకుడు చేసిన పనిని సహించలేకపోయాడు. ఎట్లైనా అతనిని చంపించాలని రాజు జనమేజయుని వద్దకు వెళ్ళాడు. జరిగింది వివరించి – నీ తండ్రిని

చంపిన నాగులను హతమార్చమని రెచ్చగొట్టాడు. ప్రోత్సహించాడు. దానితో జనమేజయుడు నాగజాతిని నాశనం చేయడానికి పూనుకున్నాడు. నాగులు ఎక్కడ కనబడినా పట్టుకొని మంటలలో త్రోసివేసి సజీవదహనం చెయ్యమని సైనికుల కాజ్ఞయిచ్చాడు.

ఆ విధంగా ఘోరమైన నాగుల హత్యాకాండ ప్రారంభమయ్యింది. జనమేజయుడు తన రాజ్యంలోని నాగులను సమూలంగా నాశనం చేయాలని సంకల్పించాడు. దానికి సర్పయజ్ఞ మని పేరుపెట్టాడు. ఆస్తికులైన మునులు దానిని సహించలేకపోయారు. వారంతా కలిసివచ్చి జనమేజయునకు నచ్చజెప్ప యత్నించారు. అతడు వినలేదు. ఈ యజ్ఞ మిట్లే కొనసాగుతుందన్నాడు. అంతట మునులు 'నీవు ఆపకుంటే మేమంతా నిరాహారదీక్షపూని మరణిస్తా'మని హెచ్చరించి వెళ్ళిపోయారు.

ఆనాటి మునులలో, విద్వాంసులలో రెండు వర్గాలు ఏర్పడ్డాయి. ఒక వర్గం జనమేజయుడు చేసే యజ్ఞం మంచిదేనన్నారు. తండ్రి హత్యకు ప్రతీకారంగా ఈ పనిచేస్తున్నాడన్నారు. మరొక వర్గం ఇది మంచిది కాదన్నారు. మానవత్వం కాదన్నారు. తక్షకుడు ఒక్కడు చేసిన తప్పుకు అమాయకులైన మొత్తం నాగులను నశింపచేయటం ఎంతమాత్రం మంచిదికాదన్నారు. ఇరువర్గాలమధ్య వాదోపవాదాలు జరిగాయి. చివరకు అంతా ఒకటై ఆ సర్పయజ్ఞాన్ని ఆపుచేయించారు. దానితో తక్షకుడు బ్రతికి బయటపడ్డాడు. ఈ ఘటన కలియుగం ఆరంభమైన 70-80 సంవత్సరాల మధ్య జరిగింది.

# సర్పయజ్ఞం - ఒక విశ్లేషణ

భారతయుద్ధంవల్ల కలిగిన భారీ నష్టంతో కూడా ఆనాటి క్షత్రియులలో మార్పురాలేదు. పశ్చాత్తాపం కలగలేదు. మునిపుంగవునిపై పరీక్షితుడు చేసిన దుశ్చేష్ట గర్హించతగినది. అది అందరకు ఆదర్శ ప్రాయుడుగా ఉండవలసిన రాజు చేయతగిన పనికాదు. జనమేజయుడు చేసిన సర్పయజ్ఞం కిరాతక చేష్ట. తక్షకుడు చేసిన పనికి అమాయకులను బాహాటంగా బలిగొనటం, దానికి 'యజ్ఞం' అని పేరు పెట్టటం శోచనీయం. నాగరాజు తక్షకుడు మోసంతో రాజును చంపటంకూడా సరియైన పద్ధతికాదు. క్షాత్రముంటే నాతో ద్వంద్వయుద్ధం చేయమని సవాల్‌చేసి చంపటం మంచింది.

ఆనాటి బ్రాహ్మణులుకూడా తమ బ్రాహ్మణధర్మంనుండి దూరమయ్యారు. రాజును రక్షించవలసిన కశ్యప బ్రాహ్మణుడు లంచం తీసుకొని రాజహత్యను ప్రోత్సహించాడు. వేదాలు చదువుకున్న బ్రహ్మచారి ఉతఙ్కబ్రాహ్మణుడు చేసినదికూడా సరిగాలేదు. కేవలం తనవద్దనుండి కుండలాలు దోచుకో యత్నించాడన్న చిన్నకారణంతో అతనిపై ద్వేషాన్ని పెంచుకొని రాజైన జనమేజయుని రెచ్చగొట్టాడు. మీ తండ్రి హత్యకు ప్రతీకారం తీర్చుకోమన్నాడు. సర్పయజ్ఞంచేయ ప్రోత్సహించాడు. విచిత్రమేమంటే - ఒక బ్రాహ్మణవర్గం సర్పయజ్ఞాన్ని సమర్థించింది.జాతికి ధర్మాన్ని బోధించవలసిన బ్రాహ్మీశక్తి ధర్మాన్ని తప్పింది.

బ్రాహ్మీశక్తి బలంగా ఉంటేనే జాతికి మార్గదర్శనం చెయ్యగలుగుతుంది. క్షాత్రశక్తిని కూడా సరియైన దారిలో నడుపగలుగుతుంది. భారతయుద్ధంకన్న ముందే బ్రాహ్మీశక్తి బలహీనపడింది. ధనుర్వేద పారంగతుడైన ద్రోణాచార్యుడు సగౌరవంగా గురుకులం నడపుకోవలసినది

పోయి రాజుల కొలువులో జీతగాడైనాడు. విలాసజీవితం గడిపే విద్యార్థులకు విద్యలు నేర్పాడు. క్షాత్ర గుణకర్మ స్వభావాలుగల కర్ణుడు విద్యనేర్పమని వస్తే 'నీవు సూతుడవు. నీకు నేర్ప' నన్నాడు. ఏకలవ్యుని విషయంలోకూడా యిట్లే జరిగింది. అయినా, ఏకలవ్యుడు అతనినే గురువుగా భావించి తనంతతానుగా సాధనచేసి ప్రవీణుడయ్యాడు. తన శిష్యుడైన అర్జునుని కన్న అతడు గొప్పవాడు కాకూడదని ద్రోణాచార్యుడు అత్యంత క్రూరంగా అతని బొటనవ్రేలిని కోసి గురుదక్షిణగా సమర్పించ మన్నాడు. ఈ విధంగా భారతయుద్ధంకన్న పూర్వమే బ్రాహ్మీశక్తి ధర్మం తప్పింది. బ్రాహ్మీశక్తి సరిగా ఉంటే భారతయుద్ధమే జరిగి ఉండేదికాదు. యుధిష్ఠిరుని జూదమాడకుండానే నిరోధించి ఉండేది.

జనమేజయుడు తండ్రిమరణానికి పెద్దగాచింతించలేదు. బ్రహ్మచారి ఉతఙ్కుడు రెచ్చగొట్టటం వల్లనే నాగజాతినాశనానికి (సర్ప యజ్ఞానికి) పూనుకున్నాడు.

## మహాత్మా బుద్ధుడు

జనమేజయుని కాలంలో కొందరైనా వివేకవంతులైన బ్రాహ్మణు లుండబట్టి తర్కించి సర్పయజ్ఞాన్ని నిలుపుచేసారు. అయినా వైదిక కర్మకాండ - ముఖ్యంగా యజ్ఞయాగాదులు క్రమంగా వికృతరూపం దాల్చాయి. బ్రాహ్మణులు వేదాది సత్యశాస్త్రాలను తమవరకే పరిమితం చేసుకున్నారు. క్షత్రియ వైశ్యులకు కూడా నేర్పలేదు. అందుకే మిగిలిన ప్రజలకు వేదశాస్త్రాలు ఏమి బోధిస్తున్నాయో తెలియకుండా అయి పోయింది. దానితో కపట బ్రాహ్మణులదే రాజ్యమైపోయింది. బ్రాహ్మణ వాక్యమే బ్రహ్మవాక్యంగా నమ్మాలని ప్రచారం చేసారు. గుణకర్మల ననుసరించి ఏర్పడవలసిన వర్ణవ్యవస్థను రద్దుపరచి జన్మనుండే వర్ణాన్ని స్థిరపరచారు.

మేము భూదేవతలము, మా సేవచేయక ఎవరికిని స్వర్గం లభించదని ప్రచారం చేసారు. 'బ్రహ్మద్రోహీ వినశ్యతి' – బ్రాహ్మణులకు ద్రోహంచేసేవాడు నశిస్తాడని భయపెట్టారు. క్రమంగా వారిలో మద్యమాంస వ్యభిచారాది దోషాలు ప్రవేశించాయి. వాటిని రహస్యంగానే సేవించేవారు.

ఇబ్బందిపడుతూ మద్యమాంసాలను రహస్యంగా సేవించటంకన్న వాటిని శాస్త్రీయం చేస్తే మంచిదనుకున్నారు. ఆ బ్రాహ్మణులలోనే ఒకడు వామమార్గ ప్రథను ప్రవేశపెట్టాడు. 'శివ ఉవాచ', 'పార్వత్యువాచ', 'భైరవ ఉవాచ' అనే పేర్లతోకొన్ని తంత్రగ్రంథాలను వ్రాసి ప్రచారంచేసాడు. ఆ మార్గాన్ని కొందరనుసరించారు.

**మద్యం మాంసం చ మీనం చ ముద్రా మైథునమేవ చ ।**
**ఏతే పంచమకారాః స్యుర్మోక్షదా హి యుగే యుగే ॥'**

**(కాలీతంత్రం)**

మద్యం, మాంసం, మీనం (చేపలు), ముద్ర, మైథునా లనే పంచ మకారాలను సేవించేవారికి తేలికగా ముక్తి లభిస్తుందని ప్రచారం చేసారు. ఇంద్రియనిగ్రహం లేనివారు వారి మార్గాన్ని అనుసరించ సాగారు. వీరి మతం బాగా వ్యాప్తిచెందినపుడు వీరు మహాధూర్తులై వేదములలోనే అట్లు వ్రాసి ఉందని చెప్పసాగారు. మనుస్మృత్యాది ప్రామాణిక గ్రంథాలలో వారి కనుకూలంగా శ్లోకాలు కల్పించి ప్రక్షిప్తం చేసారు. ఉదాహరణకు –

**సౌత్రామణ్యాం సురాం పిబేత్ ।**
**ప్రోక్షితం భక్షయేన్మాంసం (మను. 5-27)**
**యజ్ఞార్థం పశవః సృష్టాః స్వయమేవ స్వయంభువా ।**
**యజ్ఞశ్చ భూత్యై సర్వస్య తస్మాద్యజ్ఞే వధో ఽ వధః ॥**

**(మను. 5-39)**

"సౌత్రామణి యజ్ఞంలో సురాపానం చేయాలి. ప్రోక్షిత మాంసాన్ని బ్రాహ్మణులు తినవచ్చును. స్వయంభువుడైన బ్రహ్మ యజ్ఞం కొరకే పశువులను సృష్టించాడు. అందుచేత యజ్ఞంకొరకు చేసే వధ వధకాదు". అని వేద విరుద్ధ హింసను యజ్ఞంలో ప్రవేశపెట్టారు. కొందరు ఈ హింసను, దుర్వ్యసనాలను విమర్శించియుంటారు. అందుచేత

శ్లో॥ **న మాంసభక్షణే దోషో న మద్యే న చ మైథునే ।**
**ప్రవృత్తిరేషాం భూతానం నివృత్తిస్తు మహాఫలా ॥ (మను. 5-59)**

'మాంసభక్షణ, మద్యపానం, మైథునక్రియలలో దోషమేమీలేదు. ఇవన్నీ ప్రాణులకు స్వాభావికం. కాని, వీటిని నిగ్రహించటంవల్ల గొప్పఫలం (ముక్తి) కలుగుతుం'దని సర్దిచెప్ప యత్నించారు.

ఈ విధంగా వారి క్రియాకలాపాలను సమర్థించుకునే కొన్ని శ్లోకాలు వ్రాసి, వారు వ్రాసినవంటే ప్రజలు నమ్మరని ఋషుల గ్రంథాలలో ప్రక్షిప్తంచేసారు.

అశ్వమేధ, గోమేధ యజ్ఞాలలో ఆ యా పశువులను చంపి ప్రోక్షితంచేసిన మాంసాన్ని ఆహుతిగా యిచ్చేవారు. మిగిలిన మాంసాన్ని యజ్ఞశేషంగా (ప్రసాదంగా) తినేవారు. సోమపానం పేరుతో సురాపానం చేసేవారు. వారికి అనుకూలంగా వేదమంత్రాలకు అర్థాలు చెప్పుకునే వారు. ఈ విధంగా వారి రాజ్యం సుమారు 1300 సంవత్సరాలు నిరాటంకంగా నడిచింది. యజ్ఞశాలలు పశువధశాలలుగా మారిపోయాయి. 'అధ్వరం - ఏ విధమైన హింసా జరగనిది' అని ప్రసిద్ధిని పొందిన పవిత్రయజ్ఞాన్ని అపవిత్రంచేసారు. అటువంటి పరిస్థితులలో మహాత్మా బుద్ధుడు జన్మించటం జరిగింది.

అప్పటికి సంస్కృతభాష అపభ్రంశంచెంది పాలీభాషగా రూపు దిద్దుకుంది. అప్పటి జనసామాన్య భాష పాలీభాష. అందుచే మహాత్మా బుద్ధని ప్రబోధాలన్నీ పాలీభాషలోనే జరిగాయి.

ఆనాడు నేపాల్ ప్రాంతాన్ని శాక్యవంశ క్షత్రియులు పరిపాలిస్తూ ఉండేవారు. అట్టివారిలో శుద్ధోధనుడు ఒక రాజు. అతని పుత్రునిగా సిద్ధార్థుడు (బుద్ధుడు) జన్మించాడు. అతడు చిన్ననాటినుండి ఆలోచనా పరుడుగా ఉండేవాడు. ప్రవృత్తి మార్గంకన్న నివృత్తిమార్గాన్ని ఎక్కువ యిష్టపడేవాడు. ఇది గుర్తించిన తండ్రి అతనికి వైరాగ్యం కలగకుండా జాగ్రత్తపడ్డాడు. విషాద సంఘటన ఏదీ అతని కంటపడకూడదని నౌకర్లను హెచ్చరించాడు. 16వ ఏటనే ఒక అందాలరాశి యశోధరతో వివాహం జరిపించాడు. అనతికాలంలోనే ఆ దంపతులకు ఒక బిడ్డ కలిగాడు. ఆ బాబుకు రాహులు డని నామకరణం చేసారు. భోగవిలాసాలతో సిద్ధార్థుని జీవితం ఆనందంగా గడచిపోతూ ఉండేది.

ఒక రోజు సిద్ధార్థునికి నగరవిహారం చేయాలనే కోరిక కలిగింది. రథాన్ని తెప్పించుకొని బయలుదేరుతాడు. ఊహించనివిధంగా దీర్ఘరోగంతో విపరీతంగా బాధపడుతున్న ఒక రోగి ఆయనకు కనబడతాడు. అతడు ఎందుకు బాధపడుతున్నాడని సారథిని అడిగాడు. 'వ్యాధివల్ల' అని సారథి సమాధానమిచ్చాడు. వ్యాధి అందరికి వస్తుందా? అని అడిగాడు. 'ఎవరికైనా రావచ్చు' అని సారథి సమాధానమిచ్చాడు. మరికొంత దూరం వెళ్ళగా ఒక వృద్ధుడు వంగిన నడుంతో కట్టె ఆధారంగా వణుకుతూ నడవటం చూస్తాడు. ఎందుచేత? అని సిద్ధార్థుడు అడగటం, ముసలితనంకారణం అని తెలుసుకోవటం జరిగింది. తిరుగు ప్రయాణంలో ఒక శవాన్ని మోసుకుంటూ కొందరు ఎదురురావటం జరిగింది. అది ఏమని సిద్ధార్థుడు అడిగాడు. 'మరణించిన శరీరం' అని

సారథి సమాధానం. వృద్ధాప్యం, మరణం కూడా ప్రతి మనిషికీ వస్తాయని సారథి ద్వారా తెలుసుకున్నాడు. ఇంతవరకు ఎట్టి దుఃఖకర సంఘటన చూడని సిద్ధార్థునకు ఈ మూడు ఘటనలు తీవ్ర మనస్తాపాన్ని కలిగించాయి.

అంతఃపురానికి చేరుకొని సిద్ధార్థుడు తీవ్రంగా ఆలోచించాడు. మానవులకు ఈ దుఃఖాలు ఎందుకు వస్తాయి? వీటిని పోగొట్టుకోవాలంటే ఏమి చెయ్యాలి? తెలుసుకోవాలనుకున్నాడు. దుఃఖనివృత్తికి మార్గం తెలుసుకొని మానవులందరిని ఉద్ధరించాలనే దృఢసంకల్పం కలిగింది. ఇరవైతొమ్మిదేళ్ళ ప్రాయంలో అందాలరాశియైన అర్ధాంగినీ, ముద్దులబిడ్డను, అపారమైన ఐశ్వర్యాన్ని, సకలవిధ సుఖభోగాలను పరిత్యజించి సిద్ధార్థుడు పరివ్రాజకుడయ్యాడు. ఆరేళ్ళపాటు గంగానదీ లోయలలో గురువుల నాశ్రయించి ఆధ్యాత్మిక జ్ఞానాన్ని పొందాడు. అది అతనికి తృప్తిని కలిగించలేదు. ఆ ప్రాంతాన్ని వదలిపెట్టి మగధరాజ్యంలో మరొక ఆరేళ్ళపాటు ఆలోచిస్తూ పరివ్రాజక జీవితం గడిపాడు. చివరకు ఉరువేల (ఇప్పటి బుద్ధగయ)కు చేరుకున్నాడు. నయనానందకరమైన ఆ ప్రాంతం సిద్ధార్థునకు నచ్చింది. అక్కడే తీవ్ర తపస్సుచేసి సత్యాన్ని తెలుసుకోవాలనుకున్నాడు.

ఉరువేల (బుద్ధగయ)లోనే సిద్ధార్థుడు ఆనాటి గురువులు సూచించిన తపస్సులు చేసాడు. క్లిష్టతరమైన ధ్యానముద్రను కొనసాగించాడు. శరీరం శుష్కించి పోయింది కాని సత్యసాక్షాత్కారం కలగలేదు. 'కడుపు తాకితే వీపు, వెన్నుతాకితే కడుపు తగిలేవి. కఠిన ఉపవాస దీక్షలవల్ల పొట్టవెన్నుకు అంటుకుపోయింది' అని సిద్ధార్థుడే అప్పటి దైన్యస్థితని గురించి ఒక సూత్రంలో వ్రాసుకున్నాడు. అయినా

ఫలితం కలగలేదు. క్రమంగా ఆయనలో వివేకోదయమయ్యింది. బాల్యంలో తాను జంబూవృక్షం క్రింద ధ్యానమగ్నుడైనప్పుడు పొందిన ఆనందపారవశ్యానుభూతి జ్ఞప్తికి వచ్చింది. దానిని మరల పొందాలంటే శారీరక బలం కావాలి. అందుకు ఆహారం అవసరం అనే ఆలోచన వచ్చింది. తాను చేస్తున్న సాధన సరియైనదికాదని తెలుసుకున్నాడు. ఉపవాసాన్ని ముగించి అంబలి త్రాగాడు. తపోదీక్షలో ఉన్న సిద్ధార్థునికి జ్ఞానసిద్ధికలిగితే తమకూ చెబుతాడనే ఆశతో అయిదుగురు యతులు ఎదురు చూస్తూ శుశ్రూషలు చేసేవారు. సిద్ధార్థుడు ఆహారం తీసుకోవడం చూసిన తరువాత ఆయనమీద నమ్మకం నశించి ఆ యతులు నిరాశతో దూరంగా వెళ్ళిపోయారు.

ఆహారం తీసుకున్న తరువాత సిద్ధార్థుడు మళ్ళీ ధ్యానంలో లీనమయ్యాడు. ఈసారి గురువులు చెప్పిన మార్గానకాక తన అంతర్వాణిని అనుసరిస్తూ ధ్యానసాధనలు చేసాడు. సమచిత్తతను సాధించి సుఖదుఃఖాలనుండి విముక్తుడయ్యాడు. పూర్వజన్మ పరంపరను మనో నేత్రంతో దర్శించాడు. మనం చేసుకున్న కర్మలే మన సూక్ష్మశరీరంలో సంస్కారాలను కలిగిస్తున్నాయనీ, ఆ సంస్కారాలే మరల జన్మలను కలిగిస్తున్నాయనీ తెలుసుకున్నాడు. సత్కర్మలు సుఖాలను, దుష్కర్మలు దుఃఖాలను కలిగిస్తున్నాయని గ్రహించాడు. దుఃఖాలు దూరం కావాలంటే దుష్కర్మలను విడిచిపెట్టాలనీ, ఏ ప్రాణినీ హింసించకూడదనీ, తెలుసుకున్నాడు. అహింస, సత్యము, అస్తేయము, బ్రహ్మచర్యము, అపరిగ్రహము మొదలైన వాటిని వ్రతాలుగా స్వీకరించి ఆచరించటమే సరియైన తపస్సు, సాధన అని ప్రచారం చేసాడు. తనను తాను బుద్ధునిగా ప్రకటించు కొన్నాడు. తృష్ణ, ఆశ, భయం, క్రోధం, ద్వేషం – ఇవే దుఃఖాలకు కారణమని బోధించాడు.

ఆనాడు యజ్ఞయాగాదులపేరుతో జరిగే పశుహింసను చూచి బుద్ధుడు చలించిపోయాడు. ప్రాణులను హింసించటం పాపమన్నాడు. పాపాలకు ఫలితం కష్టాలన్నాడు. ఆ ఉపదేశాలు ఆనాటి యాజ్ఞికుల చెవి కెక్కలేదు. యజ్ఞం పేరుతో చంపబడే పశువులన్నీ స్వర్గానికి పోతాయన్నారు. యజ్ఞాలు చేసేవారికి కూడా స్వర్గం ప్రాప్తిస్తుందన్నారు. బుద్ధుడు వారి మాటలను తీవ్రంగా ఖండించాడు. ఇవన్నీ అబద్ధాలన్నాడు. అమాయక ప్రజలను మోసగిస్తున్నారన్నాడు. దానికి సమాధానంగా యాజ్ఞికులు వేదాలలో చెప్పిన విధాంగానే మేము చేస్తున్నాం. వేదాలు ఈశ్వర ప్రోక్తాలన్నారు. బుద్ధునికి వేదాలతో పరిచయం లేకపోవటంచేత, సంస్కృతం రాకపోవటంచేత వేదాలను చదివిచూడలేకపోయాడు. అందుచేత 'మీ వేదాలతో నాకు పనిలేదు. అట్టి హింసను బోధించే మీ దేవునితోను నాకు పనిలేదు. నేను సాక్షాత్కారం చేసుకున్నది అహింసాధర్మం. నేను దానినే ప్రచారం చేస్తానన్నాడు. 'అహింసా పరమో ధర్మః' అనే పునాదిపై క్రొత్త మతాన్ని స్థాపించి ప్రచారం చేసాడు.

బుద్ధుని తపః ప్రభావంవల్ల, ఆయన మాటలలోని యథార్థతవల్ల పెక్కురు ఆయన అనుయాయులయ్యారు. కొందరు యువకులు సంన్యాసం స్వీకరించి ఆయన ననుసరించారు. అనతికాలంలోనే తండోపతండాలుగా జనులు బౌద్ధమతంలో కలిసిపోయారు. ఈ విధంగా ఆయన తన 80వ సంవత్సరం వరకు అహింసా ప్రచారం చేసాడు. చివరకు ఉత్తరప్రదేశ్‌లోని ఘోరఖ్‌పూర్ జిల్లా కుశీనగర్‌లో దివంగతుడయ్యాడు.

మహాత్మా బుద్ధుడు త్యాగం తపస్సు గల గొప్ప పవిత్రాత్మ. అందుచే అతడు జన సాధారణ భాషయైన పాళీభాషలో చేసిన ఉపదేశాలు ప్రజలలో అద్భుతమైన ప్రభావాన్ని చూపాయి. భయంకరమైన కళింగయుద్ధంచేసిన అశోకునికూడా మార్చివేయగలిగాయి. ప్రపంచ

చరిత్రలో అహింస ప్రాతిపదికగా విశాల సామ్రాజ్యాన్ని ఏలిన ఏకైక చక్రవర్తిగా అశోకుడు నిలిచిపోయాడు. సైన్యం లేకుండానే విశాల సామ్రాజ్యాన్ని పాలించాడు. కాని, ఆ అహింసవల్ల భయంకరమైన పరిణామాలేర్పడ్డాయి. ఎందరో సామంతరాజులు తమను తాము స్వతంత్రులుగా ప్రకటించుకున్నారు. దేశం ముక్కలు ముక్కలుగా విడిపోయింది. క్రమగా విదేశీ ఆక్రమణలకు గురి అయ్యింది.

ఇంతేగాక, బుద్ధుని తరువాత బౌద్ధమతంలో కొన్ని దోషాలు చోటుచేసుకున్నాయి. పెక్కుమంది యువకులు సంన్యాసులైపోవటంవల్ల దేశంలో క్షాత్రశక్తి నశించిపోయింది. పురుషులు సంన్యాసులైపోవటంవల్ల వారి స్త్రీలు "మమ్ముకూడా బౌద్ధమతంలో చేర్చుకొని సంన్యాసదీక్ష నిమ్మని ఆందోళన చేసారు. బుద్ధుడు బ్రతికుండగానే (ప్రచారం ప్రారంభించిన 6 సంవత్సరాలకే) ఈ ఆందోళన జరిగింది. బుద్ధుడు ప్రారంభంలో ఎంతమాత్రం అంగీకరించలేదు. ఆందోళన వత్తిడి పెరగడంతో వివశుడై కొన్ని కఠిన నియమాలు ఏర్పాటుచేస్తూ, స్త్రీలకు సంన్యాసదీక్ష నిచ్చి వేరుగా ఉంచసాగాడు. అయినా వయస్సు ప్రభావంతో చాలామంది యింద్రియనిగ్రహాన్ని కోల్పోయారు. అందుచే బుద్ధుని తరువాత బౌద్ధమత ప్రభావం క్రమంగా క్షీణించిపోయింది.

మహాత్మా బుద్ధుడు దేవుని గురించి ఉన్నాడని గానీ, లేడని గానీ ఏమీ చెప్పలేదు. ఆ విషయంలో మౌనం వహించాడు. అయినా బుద్ధుని అనంతరం అతని శిష్యులు నాస్తికవాదాన్ని స్థాపించి బౌద్ధ దర్శనాలను-నాస్తిక దర్శనాలను వ్రాసారు. ఈ విధంగానే మహావీరుడు జైనమతాన్ని ప్రచారం చేసాడు. కాలాంతరంలో వారి శిష్యులు కూడా జైనమతాన్ని స్థాపించి జైనదర్శనాలను వ్రాసారు. వీరుకూడా నాస్తికులే. బౌద్ధ జైన దర్శనాలు రెండూ చాలా క్లిష్టమైన తర్కంతో కూడిఉంటాయి.

సామాన్యులకు అర్థంకావు. ఆది శంకరాచార్యులవారు జైనమత పండితుల నోడించినప్పటినుండి వారు వారి దర్శనాలను ఎవరికీ కనబడకుండా దాచిపెట్టివేసారు. మహర్షి దయానందులవారు అతి కష్టంమీద వారి గ్రంథాలను సంపాదించి తమ 'సత్యార్థప్రకాశం' ద్వాదశసముల్లాసంలో హేతుబద్ధంగా తర్కించారు. ఈ రెండు నాస్తిక మతాలకన్నా పూర్వమే మన దేశంలో చార్వాకమత మనే నాస్తికమతం ఉండేది.

పూర్వం యాజ్ఞికులు గోరఖ్‌పూర్ రాజుగారిచే అశ్వమేధయజ్ఞం చేయించారట. ఆ సమయంలో అతని భార్యను ఒక గుఱ్ఱంతో సమాగమం చేయించారట. దానిని భరించలేక రాణి చనిపోయింది. దానితో రాజు విరక్తిని చెంది కుమారునికి రాజ్యాన్ని అప్పగించి సాధువేషం వేసుకొని ఆ దుష్టబ్రాహ్మణుల గుట్టు రట్టు చేయ బయలుదేరాడు. రాజు రహస్యంగా ఆ దుష్టబ్రాహ్మణుల కార్యకలాపాలన్నీ తెలుసుకొని బహిర్గతం చేయ ప్రారంభించాడు. అదే కాలాంతరంలో చార్వాకమతంగా రూపుదిద్దుకుంది. అనంతరం బృహస్పతి యను వ్యక్తి చార్వాకదర్శనం వ్రాసాడు. ఈ దర్శనంలో యాజ్ఞికులను తీవ్రంగా విమర్శించాడు. దానితోబాటు వేదాది శాస్త్రాలను కూడా ఖండించాడు.

ఈ నాస్తిక దర్శనాల ప్రభావంవల్ల క్రమంగా ప్రజలలో వేదశాస్త్రాలపట్ల వ్యతిరేకత మొదలయ్యింది. గృహస్థులు విధిగా ఆచరించవలసిన పంచమహాయజ్ఞాలకు, షోడశసంస్కారాలకు దూరమయ్యారు. వర్ణాశ్రమ ధర్మాలు పుస్తకాలవరకే పరిమితమయ్యాయి. విచిత్రమైన నివృత్తి మార్గాన్ననుసరించారు. పురుషార్థం లోపించి ప్రగతి వెనుకంజవేసింది. సోమరితనం, స్వార్థం పెరిగిపోయాయి. ఆ సమయం లోనే ఆది శంకరాచార్యులవారు జన్మించటం జరిగింది.

## ఆది శంకరులు - మహర్షి దయానందులు

పూర్వ ప్రకరణం (మహర్షి దయానందుని అభిప్రాయాల)లో తెలిసికొన్నట్లుగా ఆది శంకరులు చిన్నతనంలోనే సంన్యాసాశ్రమం స్వీకరించి వ్యాకరణాన్ని, వేదాది సమస్త శాస్త్రాలను అధ్యయనంచేసి వేదమతం యొక్క వైశిష్ట్యాన్ని గుర్తించారు. ఆనాటి దేశపరిస్థితని చూసి తనలో తాను 'ఆహా సత్యమైన వేదమతం అడుగంటిపోయి జైన నాస్తిక మతాలు ప్రబలి గొప్పకీడు కలుగుతున్నది కదా ! ఏ విధంగా ఈ నాస్తిక మతాలను పారదోలాలా!' అని ఆలోచించారు. చార్వాక బౌద్ధ జైన దర్శనాలను కూడా చదివియున్నారు కనుక వారి కుయుక్తులేమిటో వారికి బాగాతెలుసు. అందుచే వారిని శాస్త్రార్థాలతో తేలికగా ఓడించవచ్చునని భావించారు. ఉజ్జయినీ నగరంచేరి రాజైన సుధన్వుని సంప్రతించి శాస్త్రార్థాల నేర్పాటుచేయించి జైన పండితుల నందరిని ఓడించారు.

శంకరాచార్యులవారి ఉపదేశాలవల్ల క్రమంగా ప్రజలలో మార్పు వచ్చింది. యజ్ఞోపవీతాలు ధరించి వేదాల పఠన పాఠనాలు ప్రారంభించారు. ఇంతలో కపట జైన పండితుల ద్వారా ఆయన చంపివేయబడ్డారు. వారి అనంతరం వారి శిష్యులు వేదాల పట్ల శ్రద్ధ వహించలేదు. వారి అద్వైతమత ప్రచారంలోనే మునిగిపోయారు. జైనులు - శంకరానుయాయులు ఒకరినొకరు ఖండించుకుంటూ చాలాకాలం గడిపారు. శంకరాచార్యులవారి అనంతరం మూడువందల సంవత్సరాలకు ఉజ్జయినీ నగరానికి గొప్ప పరాక్రమవంతుడైన విక్రమాదిత్యుడు రాజయ్యాడు. అప్పటికే దేశం చిన్నచిన్న రాజ్యాలుగా - సంస్థానాలుగా విడిపోయింది. చిన్నచిన్న రాజులు పరస్పరం కలహించుకుంటూ ఉండేవారు. విక్రమాదిత్యుడు అద్భుతమైన తన

రాజనీతి చతురతతో వారి కలహాలను మాన్పి శాంతిని స్థాపించాడు.

అనంతరం వచ్చిన బర్తృహరి రాజుకు కొంత విద్వత్తు ఉండేది. అతడు కావ్యాలను, ధర్మశాస్త్రాలను చదివినవాడు. కాని, అతనిలో వైరాగ్యం కలిగి రాజ్యాన్ని వదలిపెట్టి వెళ్ళిపోయాడు. అతని అనంతరం సుమారు అయిదువందల సంవత్సరాలకు సంస్కృతజ్ఞానం గల భోజుడు రాజుగా రావటం జరిగింది. ఈతని కాలంలోనే సంస్కృతభాషకు మరల ప్రోత్సాహం లభించింది. ఎవరైనా సంస్కృతంలో మంచి శ్లోకాలు వ్రాసి వినిపిస్తే విశేషంగా ధనాన్నిచ్చి సన్మానించేవాడు. ఆయన సమయంలోనే గొల్లవాడుగా నుండే కాళిదాసు సంస్కృత విద్వాంసుడై రఘువంశ కావ్యాన్ని రచించాడు. భోజుని అనంతరం మరికొందరు రాజులు వచ్చారుకాని ఎవరును వేదాది సత్యశాస్త్రాల ప్రచారానికి కృషిచేయలేదు. కొంతకాలం తదుపరి పృథ్వీరాజు చౌహాన్ ఇంద్రప్రస్థానికి రాజయ్యాడు. ఇతని కాలంలోనే విదేశీయుడైన సుల్తాన్ షహబుద్దీన్ గోరీ దండయాత్రలు చేసాడని కొందరు ఇతిహాసకారులు వ్రాసారు. పృథ్వీరాజ్ ఎన్నో పర్యాయాలు ఆ దండయాత్రలను త్రిప్పికొట్టగలిగాడు. చివరికి దేశంలోని అంతః కలహాల కారణంగా పృథ్వీరాజు పరాజయాన్ని పొందాడు. గోరీ అతనిని అంధునిగాచేసి తన దేశానికి తీసుకుపోయాడు. తాను ఇంద్రప్రస్థానికి రాజయ్యాడు.

మరికొందరి కథనం ప్రకారం - పృథ్వీరాజు తదుపరి 5వ తరంలో వాడైన యశపాలమహారాజు సమయంలో సుల్తాన్ షహబుద్దీన్ గోరీ గఢగజనీనుండి యశపాలమహారాజుపై దండయాత్ర జరిపి అతనిని ప్రయాగకోటలో బంధించి తాను ఇంద్రప్రస్థానికి రాజయ్యాడు. అప్పటి నుండి అతని సంతతివారు 53గురు 745 సంవత్సరాల ఒక నెల 12 రోజులు రాజ్యం చేసారు. అనంతరం క్రమంగా మనదేశం ఆంగ్లేయుల

పాలయ్యింది.

శంకరాచార్యులవారి అనంతరం ఒక ప్రక్క రాజుల రాజ్యం నడుస్తుండగా మరొక ప్రక్క ఆధ్యాత్మిక క్షేత్రంలో గురువుల రాజ్యం నడిచింది. విక్రమాదిత్యుని కాలంనుండి శైవుల బలం పెరిగింది. శంకరాచార్యుల వారిని శివుని అవతారంగా నిర్ణయించుకున్నారు. వారి అనుయాయులను తమలో కలుపుకున్నారు. వామమార్గులను గూడ తమలో కలుపుకోవడానికి ప్రయత్నించారు.

భోజరాజు తరువాత 150 సంవత్సరాలకు వైష్ణవమతం ప్రారంభమయ్యింది. అవిద్వాంసుడైన శఠగోపు డనేవాడు దీనిని ప్రారంభించాడు. నాల్గవతరంలో రామానుజు డనే విద్వాంసుడైన బ్రాహ్మణుడు దీనికి ఆచార్యుడై ఆ మతాన్ని విస్తరింపచేసారు. వీరు శంకరాచార్యులవారు చెప్పిన అద్వైతమతాన్ని ఖండిస్తూ ప్రస్థాన త్రయానికి క్రొత్తగా భాష్యం వ్రాసారు. శైవులు శివపురాణాదులను, శాక్తేయులు దేవీభాగవతాదులను, వైష్ణవులు విష్ణుపురాణాదులను వ్రాసారు. అవి తమ పేరుతో వ్రాస్తే ప్రజలు నమ్మరని వ్యాసాది ఋషిమునుల పేర్లతో వ్రాసారు. ఈ వైష్ణవులే జైనుల ననుకరిస్తూ – జైనుల 24మంది తీర్థంకరులకు మారుగా 24 అవతారాలను కల్పించారు. జైనుల ఆదిపురాణ ఉత్తరపురాణాదుల వలె 18 పురాణాలు వ్రాసారు. అమాయకులైన ప్రజలు జైన మందిరాలకు, కథా శ్రవణాలకు పోయి నాస్తికులు కాకుండుటకే ఈ ప్రయోగం చేయబడిందని పెద్దలు చెబుతారు.

మరికొంతకాలానికి మధ్వాచార్యులు వచ్చి ద్వైతమతాన్ని స్థాపించి ప్రచారం చేసారు. వీరుకూడా ప్రస్థానత్రయానికి ద్వైతపరంగా భాష్యం వ్రాసారు. ఇట్లే కాలాంతరంలో కబీర్‌పంథా, నానక్‌పంథా, దాదూపంథా, రామస్నేహిపంథా మొదలైన ఎన్నో సాంప్రదాయాలు పుట్టాయి. అట్లే

స్వామినారాయణమతం, లింగాంకితమతం మొదలైన మతాలు వెలిసాయి. బ్రహ్మసమాజం - ప్రార్థనా సమాజం వంటి సమాజాలు ప్రారంభమయ్యాయి. గుడులను, గురువులనే కాకుండా ప్రజలు తీర్థాలను (గంగా యమునా మొదలు నదులను) కూడా సేవించటం ప్రారంభించారు. ఒకే వేదమతం వందల సాంప్రదాయాలుగా విడిపోయింది. దానికితోడు విదేశీ దురాక్రమణలతో విదేశీమతాలైన మహ్మదీయ, క్రైస్తవమతాలు మన దేశంలో ప్రవేశించాయి. అధికారం వారిది కావటంతో ప్రజలను అనేక విధాలుగా బాధించి బలవంతంగా వారి మతంలో కలిపేసుకున్నారు. ఇట్టి విపత్కర పరిస్థితులలో మహర్షి దయానందులవారు మన దేశంలో జన్మించారు.

మహర్షి దయానందులవారు కొంతకాలం దేశసంచారంచేసి దేశ పరిస్థితిని సరిగా అర్థంచేసుకున్నారు. ఇట్టి దుర్భరస్థితికి మూలకారణం మనం వేదోపదేశాలకు దూరంకావడమేనని గ్రహించారు. వ్యాధికి సరియైన కారణం తెలిసింది కనుక కార్యక్షేత్రంలో ప్రవేశించారు. 'పాఖండ ఖండినీ' పతాకాన్ని చేతబూని హరిద్వార్‌లో జరిగే కుంభమేలాలో పాల్గొన్నారు. అచట భీమగోడ సప్తమ సరోవర తీరంలో ఒక కుటీరం వేసుకొని మేలాకు వచ్చిన భక్తులకు వేదోపదేశంచేయ ప్రారంభించారు. వేదవిరుద్ధ మూర్తి పూజను, మృతక శ్రాద్ధతర్పణాలను, అవతారవాదాన్ని, 18 పురాణాలను, దేవీ దేవతల మహాత్మ్యాలను ఖండిస్తూ ప్రచారం చేసారు. ఈ మూఢనమ్మకాలకు వేదాలలో ఒక్క ప్రమాణం కూడా లేదన్నారు. విద్వాంసులు నాతో శాస్త్రార్థంచేయవచ్చునన్నారు. ఎంతోమంది పౌరాణిక పండితులు మహర్షితో శాస్త్రార్థంచేసి ఓడిపోయారు. ఆవిధంగా ప్రారంభమైన మహర్షి ప్రచారం బహుముఖాలుగా వ్యాప్తిచెందింది.

మహర్షి ధార్మిక మూఢనమ్మకాలనే గాక సామాజిక రాజనైతిక దురాచారాలనుకూడా ఖండించారు. అంటరానితనం అసలు మన వైదిక ధర్మంలోనే లేదన్నారు. సామాజిక జీవనంలో అందరూ సమానమేనని మన వేదం చెబుతుందన్నారు. అందుకు ప్రమాణంగా 'అజ్యేష్ఠాస అకనిష్ఠాస **ఏతే సంభ్రాతరః' (ఋ. 5-60-5)** మీలో ఒకరు ఎక్కువగాని ఒకరు తక్కువగాని కారు. మీరంతా సోదరులు - సోదర సమానులు. 'సమానీ ప్రపా సహవో ऽ న్నభాగః' మీ బావులు ఒకటిగా ఉండాలి. అందరి అన్నభాగములు ఒకటిగా ఉండాలి. **(అథర్వ. 3-30-6)** 'సహభక్షాః స్యామ' - **(అథర్వ. 6-47-1)** మీరంతా కలిసి ఒకచోట భోజనం చెయ్యాలి - మొదలగు వాక్యాలు చూపించారు. (ఈ విధంగా సమానత్వాన్ని తెలిపే మంత్రాలు వేదాలలో వేలకొలది ఉన్నాయి. మహాభారతకాలంనాడు కూడా (రాజసూయ యజ్ఞానంతరం) ఋషులు, మునులు, విద్వాంసులు, బ్రాహ్మణ క్షత్రియ వైశ్య శూద్రులు అంతాకలిసి సహపంక్తి భోజనం చేసారన్నారు. మహర్షి సర్వులకు అర్థమయ్యేటట్లు ఆర్యభాష (హిందీ)లో 'సత్యార్థప్రకాశ'మనే అద్భుత గ్రంథాన్ని వ్రాసారు. దానిలో అనేక ప్రశ్నలకు, సందేహాలకు హేతుబద్ధంగా సమాధానాలు వ్రాసారు. అది భారతీయులైన ప్రతివారూ చదువవలసిన అద్భుత గ్రంథం. దానిలోని మొదటి పది సముల్లాసాలలో (అధ్యాయాలలో) పరమేశ్వరీయ జ్ఞానమైన వేదం ఏమి ఉపదేశిస్తున్నదో వివరించి చెప్పారు. మిగిలిన నాలుగు సముల్లాసాలలో వివిధ మతాల లోని, సాంప్రదాయాల లోని, నమ్మకాలలోని దోషాలను ఎత్తిచూపి తర్కబద్ధంగా వాటిని ఖండించారు.

మధ్యకాలంలో వేదాలకు సాయన, ఉవ్వట, మహీధరాదులు వక్రభాష్యాలు వ్రాయటం జరిగింది. వారు చేసిన భాష్యాలలోని లోపాలు

చూపుతూ ప్రాచీన ఋషిమునుల పంథా ననుసరించి యజుర్వేదానికి పూర్తిగా భాష్యం వ్రాసారు. ఋగ్వేదానికి కొంతవరకు భాష్యం వ్రాయునప్పటికే మూర్ఖులు మహర్షిని చంపివేసారు. మహర్షి సాంఘిక దురాచారాలైన అంటరానితనం, బాల్యవివాహాలు, వృద్ధవివాహాలు, బహుభార్యత్వం, జన్మమూలక వర్ణవ్యవస్థ మొదలైన వాటిని తీవ్రంగా ఖండించారు. ఇవన్నీ వేదవిరుద్ధమని నిరూపించారు. ఇక రాజనైతిక క్షేత్రంలో ఆయన చేసిన సంస్కరణలు, కృషి అజ్ఞాతంగాఉన్నా అవి అద్వితీయమైనవి. విదేశీయుల పరిపాలన అంతమొంది స్వాతంత్ర్యం వచ్చేవరకు మనం ప్రగతిని సాధించలేమని వారు గట్టిగా నమ్మారు.

క్రీ.శ. 1856-61 మధ్యకాలంలో కాన్పూరు ప్రాంతం స్వాతంత్ర్య సమరక్షేత్రంగా ఉండేది. మహర్షి ఆ ప్రాంతంలో సంచరించి సైనిక గుడారాలలో రహస్య సమావేశాలు ఏర్పాటుచేసి స్వాతంత్ర్యపోరాటానికి సైనికులను ప్రేరేపించేవారు. వారి ప్రేరణ ఫలితంగానే 1857నాటి ప్రథమ స్వాతంత్ర్య సంగ్రామం (సైనిక తిరుగుబాటు జరిగింది). స్వాతంత్ర్య సమరాన్ని ఒక యజ్ఞంగా కల్పన చేస్తే అది మొదటి ఆహుతి. ఆ ఆహుతి మహర్షి వేసినదే. అప్పటికి రాజపుత్రులలోనే కొంత క్షాత్రం మిగిలిఉండేది. మిగిలిన దేశమంతా నిర్వీర్యంగా ఉండేది. అందుచే తరచుగా మహర్షి రాజస్థాన్‌లో సంచరిస్తూ ఆ ప్రాంత రాజులలో ప్రేరణ కలిగించేవారు. విదేశీవస్తు బహిష్కరణ, స్వదేశీవస్తు ప్రోత్సాహం, గోహత్యానిషేధం మొదలైన ఉద్యమాలను మహర్షి దయానందులే మొదట ప్రారంభించారు. అంగ్లేయుల ఎదుట వారి మతంలోని లోపాలను నిర్భయంగా ఎత్తిచూపారు. 'మీ ఉపన్యాసాలలో మేము చేయుచున్న ప్రజాహిత కార్యాలను ప్రస్తుతించండి' అని ఆంగ్లేయులు మహర్షిని కోరితే నిర్భయంగా దానికి తన వ్యతిరేకతను తెలిపారు. నా దేశ స్వాతంత్ర్యం

కొరకే నేను దేవుని ప్రార్థిస్తానన్నారు. ఆవే మాటలు తమ గ్రంథాలలో వ్రాసారు.

విక్రమ శకం 1931 చైత్ర శు॥ పాడ్యమి (యుగాది - క్రీ.శ. 7-4-1875) రోజున ముంబాయి (గిరిగాంవ్) లో మహర్షి దయానందుల వారు 'ఆర్యసమాజ' మనే పేరుతో ఒక వైదిక ధర్మ ప్రచార సంస్థను నెలకొల్పారు. పరమేశ్వరీయ వేదాన్ని, ప్రాచీన ఋషిమునులు వ్రాసిన శాస్త్రాలనీ ప్రచారంచేసి - ఆచరింపచేసి మరల పూర్వపు ఔన్నత్యానికి తీసుకువెళ్ళటమే ఈ సమాజ స్థాపన యొక్క ముఖ్యోద్దేశ్యం. అందుకనుగుణంగా పది నియమాలతో ఆర్యసమాజ దశ నియమాలు రూపొందించారు. ఆ నియమాలు కేవలం ఆర్యసమాజీయులకే కాదు. మానవమాత్రులందరు అనుసరించదగినవి. క్రమంగా ఆర్యసమాజ శాఖలు ఉత్తర భారతమంతా విస్తరించాయి. అఖిల భారత జాతీయ కాంగ్రెస్ సంస్థ ప్రారంభించిన మొదటి రోజులలో ఆర్యసమాజ మందిరాలను కాంగ్రెస్ కార్యాలయాలుగా వాడుకోవటం జరిగింది.

మహర్షి దయానందుని అనంతరం పెక్కురు ఆర్యులు కాంగ్రెస్ సంస్థద్వారా స్వాతంత్ర్యసంగ్రామంలో పాల్గొన్నారు. డా॥ పట్టాభి సీతారామయ్యగారు వ్రాసిన 'కాంగ్రెస్ చరిత్ర' అనే పుస్తకంలో "నాటి సహాయ నిరాకరణ ఉద్యమంలో పాల్గొన్న వారిలో నూటికి 80శాతం ఆర్యసమాజీయులో లేక మహర్షి దయానందుని గ్రంథముల పఠనంతో ప్రేరణ పొందినవారో ఉన్నారు" అని వ్రాసారు. ఈ ఒక్క వాక్యాన్ని మననం చేస్తే చాలు స్వాతంత్ర్య ఉద్యమంలో మహర్షి పాత్ర ఎంత ఉందో అర్థంకాగలదు.

శ్రీశ్యామ్‌జీ కృష్ణవర్మ, పంజాబ్ కేసరి లాలా లాజ్‌పతిరాయ్,

స్వామి శ్రద్ధానంద, బక్షీ, జయశ్రీరామ్, రాయ్ మూలరాజ్, డా॥ సత్యపాల్, శ్రీరామ భజదత్త మొదలైన నాయకులంతా ఆర్యసమాజీయులే. వీరంతా మహాత్మా గాంధీగారు సారథ్యం వహించిన స్వాతంత్ర్య పోరాటంలో తను మనో ధనముల నర్పించి పోరాడారు. అందరి కృషి ఫలితంగా 1947 ఆగష్టు 15వ తేదీన మనకు స్వాతంత్ర్యం వచ్చింది. ఈ విధంగా మహర్షి దయానందులవారు 1857లో ప్రారంభించి మొదటి ఆహుతి వేసిన స్వాతంత్ర్యసమరయజ్ఞం మహాత్మాగాంధీగారి చివరి ఆహుతితో పూర్తయ్యింది.

ఎందరెందరో మహానుభావుల త్యాగ తపః ఫలంగా లభించిన ఈ స్వాతంత్ర్యాన్ని మనమంతా జగ్రత్తగా కాపాడుకోవలసిన బాధ్యత మనపై ఉంది. అంతేగాక మనం ప్రగతిపథంలో పయనించవలసిఉంది. మన పూర్వపుటౌన్నత్యాన్ని అందుకోవలసిఉంది. ఆర్యచక్రవర్తిరాజ్యం సాధించవలసిఉంది. విద్యలోను చరిత్రలోను ప్రపంచ గురువులం కావలసి ఉంది. అందుకు మహర్షి దయానందులవారు సూచించిన వేదోక్త ధర్మమార్గమే సర్వోత్తమం. అదే మనని అట్టి ఉన్నత స్థితికి చేర్చగలుగుతుంది.

వేదాలు పరమేశ్వరీయ జ్ఞానం. అవి ఆదిమానవులకే గాక అన్ని కాలాలోని మానవులకు జ్ఞానవికాసాన్ని కలిగించగలవు. సర్వజ్ఞుడు, సృష్టికర్తయునైన పరమేశ్వరునికన్న జ్ఞానవంతులా నేటి విజ్ఞానవేత్తలు? సర్వప్రాణులకు తల్లీతండ్రీ అయిన పరమేశ్వరునికన్న మిన్ననా నేటి సంఘసంస్కర్తలు? అందుచే నేడును వేదమార్గమే అనుసరణీయం.

వేదాలు చదువబోయేముందు మహర్షి దయానందులవారి **'సత్యార్థప్రకాశం' 'ఋగ్వేదాది భాష్యభూమిక'** తప్పక చదవండి. వారు వ్రాసిన ఏ గ్రంథం కూడా తక్కువదికాదు. **'పంచమహాయజ్ఞవిధి'**

మానవుడుగా పుట్టి కనీసం ఆచరించవలసిన కర్తవ్యాలను బోధిస్తుంది. 'సంస్కారవిధి' ఉత్తమ మానవ నిర్మాణానికి, ఉత్తమ మానవ సమాజ నిర్మాణానికి రాజమార్గం చూపిస్తుంది. వారి లఘు గ్రంథాలన్నీ మనకు జ్ఞానాన్ని కలిగించేవే.

మహర్షి దయానందుని అనుయాయులు సృష్టించిన - రచించిన వైదిక సాహిత్యం అపారంగా ఉంది. మీకు సమీపంలోగల ఆర్యసమాజ మందిరాలలో వాటి వివరాలు తెలుసుకోవచ్చు. మహర్షి చూపిన మార్గంలో ఆర్యవిద్వాంసులు వేదాలకు హేతుబద్ధంగా భాష్యాలు వ్రాసారు. దర్శన ఉపనిషదాది గ్రంథాలకు వేదానుకూలమైన వ్యాఖ్యానాలు చేసారు. వాటితోపాటు ప్రాచీన చరిత్రను అధ్యయనం చేసి ఇతిహాస గ్రంథాలుకూడా వ్రాసారు. శ్రీ పం. జగదీశ్వరానంద సరస్వతిగారు మధ్యకాలంలో చొప్పింపబడినవి శ్లోకాలను తొలగించి విశుద్ధ వాల్మీకి రామాయణం, విశుద్ధ మహాభారతం అనే రెండు ఇతిహాస గ్రంథాలు వ్రాసారు. అందులో టిప్పణుల ద్వారా ఎన్నో వైజ్ఞానిక విషయాలు తెలిపారు. ప్రొఫెసర్ పం. సురేంద్రకుమార్‌గారు వ్రాసిన విశుద్ధ మనుస్మృతికూడా చదువవలసిన ఒక గొప్ప గ్రంథం.

పం. భగవద్దత్తగారు 'భారతవర్షకా బృహత్ ఇతిహాస్' రెండు బృహత్ గ్రంథాలుగా వ్రాసారు. ఇతిహాసాన్ని గురించి లోతుగా అధ్యయనం చేయగోరే వారికి అవి బాగా ఉపకరిస్తాయి.

ప్రఖ్యాత చరిత్ర పరిశోధకులు శ్రీ పి.యన్. ఓక్ గారి గ్రంథాలన్నీ చదువదగినవే. ఈ పై గ్రంథాలన్నీ పుస్తక విక్రేతలు 'విజయకుమార్ గోవిందరామ్ హాసానంద్, 4408 - నఈ సడక్, ఢిల్లీ - 110 006" గారి వద్ద లభిస్తాయి. సరళమైన ఆర్యభాషలో (హిందీలో) ఉంటాయి. తేలికగా చదివి అర్థం చేసుకోవచ్చును.

# ఉపసంహారము

ప్రియ పాఠకులారా !

ఈ చిన్న గ్రంథం ద్వారా మీకు మన ప్రాచీన ఇతిహాసాన్ని గూర్చిన సంక్షిప్త పరిచయం – ఒక అవగాహన ఏర్పడి ఉంటుంది. ఇది ముఖ్యంగా మన రామాయణ మహాభారతాల ఆధారంగాను, కొన్ని బ్రాహ్మణ గ్రంథాల ఆధారంగాను వ్రాయబడిన చరిత్ర. ఇందులోని వ్యక్తుల పేర్లు, నగరాల పేర్లు మన వేదాలలో కూడా కనబడతాయి. అట్లని వేదాలలో చరిత్ర ఉందని భావించరాదు. అక్కడ ఆ పదములకు ప్రకరణాన్ని బట్టి వేరే అర్థం ఉంటుంది. ఉదాహరణకు – ఊర్వశీ పూరూరవుల గురించి యజుర్వేదం (అ.5 మం.2) లో వస్తుంది. ఈ రెండు పేర్లు అగ్నికి విశేషణాలు.

**అగ్నేర్జనిత్రమసి వృషణౌ స్థ ఊర్వశ్యస్యాయురసి**
**పురూరవా అసి । (యజు. 5-2)**

ఈ మంత్రములో 'ఆయు' పదముకూడా ఉంది. ఊర్వశీ పురూరవులకు కలిగిన సంతానమే 'ఆయు' అని చరిత్రలో కనబడుతుంది. రెండు అగ్నులకు పుట్టినది అగ్నియే అవుతుంది. కనుక అగ్నికి 'ఆయు' అనే పేరుకూడా ఉందని పై వేదమంత్రం చెబుతున్నది. మరొక చోట ఈ విషయం మరికొంత వివరిస్తూ –

**సూర్యో గంధర్వస్తస్య మరీచయోఽప్సరసః ।**
**(యజుర్వేదం. 18-39)**

సూర్యుడంటే గంధర్వుడే. అతని కిరణములే అప్సరసలు.

ఈవిధంగా నహుషుడు, యయాతి, యదు, పురు, శంత, ఇక్ష్వాకు, అంబరీష, త్రిశంకు, కృష్ణ, అర్జున, చ్యవన మొదలైన పేర్లు వేదాలలో

ఉన్నాయి. అట్లే అంబ, అంబికా, అంబాలికా, రాధా అనే పేర్లు కూడా వేదాలలో ఉన్నాయి.

అంబే౽అంబికే ౽ అంబాలికే న మా నయతి కశ్చన ।

(యజుర్వేదం. 23-18)

స్తోత్రం రాధానాం పతే । (ఋగ్వేదం. 1-30-5)

ఈ పదములన్నిటికి ధాత్వర్థాలు వేరుగా ఉంటాయి. తెలుసుకోగోరువారు దయానందమహర్షి వ్రాసిన వేదభాష్యాలు చదువగోరుచున్నాను. వేదంలో ఉన్న ఈ పదములతోనే కాశీరాజు తన ముగ్గురు కుమార్తెలకు 'అంబ, అంబిక, అంబాలిక' అని నామకరణం చేసి ఉండవచ్చు.

ఇట్లే అథర్వవేదంలో ఋషుల పేర్లు చాలా కనబతాయి.

కణ్వః కక్షీవాన్ పురుమీఢో అగస్త్యః శ్యావాశ్వః సోభర్యర్చనానాః ।
విశ్వామిత్రో౽యం జమదగ్నిరత్రిరవన్తు నః కశ్యపో వామదేవః ।
విశ్వామిత్ర జమదగ్నే వశిష్ఠ భరద్వాజ గోతమ వామదేవ ।
శర్దిర్నో అత్రిరగ్రభీన్నమోభిః సుసంశాసః పితరో మృడతాం నః

(అథర్వ వేదము. 18-3-15, 16)

ఈ మంత్రాలలో పేర్కొన్న పేర్లన్నీ "సుసంశాసః పితరః". అంటే వీరంతా ప్రశంసిచతగిన పితరులు. అయితే, ఈ పితరులంతా సూర్య చంద్రుల కిరణములేకాని వ్యక్తులు కారు. ఆ కిరణములలో అంతటి దివ్య శక్తులున్నాయి. ప్రాణులను పాలించే ఆ దివ్యశక్తులను పాలకులు – రాజులు కూడా కలిగి ఉండాలని ఈ మంత్రం చెబుతున్నది. ఈ విధంగా ప్రాకృతిక శక్తులను ఉపమానంగా చూపుతూ రాజుల కుండ వలసిన గుణాలను వివరించే మంత్రాలు వేదాలలో వేలకొలది ఉన్నాయి.

ప్రాచీనకాలంలో రాజుల మహారాజుల పుత్రులుకూడా

బ్రహ్మచర్యదీక్షను పాటిస్తూ నగరానికి దూరంగా ఉపవనాలలో ఉండే గురుకులాలో చదువుకునే వారు. గురుకులాల్లో క్షత్రియులకు వేదాలతో బాటు ధనుర్వేదం, యుద్ధవిద్యలు నేర్పేవారు. వారిని గురువులు సదాచారపరులుగా, నీతిమంతులుగా, పరిపాలనాదక్షులుగా, న్యాయమూర్తులుగా తీర్చిదిద్దేవారు. బ్రహ్మచారులంతా భిక్ష తీసుకువచ్చి గురువుగారితోకూడా సమానంగా పంచుకొని భుజించేవారు. అందుచే సామాజిక స్పృహ - సమాజానికి ఋణపడి ఉన్నామనే భావన వారికి కలిగేది. స్నాతకులై గృహాలకువెళ్ళి గృహస్థులయ్యేవారు. తమ గుణకర్మ స్వభావాలకు తగిన వర్ణాన్ని స్వీకరించి సమాజసేవచేస్తూ జీవించేవారు. ఇట్టి స్థితి సృష్ట్యాదినుండి మహాభారత కాలంవరకు కొనసాగింది. తరువాత ఈ వ్యవస్థ అస్తవ్యస్తమౌతూ వచ్చింది.

ఇప్పుడు మనం ఒక వింత విచిత్ర ప్రజాస్వామ్యంలో ఉన్నాం. ఇది పేరుకు ప్రజాస్వామ్యమే కాని జరుగుతున్నది నాయకులస్వామ్యం. కోట్లు ఖర్చుపెట్టి పెడదారిన నాయకులౌతున్నారు. ఖర్చుపెట్టినదానికి 3, 4 రెట్లు (ఇంకా ఎక్కువ కూడా) అక్రమ మార్గంలో సంపాదిస్తున్నారు. పథకాల పేరుతో ప్రపంచ బ్యాంకు నుండి, విదేశాల నుండి అప్పులు తెచ్చి సగంపైన వారే కాజేస్తున్నారు. మన ఉత్పాదన అప్పులకు వడ్డీలను కట్టడానికే సరిపోతున్నది. భవిష్యత్ ఏమగునో అగమ్యగోచరం. ఇట్టి ప్రజాస్వామ్యంకన్న ప్రాచీన రాచరికపు వ్యవస్థయే మంచిదనిపిస్తున్నది. ఆ రాచరికపు వ్యవస్థలో ప్రజాస్వామ్యం పునాదిగా ఉండేది. రాజు ధర్మం తప్పితే ప్రజలు ఆ రాజును తప్పించి మరొక రాజును ఎన్నుకునేవారు. రాజులు మారేవారే కాని సంపదలు మన దేశంలోనే ఉండేవి. నేడు దానికి భిన్నంగా నాయకులు పట్టుబడితే పరువుపోతుందని అక్రమంగా

ఆర్జించినదంతా విదేశీ బ్యాంకులలో దాచుకుంటున్నారు.

పై పరిస్థితికి తోడు నేడు దేశంలో విదేశీ కంపెనీలదే పై చేయిగా ఉంది. ప్రజలలో విదేశీ వస్తువుల పై మోజు బాగా పెరిగిపోతున్నది. స్వాతంత్ర్యం రాకముందు మన నాయకులంతా విదేశీ వస్తువులను బహిష్కరిస్తే నేటి నాయకులు ప్రోత్సహిస్తున్నారు. దానితో విదేశీకంపెనీలు ప్రతి సంవత్సరం కోట్లాది రూపాయల ధనాన్ని బాహాటంగా వారి వారి దేశాలకు తరలించుకుపోతున్నాయి. లాభాలతో నడిచే మన భారతీయ పరిశ్రమలను బలవంతంగా మూసివేయిస్తున్నారు.

ముడుపులందుకొని మన నాయకులు విదేశాలలో నిషేధింప బడిన కొన్ని మందులను మనదేశంలో స్వేచ్ఛగా అమ్ముకోవడానికి అనుమతిస్తున్నారు. భారతీయ పంటలపైనా, మూలికలపైనా పేటెంటు హక్కులను విదేశాలకు ధారాదత్తం చేస్తున్నారు. ప్రపంచ బ్యాంకుకు దాసులై వారు ఆదేశించినట్లు ఆడుతున్నారు. ఈ పరిస్థితి యిట్లే కొనసాగితే భారత స్వాతంత్ర్యానికే ముప్పు రాగలదు.

ఈ విషయాలను వివరంగా తెలిసికోగోరువారు 'ఆజాదీ బచావో ఆందోళన' (గాంధీభవన్, చౌథమ్ లాయిన్స్, అలహాబాద్) వారు ప్రచురించిన, ప్రచురిస్తున్న సాహిత్యం చదవండి. ఆ ఉద్యమ ప్రచారకులైన శ్రీరాజీవ్ దీక్షిత్‌గారి ఓజస్వంతమైన ఉపన్యాసాల కేసెట్లు వినండి. నేడు ఈ స్థితిలో ఉన్న మన భారతమాతను ఎలా కాపాడుకోవాలో ఆలోచించండి.

గ్రంథవిస్తర భీతిచే ఈ గ్రంథాన్ని ఇంతటితో ముగించు చున్నాము.

"సర్వే జనాః సుఖినో భవన్తు"

ఓ౩మ్ స్వస్తి స్వస్తి స్వస్తి



శ్రీమత్ పరమహంస పరివ్రాజకాచార్య

**మహర్షి దయానంద సరస్వతి**

(ఆర్యసమాజ స్థాపకులు)